# భారతి

నవంబరు 1970



వ్య వ స్థా ప కు లు

దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులు

పాయి

# భారతి

మాసపత్రిక



సంపాదకుడు:

శివలెంక శంభుప్రసాద్



నవంబరు 1970



సంపుటము : 47 : సంచిక : 11

పాయి

# విషయానుక్రమణిక

## నవంబరు 1970

# అగ్నిపుత్రి

## శ్రీమతి నాయని కృష్ణకుమారి

చిక్కటి చీకటి పొర
సాంధ్య రాగాన్ని అదుముకుంటూ
ఊహాకందని ఎత్తుల నుండి
దిక్ఫలకాలను రాసుకుంటూ
ఎత్తుగా పొత్తుగా
దట్టంగా
విస్ఫుటిస్తున్న ప్రకాశంలా
అతి భయంకరంగా ఉంది
మనస్సు!

చిట్టచివరి కాంతిరేఖను సైతం
కనుమరుగు కానీక
కసిగాట్లు కరిచే
అస్తమిత సంధ్యా
కుపితారుణ ముఖ రాగ
ప్రతిరూపాలై లేచే
మంటలు
నా మనోగగనాన!

బుద్ధి కేమాత్రమూ
అందని నిర్గంధ బంధనాలు!
మంచెల్లలభాన్ని
మాటిమాటికీ
తడుముట్టూ తవ్వుకుంటున్న
వెలుగు మొగ్గలు!

## [illegible]

ఏదో నలికల త్రాచు
ఎఱ్ఱగా మెరుస్తూ
పారుతున్న సందడి లోలోపల!

ప్రశ్నార్థకాల్ని మోసుకుంటూ
ఏదేవదే మనసంతా
పారాడుతున్న
ఎఱ్ఱ తేలు పిల్లల
పినుపడి!

కన్నులలో
కోర్కెల మందారాలు
కోరగించడం లేదు!

మనోగగనాన
ఆశల హరివిల్లులు
అసలే విరియుడం లేదు!

ఆకాంక్షల రెక్కల రవ్వల
అందమైన
మిలమిలలు లేవక్కడ!

నాకు కావలసింది
నేను కోరుతున్నది
నాకే తెలీని స్థితిలో
అంతర్గత చైతన్యం మీద
ఈ నీలి మంటల
చెలగాట మేమిటో
భయం కలిగిస్తున్నది!

---

# ఈగలు

## శ్రీ డి. ప్రభాకర్

సుజాత పంతొమ్మిదేళ్ళ క్రితం పుట్టినది. పుట్టిన పదేళ్ళకి ఆ అమ్మాయికి సినిమా కోరిక—సినిమా చూడాలన్న కోరిక పుట్టింది. సుజాత ఆ కోరికను అడపదడపా వాళ్ల అమ్మావాళ్ళతోనో లేపోతే పక్కింటివాళ్ళతోనో వాళ్ళూళ్ళోవున్న ఏకైక టూరింగుటాకీసుకు వెళ్ళి తీర్చుకుంటుండేది. అయినా ఆ కోరిక తీరక, కనీసం తరగక సుజాతకంటే ఆలసంగా పుట్టినా సుజాతకంటే వేగంగా పెరిగి పెరిగి యిష్టంగా మారి కూచుంది.

సుజాత పెరుగుతున్న సినిమా యిష్టంతో ఎదుగుతూ ఏటేటా వాళ్ల హైస్కూల్లోని ఒక్కో మెట్టు యెక్కుతూ ఓ ఏడు ఆ స్కూలుతాలూకు ఒకేఒక్క అంతస్తును చేరుకుని 'యింతేనా! యింత కంటే పైకిపోయే అవకాశమేలేదా...లేదా..అని దిగులుగా దిగులుదిగులుగా చూసింది. అచ్చూసిన వాళ్ల నాన్నగారు జాలిపడ్డారు. అవకాశమిస్తే బిడ్డ పైచదువులు చదూకుంటుందని సంబరపడ్డారు. అలా సంబరపడినందుకు ఓనాడు వాళ్ళావిడతో గొడవపడి మర్నాడు సుజాతను అదేదో వూరు—[చిన్నవాళ్ళల్లో చిన్నవాడూ కాదు పెద్దవాళ్ళల్లో పెద్దవాడూకాదు అంటారే, అల్లాగు ఆ వూరు పల్లెల్లో పల్లేకాదు పట్నాల్లో పట్నంవూ కాదు!]— ఆ వూళ్లో వుంటున్న వాళ్ల 'పెద్దబ్బాయ్'దగ్గర చేర్చేరు.

పెద్దబ్బాయ్‌దగ్గర చేరిన సుజాత కాలేజీలో చేరింది. కాలేజీలో చేరేంతవరకూ, చేరిన కొన్నాళ్ల వరకూ సుజాత విరివిగా సినిమాల్చూసేసింది. మొట్ట మొదటిసారి ఆ అమ్మాయి 'సినిమా వెళ్తానన్నయ్యా' అని పెద్దబ్బాయ్ నడిగినప్పుడు అతగాడు నవ్వుతూ 'అలాగే వెళ్లిరా' అన్నాడు. అని చెల్లెల్తోపాటు తన పెళ్ళాన్నికూడా తోడు పంపేడు.

సినిమాహాల్దగ్గర వదిన రూపాయి ముప్పై పైసల టిక్కెట్లు కొంటున్నప్పుడు సుజాత అప్పటి వరకూ థర్డుక్లాసులో పావుతున్నదల్లా ఒక్కసారి ఫస్టుక్లాసు సంపాయించినట్లు సంబరపడిపోయింది. పల్లెటూరి ముప్పావలా టూరింగ్‌టాకీస్‌కి రెండు రెట్లెదిగిపోయాం అని ఆనందపడిపోయింది. ఆ ఆనందంతో హాల్లోకెళ్ళిన సుజాత ఆశ్చర్యపడిపోయింది— తన రూపాయిముప్పై పైసల క్లాసువెనుక, దాన్నెత్తిన యింకా ఖరీదైన క్లాసుల్ని చూసి! పండిన ఆశ్చర్యంతో వెళ్ళి వెనకవరసలో ఓ కుర్చీలో కూర్చుంది. కూర్చున్నాక ఆసక్తి నిండినకళ్ళతో కింద నున్నవాడు నిచ్చెనెక్కినవాణ్ణి తలెత్తి చూసినట్లు వెనక్కితిరిగి ఖరీదైన క్లాసుకేసి చూసింది.

వెనక లావుపాటికుర్చీ వరుసలున్నై. వాటిలో జనం వున్నారు. జనం వాడెవడో రాజాధిరాజు ఏర్పాటు చేసిన సభకొచ్చిన సామంతరాజుల్లా, రాణీల్లా వున్నారు. రాజులమాటేంగాని రాణీలు కట్టుకున్న చీరెలు, పెట్టుకున్న నగలు, చేసుకున్న అలంకారాలు తెల్లని నునుపైనకార్డుమీద అచ్చొత్తిన బంగారపు అక్షరాల్లా వున్నై. సుజాతకి వాళ్ళనీ, వాటినీ చూసే కొద్దీ ముచ్చటేసింది. ముచ్చటేసి 'అంత అందమైన చీరెలు వాళ్ళు కట్టుకుంటేనే అందం, అంత విలువైననగలు వాళ్ళు పెట్టుకుంటేనే అందం. అసలు స్వర్గానికి సోపానాల్లావున్న ఆ సీట్లలో వాళ్ళు కూచుంటేనే అందం' అనుకుంది. తననుకున్నమాటను వాళ్లొదినెతో చెప్పింది.

వదిన అది విని ఫక్కున నవ్వింది. నవ్వి అంది –

'వెర్రి సుజా! టైంకోసం గడియారంగాని గడియారంకోసం టైంకాదు. అలాగే చీరెలందం వాళ్లదిగాని వాళ్ల అందం చీరెలదిగాదు. అసలామాట కొస్తే వాళ్లు కట్టుకున్న చీరెలు నువ్ కట్టుకుంటే, వాళ్ల అలంకారాలు నువ్ చేసుకుంటే వాళ్లకంటే నువ్వే అందంగా వుంటావ్. అంత అందంగా ఆ కుర్చీలో కూచున్నావంటే వాళ్లకంటే నువ్వే హుందాగా వుంటావ్!'

అలా విని 'నిజంవా?' అనుకుంది సుజాత. ఆ ఒక్కసారేంటి 'నిజంవా నిజంవా' అని చాలాచాలా సార్లు అనుకుంది. అలా అనుకుంటూనే మరో టను కుంది—'ఐక్కచిక్కిన ఎద్దుని తీసికెళ్లి మునిసిపాలిటీ బండిక్కడితే మునిసిపాలిటీ ఎద్దవుతుంది. దాన్నే తీసికెళ్లి కొమ్ములకి రంగులేసి రంగురంగుల గుడ్డలు కప్పితే అదే గంగిరెద్దవుతుంది—మనంఫ్రా అంతే!'—అని! అలా అనుకున్నాక ఆ అమ్మాయికి వదిన చెప్పింది నిజంవే అనిపించింది. అలా అనిపించటం ఆలస్యం ముప్పావలా కలానికి బంగరపుక్యాపు [మాయబంగారపుదే కావొచ్చు] వున్నట్టు సుజాత పెంచుకున్న సినిమా యిష్టంచుట్టూ కొన్ని ఖరీదైన కోరికలు రెక్కలు కట్టుకొచ్చివేరిన్నై. అయితే ఆ కోరికలు శ్రీరామాంజనేయయుద్ధం పద్యాల్లా అయిదారు గ్రామఫోను రికార్డుల్లో లేవుగాని సినిమాల్లోని 'సోలో'పాటలా ఒకేఒక రికార్డుగా వున్నై.

సుజాత ఆ కోర్కెల రికార్డు పెట్టాలంటే వరమిచ్చే దేవుడే దిగొచ్చక్కర్లేదు—ఓపిగ్గా వినే వాళ్లుంటే చాలు. అసలొక్కోప్పుడు అలా వినేవాళ్లు గూడా వుండక్కర్లేదు—తనే ఒంటిగా కూచుని రికార్డు వేసుకుని విని ఆనందించగలదు. (విని ఏడ్వనూ గలదు. అది వేరే విషయం.)

సుజాత నీ విధంగా నవ్వించి, ఏడ్పించి యిష్టం వొచ్చినట్లల్లా ఆడించగల రికార్డులోని కోర్కె లేమిటయ్యా(మ్మా) అంటే......

......రానున్న సినిమాకి మూడ్రోజులముందుగా సినిమాహాల్దగ్గరికి నౌకర్నిపంపి మొదటి తరగతి ప్రేక్షకుడి నెత్తినుండే రిజర్వుడు క్లాసుకి టిక్కెట్లు రిజర్వు చేయించుకొనుట, అలా రిజర్వు చేయించుకున్న సినిమాకి రిజర్వు పోలీసులా ఏళ్లునిండిన డస్సులోకాకుండా అప్పటికప్పుడు బజార్నుండో చీరె, అప్పుడే విమానం దిగొచ్చిన సిల్కుచీరె (విమానం సిల్కు కాదుస్మీ) తెప్పించి తన వంటికి నప్పించి అందమైన ప్లిమత్‌కారులో (ఖర్మ! మనకి రోల్సు రాయిస్ ఉంటేనా!) సినిమాకి వెళ్లుట, అక్కడ జనమంతా తనని ప్రపంచసుందరిని చూసినట్లు పంచప్రాణాలూ విస్మయం పంచ నొదిలేసి చూచుట, తనేమో సగర్వంగా, 'భలేపెళ్లి' చిత్రదినోత్సవాని కొచ్చిన నటీమణిలా హుందాగా నడిచివెళ్లుట, యిలా యింకా సిని'ట' లున్నై.

అయితే యీ కోరికల్నీ తీరినట్లేనా?

నన్ను చెప్పనీండి మరి!!

ఓరోజు, దేశంలో అన్నిసమస్యలూ సస్యశ్యాములంగావున్నరోజు. సస్యశ్యామలంగావున్న సమస్యల్తో దేశం అతిమామూలుగావున్నరోజు సుజాత మామూలు కంటే కాస్త ఆలీసంగా నిద్రలేచింది. ఎదురుగావున్న వెంకటేశ్వరస్వామి క్యాలెండర్‌కేసి చూస్తూ 'అబ్బ! అప్పుడే ఫిబ్రవరొచ్చేసిందన్నమాటేదే' అని బద్ధకంగా ఆవలించి ఓచిన్న చిటికె వేసింది.

మరి సుజాత ఫిబ్రవరొచ్చేసినట్లుందే అన్నందుకో, ఆవలించి చిటికెవేసినందుకో తెలీదుగాని మొత్తానికి సుజాతలోని సుజాతకు—మనస్సుజాతకు—కూడ మెలకువొచ్చేసింది. రాగానే కళ్లైనా నులుముకోకుండా తెలుగు సినిమాలోని హిందీ బాణీల్లానో, హిందీ సినిమాలోని యింగ్లీషు బాణీల్లానో గబగబ అనేసింది—

'హేపీ బర్త్‌డే టూ యూ! హేపీ బర్త్‌డే టూ యూ సుజాతా!!'

'హరి నా! యివేళ నా పుట్టినరోజన్న సంగతే

మరిచిపోయేను!' అని కాస్తంత అశ్చర్యపోయింది సుజాత. తర్వాత 'యివ్వాళ నా పుట్టినరోజు' అని మురిసిపోయింది. వెంటనే పక్కింటిబామ్మగారు 'ఏవే పిల్లా వచ్చేయేడాదిలో నీ పెళ్ళిటగా' అనడిగితే సిగ్గుపడినట్టు సిగ్గుపడిపోయింది. అలా సిగ్గులోపడి యింతకీ లేవకపోయేసరికి మనస్సుజాత కన్నుమంది—

'నువ్వాగా సిగ్గుపడిపోవటమేనా లేక యివాళ పండగచేసేదేమన్నా వుందా'

'అన్నిపండగలు చేసేస్తున్నావా యిది చేసేందుకు'—సుజాత చిన్నబుచ్చుకున్నట్టుగా అంది

'అన్నిపండగలు అందరివీ! ఇది నీది' నువ్వెళ్ళి ఆ చేసేవాళ్ళకి 'యివాళ నా పుట్టినరోజు' చెప్పేస్తే తెలుస్తుంది. అంతేగానీ...అడగందే అమ్మేనా పెట్టదన్నారు'.

సుజాత కాటే సామెతలు తెలీవు. అయితే తనకు తెలిసిన సామెతల్లో చాలా నిజాలున్నాయని తెలుసు!

సుజాతకు అడగందే అమ్మైనా పెట్టదన్న సామెత తెలుసు!! అందేత 'సరే చెప్పిచూడాం'అని మంచంమీంచి లేచింది. అడిగేందుకు అమ్మలేదుగనక అమ్మలాటి వదిన్దగ్గరకెళ్ళి పీట వాల్చుక్కూచుంది.

'ఏమిటివ్వాళ ఉలుస్యంగా లేచావ్? ఆదివారమనా'—వదిన—పొయ్యి, పొయి మీదున్న గిన్నెమీంచి దృష్టి మరల్చకుండా సుజాత నడిగింది.

'ఊఁ! ఒద్సరేగానొదినా అసలు పుట్టినరోజు పండుగెలా చేసుకుంటారుట?'

'నీకు తెలీదా? నువ్వెప్పుడూ పుట్టినరోజు పండుగ జరుపుకోలేదా'

'అబ్బ! అన్నీ తెలిసినవాళ్ళతో యిదే బాబా చావు! అడిగింది చెప్పకుండా అడ్డుప్రశ్న లేస్తుంటారు!'

అన్నీ తెలిసిన వాళ్ళ జాబితాలో తను చేర్సేసరికి వదినకి సుజాతమీద అభిమానం—అది వరకే వుందేమో—అది కాస్త అధికమైంది. దాంతో కందెనవేసిన చక్రంలా మెత్తగా నవ్వుతూ పొయి కెదురుగావున్న పీటని సుజాతకేసి లాక్కుంది. గుళ్లోదాసుగారు భక్తులకి శ్రీ సత్యనారాయణ వ్రత మాహాత్మ్యం చెప్పినట్టు పుట్టినరోజు గురించి చెప్పింది.

'చెప్పేందుకేముంది సుజా! ప్రతిరోజూ శుభ్రంగా స్నానం చేస్తున్నా పుట్టినరోజునమాత్రం మరింత శుభ్రంగా తలంటుకు స్నానం చేస్తారు. యింటో పాతవాని బట్టలున్నప్పటికీ కావాలని కొత్త బట్టలకొని కట్టుకుంటారు. దేవుళ్ళకీ పెద్దవాళ్ళకీ నమస్కారాలు పంచేస్తారు. తర్వాత లహతుకుబట్టి తమ ఆనందాన్ని పిందులద్వారా పంచిపెడ్తారు!'

'అయితే వదినా యిల్లాంటి పండగల్చేసుకోవటం మంచిదేనంటావా'

'వూళ్లో వాళ్ళందర్నీ పిలవటం, పెద్ద పెద్ద పార్టీలివ్వడం మినహాయిస్తే యీ పండుగ జరుపుకోవటంలో తప్పేమీ లేదంటాను! ఎందుకంటే బ్రతికినంతకాలం మాట దేవుడెరుగు ఆ ఒక్క రోజన్నా ప్రతిఒక్కరూ రాజాలానో, రాణీలానో గడపొచ్చు!'

'మరైతే వదినా యివాళ నా పుట్టినరోజు!!'

'నిజంగా?'—వదిన ముఖంలోని నవ్వు ఆదివారం నాటి కరంటులా ఠక్కున ఆగిపోయింది.

'నిజంగానే వదినా! ఫిబ్రవరి ఫస్ట్ నా బర్త్‌డే!'

'అయితే ఆ విషయం ముందే చెప్పక నా చేత యింత వాగుడెందుకు వాగించావ్? అలా వాగించకపోతే నీ పుట్టినరోజు సరిగా చేయనని భయమేసిందా? నీ పుట్టినరోజనగానే ఏదో తలంటిపోసి యింత బెల్లం ముక్క నోట్లో వేస్తానని అనుమానం వేసిందా??'

"ఛ ఛ! అలాటిదేమీ లే దొదినా! ఒట్టు!"—

మరెలాటిదుందో చెప్పలేక సుజాత ముఖం అమాయకంగా పెట్టేసింది. ముఖంలోనే వుంటున్నది కాబట్టి నోరూ, నోట్లోంచొచ్చేయిగనక మాటలూ అమాయకంగా (రుగా) వున్నై.

ఒక టిక్కెట్టుమీద రెండు సినిమాల్చూసి నట్టు ఒక్క సుజాతలో అమాయకమైన అన్నింటిని చూసేసరికి వదినకి జాలేసింది. అంచేత సుజాతకేసి ఓ జాలిచూపేసింది—సుజాతో మాటాడిం మాటల్లోని జాలి వూపేసింది –

'పిచ్చి సుజా! ఏదేనా చెప్పేందుకూ, చెప్పి చేయించుకుందుకూ నాదగ్గర బిడియమెందుకు? లే. లే...స్నానం చేద్దువుగాని.'

సుజాత లేచింది.

వదిన కూడా లేచింది. లేచి గబగబ ముందు గదిలో గడ్డం గీసుకుంటున్న పెద్దబ్బాయ్ దగ్గర కెళ్లి—' ఏవండీ! యివ్వాళ సుజా పుట్టినోజుట' అంది.

'అల్లాగా! వెరీ గుడ్! అయితే యివాళ స్పెషలేం చేస్తున్నావ్?'

'నే చేసేదేదో నే చేస్తాగాని ముందు మీరు బజారెళ్లి అమ్మాయికో చీరె పట్టండి!'

సుజాత వదిన మాటల్నీ, మాటల్లోని సలహాని, ఆజ్ఞని కూడా వింది. అందువల్ల వదిన మాటలకి అన్నయ్య సమాధానం కూడా వినాలనిపించి గడప వతలగా నిలబడి చెవుల్ని గడ పివతల పడేసింది.

పెద్దబ్బాయ్ సుజాత నిలుచున్న ద్వారంకేసి చూస్తూ నవ్వుతూ –

'పుట్టినోజు పండక్కి చీరె కొనాలని రూలు పెట్టుకుంటే మీ ఆడాళ్లకి సంవత్సరాని కొక్క చీరె కంటె ఎక్కువ దక్కదు! అలా కాకుండా చీరె కొన్నప్పుడే పండుగ చేసుకుంటే నాలుగైదు చీరెలూ పండగలూ తగలొచ్చు. ఏమంటావ్ బేబీ!'

బేబీ అని పిలవబడ్డ సుజాత ఏమీ అన్లేదు.

వదినమాత్రం పెద్దగా 'అదిగాదండీ...' అంటూ వంగి పెద్దబ్బాయ్ చెవులో యేదో చెప్పింది. మరి పెద్దబ్బాయ్‌కి చెవులు దురదెత్తాయే యేమో ముఖం విసుగ్గాపెట్టి 'ఏంపీ అనుకోర్లే ఫో' అన్నాడు.

'సరె మీ యిష్టం' అంటూ వదిన అవతల కెళ్లి 'రా సుజా' అంది.

సుజాత వదినవెంట వెళ్లింది.

వదిన చెప్పినట్టు తలస్నానం చేసింది. యిస్త్రీ చీరె కట్టుకుంది. దేవుడికీ, పెద్దబ్బాయికీ నమస్కారాలు చేసింది. వదినకేసి పెట్టినవేవో తినీతిననట్టు తింది. ఆ తర్వాత వదిచెప్పినవేవో చేసింది.

అన్నీ యిష్టంలేని పెళ్లికూతుర్లా దిగులుగా చేసింది.

చేసి దిగులుగానే వెళ్లి మంచంమీద పడుకుని మనస్సుజాతను బయటకు తీసి చీవాట్లు పెట్టింది.

'అసలు నీ వల్లే జరిగిందింతా! ప్రొద్దున్నే లేచి 'హాపీ బర్త్‌డే' అంటూ హడావుడీ చేశావ్. ఆ విషయమే జ్ఞాపకం రాకుండా వుంటే యే బాధా వుండేదికాదు!'

'నాకేం తెలుసూ యిలా జరుగుతుందనీ! అయినా యిప్పుడు మించి పోయిందేవీ లేదు. ధైర్యే సాహసే సరికొత్త చీరె అన్నారు. వెళ్లి పెద్దబ్బాయ్‌ని దబాయించు. 'పుట్టినోజన ఆడపిల్లలచేత పాత చీరె కట్టించి కంటతడి పెట్టిస్తున్నావ్! అనుభవిస్తావ్!!' అని బెదిరించు దారికొస్తాడు'

'గుడ్‌లే! స్కాలర్‌షిప్పులమీద చదూకుంటున్న దాన్ని. అంత ధైర్యం ఎక్కడేడిసింది?'

'అయితే ఓ పన్జెయ్. తెలుగు సినిమాలోలా సీరియస్‌గా పెద్దబ్బాయ్ ముందునుంచి గోడనున్న గ్రూప్ ఫోటో దగ్గరకెళ్లి 'అమ్మా...నాన్నా నేను మీ దగ్గరుంటే నా పుట్టినోజిలా జరిగేదేనా! ఎంత మంచి బట్టలు కొనిపెట్టేవారూ. ఎంతమందికి విందుచేసేవారూ...ప్చ్.. ఇక్కడ ......యిక్కడ......

అంటూ ఏడువ్. దాంతో పెద్దబ్బాయ్ గాడిపొయ్యిలోని చింతమొద్దులా పశ్చాత్తాపంతో దహించుకుపోయి రెండు చీర్లు కొన్పెడలాడు.'

'ఏడిసినట్టుంది నీ ఆలోచన!'

'అయితే ఏడువ్!'

'హంతకన్నా వేయగలిగింది దేముందిలే...' అనుకుంటూ నిట్టూర్చింది సుజాత. ఆ నిట్టూర్పటం నిట్టూర్పటం సాయంత్రంవరకూ నిట్టూర్చింది. అసలు రాత్రివరకూ పాడిగిద్దామనుకుందిగానీ అప్పుడే బజార్నుండి పెద్దబ్బాయ్ హడావుడిగా వచ్చేడు. సుజాతను పిలిచేడు. పిల్చి—

'బేబీ చీరె కొనుక్కుందువుగాని బజారుకెళ్దాం రా' అన్నాడు.

సుజాత పక్కనేవున్న పెళ్లాన్నిచూసి — 'నువ్ చీరె కొనుక్కోకుళ్లేదుగానీ నువ్వూ రావోయ్ బజారుకి' అన్నాడు.

అతడలా అన్న అయిదునిముషాల్లో తయారై వచ్చింది సుజాత.

అతడలా అన్న అరగంటగ్గాని రాలేదు వదిన.

వాళ్లిద్దరూ వచ్చిన మరుక్షణంలోనే పెద్దబ్బాయ్ చేతిలో పుస్తకం అవతలపడేసి లేచేడు.

ముగ్గురూ యింటికి తాళంపడేసి, రోడ్డంట నడక సాగించేరు. ఆమాటా యీమాటా మాట్లాడుకుంటూ కొంతదూరం నడిచేసరికి మాటలైపోయి వటు మవునం వహించేరు. అలా కాస్త దూరం వెళ్లేక మవునం భరించలేనట్టు వదిన అంది—

'యింకెంత దూరం బాబూ నా కాళ్లు నొప్పెడుతున్నై!'

'అన్నయ్య వూళ్లకి వూళ్లు నడుస్తాడు. నడవమంటాడు. అంతేగాని కారువ్వాత్రం కొనడు'— సుజాత ముద్దుగా అంది. అన్నాక అన్న య్యేమంటాడోనని బెరుగ్గా చూసింది.

పెద్దబ్బాయ్ ఏమీ అన్లేదు. నవ్వీసేడంతే;

ఆ నవ్వున్చూసిన సుజాత— 'అరె! యిలా తేలిగ్గా నవ్వేస్తాడనుకుంటే. 'ఓస్ పిచ్చాదినా! మన కాళ్లు నొప్పెట్టినా, నొప్పెట్టిన కాళ్లు సంకెళ్లు పడ్డట్టు కదల్లేకపోయినా మా అన్నయ్యకు కన్ను అదిరినట్టైనా వుండదు. మన్చేత డబ్బు మోయిస్తాడే గాని డబ్బుమీద మన్ని సావరీ చేసేడు' అందునే'.— అనుకుంది. దాంతర్వాత మరోటి అనుకోబోయేంతలో బట్టలషాపొచ్చేసింది.

ట్యూబ్ లైట్లలో వెలుగుతున్న షాపునికంచంలో అన్నాన్ని చూసినటు ఆకలిగా చూస్తూ అన్నా వదినల్తో లోపలికెళ్లింది సుజాత.

లోపల బీరువాలున్నై: బీరువాల కద్దాలున్నై. అద్దాల్లోంచి చీరెలూ, మరి యితర గుడ్డలతాన్లూ కన్పిస్తున్నై—హోటల్ బీరువాలో పేర్చిపెట్టిన జాంగ్రీల్లా, లడ్డుల్లా, ... ల్లా,...ల్లా! అలా కన్పిస్తున్నవాటిని కళ్లారా చూస్తుంటే సుజాత మనసూరింది. మనస్సుజాత గిలిగింతలు కలిగేలా అంది—

'యిప్పుడు అన్నయ్య నిన్ను హోటల్కి తీసికెళ్లిన ఫ్రెండులా 'యేం తీసుకుంటావ్ బేబీ' అనడుగులాడు. నువ్వేమో మొహమాటపడీపడనట్టు పడుతూ, నవ్వీనవ్వనట్టు నవ్వుతూ 'ఆ బ్లూ చీరె పక్కనున్న...ఎర్రంచు...తెల్లచీర...' అన్చెప్తావు. అన్నయ్య పర్సుతీసి ఆ చీరె ఖరీదు కొట్టువాడి కిస్తాడు. కొట్టువాడు నీకు చీరె యిస్తాడు. యిహ నువ్వేమో ఆ చీర కట్టుకుని అప్సరసలా...'

'ఛీ పోవే!' అంది సుజాత లోలోపలే మురిసిపోతూ. మురిసిపోతూనే పెద్దబ్బాయ్ 'ఏం బేబీ ఏం తీసుకుంటావ'ని అడుగులాడేమోనని చూసింది. అలా ఎంతసేపు చూచినా పెద్దబ్బాయ్ అడగటం మాత్రం చూళ్లేక పోయింది.

దాంతో 'అన్నయ్య అలా అడగడు. హోటల్కి తీసికెళ్లినా ఫ్రెండులాకాక పెద్దమనిషిలా ఖరీదైన చీరెలన్నిటిని నా ముందు కుప్ప వేయిస్తాడు. అందు

లోంచి మంచి చీరె కోదాన్ని ఎన్నుకోమంటాడూ' అనుకుంది.

ఆ అమ్మాయ్ అలా అనుకుని అగ్నిముష మ్మైనా కాలేదు 'ఏం కావాలండీ' అనడిగిన సేల్సు మన్‌కి జవాబుగా పెద్దబ్బాయ్—' పాతిక ముప్పై రూపాయల్లో మంచి చీదన్నా వుంటే చూపించండి' అన్నాడు.

'పాతిక ముప్ఫై రూపాయల్లోనా??'— సుజాత కోపం మొచ్చింది. రిక్షావాడికోపమొచ్చింది. కడుపులో ఆకలి కళ్లల్లో ప్రాణాలూ పెట్టుకుని, రిక్షాలో కొండంత మనిషి నెక్కించుకుని, రిక్షా తొక్కి తొక్కి కోటదగ్గరకు చేరిస్తే, కొండంత మనిషి యిబ్బందిగాదిగి కోనంత జేబులోంచి వెతికి వెతికి పరకంటి పావలాకాసు తీసిచ్చినప్పుడు రిక్షా వాడికొచ్చే కోప మొచ్చి ది!

కాని అప్పుడే ఆ అమ్మాయికోటి జ్ఞాపకం వచ్చింది. అలా జ్ఞాపకం వచ్చిందీ తనకోపమె తనశత్రువు పద్యంకాదు—దాన్తాలూకు తాత్పర్యం. ఆ తాత్పర్యం కాస్తా గుర్తొచ్చేసరికి సుజాతలోని కోపం పెరిగి పోదామనుకున్నదల్లా కాస్తంత ఆలోచించి చేసింది. ఇది కనిపెట్టిన శాంతం పంతం నెగ్గి చేసింది. అప్పుడు శాంతవతియైన సుజాత అంత వరకు కోపంతో బిగపట్టిన పళ్లనూ, గట్టిగా పీల్చిన గాలినీ వదిలేసింది. వదిలేసి—కోప్పడి యేం చెయ్యగలం! అప్పడాల పిండి జీవితం వెళ్లదీస్తున్న వాళ్లం. అప్పడాల కర్ర హోదా వచ్చేవరకూ మరో అప్పడాలకర్ర ఆజ్ఞానుసారం నడుచుకోవాల్సిందే!' అనుకుంది. అనుకుని సరిపెట్టుకుందామనుకుంది.

కాని అప్పుడే మనస్సుజాత మడత పేచీ పెట్టింది—'మన ఖర్మ యింతే అనుకున్న వాళ్లెవ్వరూ పైకి రాలే—బావిలోపడిన బండలా అడుగడుక్కి పొయ్యేరేగాని! కోపగించుకుని యేం చేస్తాం అని ముడుచుక్కూచుంటె—ఓయ్—చేతులేకాదు చేతుల్తో పాటు కాళ్ళూ కాల్తై. ఆ తర్వాత ఏడ్చినా లాభం వుండదు. అంతెందుకు...నువ్విప్పుడు యింటి యజమానిముందు అద్దె మనిషిలా పెద్దబ్బాయ్ చెప్పే దానికల్లా బుర్రూపుతూ కూచుంటే నీ కెల్లాటి చీరె దొరుకుతుందో తెలుసా.. అదుగో......అటు చూడు నువ్వు శాంతంగావున్న ఆ బీర్వాలోవున్న పురెన్నో వున్న చీరెల్లో ఓ ఫర్స్టుమార్కు చీరె!! నువ్వె ల్లాగూ శిష్టపత్ని పాత్రంపోషించేపక్షాన వాటితో సంపెట్టుకోలేవు...అంచేతా.. అంచేతా...'

సుజాత మనస్సుజాత మాట ల్నమ్మింది— కాని పెద్దబ్బాయ్ ముందు ఉగ్రరూపం ప్రదర్శించదలచుకో లేదు. అలాని ఎర్రంచు చెల్లచీరె వదులుకోదల్చుకో లేదు. ఇందువల్ల, అట్నుంచి నరుక్కొద్దామను కోవటంవల్ల మెల్లిగా వదిన పక్కకుచేరి పెద్దబ్బాయ్‌కి విన్పించేలా కాస్త పెద్దగా అంది.

'ఏంటో పాతిక రూపాయలన్న మాటేగాని యీ చీరెలు పట్టుమని పదిరోజులేనా వుండవ్ గదొదినా.'

సుజాత మాటలు చేరవలసినచోటికే చేరినై. చెప్పడంలేని పెద్దబ్బాయ్ ఆ మాటలు విని గిరుక్కున సుజాతకేసి తిరిగేడు.

'ఎందుకుండవ్ బేబీ! యీ షర్టు చూడు కుట్టుకూపించుకొచ్చి పన్నెండ్రూపాయలైంది. కాని సంవత్సరం దాటిపోతోంది. యింకా చెక్కుచెదర లేదు!'

'అదికాదన్నయ్యా......'

'అవును బేబీ! ఒక్కోప్పుడు యెంతో డబ్బు పోసి కొన్నవి కొన్నంత సేపుండవ్. యిదుగో యీ అయిదురూపాయల్నోటు చూడు పైసాకంటే ఎంతో విలువైనది. అయినా యిలా అంటే చిరుగుతుంది. అలా అంటే నలుగుతుంది. కాని పైసానో!?... నువ్వు లిట్టు కొట్టు గట్టిగా అల్లాగే పడుంటుంది అవునా?'

సుజాతకి ఒళ్లుమండింది. కాని మంట కన్పించనీలేదు. మాట విన్పించనీలేదు. అవుననక, కాదనక మౌనంగా తలొంచుక్కూచుంది.

అప్పుడే కొట్లో కుర్రాడు ఓ చీరెలదొంతర లెచ్చి వాళ్ళముందు పడేసేడు

సుజాత వాటిన్చూసి వంటవాడి కొడుకున్చూసిన జడ్జీగారబ్బాయిలా ముఖం మాడ్చుకుని కాస్త ఆసింటా జరిక్కూచుంది.

వదినక్కాజరగలేదు గాని పక్కింటివాళ్ళ బియ్యంలో రాళ్ళేరుతున్నట్టు ఆ చీరెల్ని కెలకసాగింది.

పెద్దబ్బాయ్మాత్రం అసలైన బేరగాడిలా ఒక్కొక్క చీరెని జాగ్రత్తగా పరీక్షగా చూస్తూ—'చూడు బేబీ యిందులో నీకే చీరె నచ్చుతుందో' అన్నాడు.

[ఒరేయ్! ఒరేయ్! నువ్వెప్పుడూ నా యిష్టానికి వురేస్తున్నావ్. ఆ వురి యేతాడుతో బిగించాలో గూడా నువ్వే నిర్ణయించుకోరా మళ్ళా యిందులో నా అభిప్రాయం యెందుకూ!]

పెద్దబ్బాయ్ చేతిలోవున్న చీరెని కిందపడేసి కిందవున్న చీరెని చేతిలోకి తీసుకున్నాడు—

'ఈ డిజైన్ బావున్నట్టుంది బేబీ యీ చీరె తీసుకుంటావేంటి?'

'నీ యిష్టం!'

'పోనీ యీ చీరె చూడు. డిజైన్ అంత బాగోపోయినా కలర్ బాగుంది. యిది తీసుకుంటావా?'

'నీ యిష్టం!!'

'అయితే యీ చీరె చూడు డిజైనూ కలరూ రెండూ బాగున్నాయ్. తీసుకోగూడదూ.'

'నీ యిష్టం!'

'పోనీ అది.'

'నీ యిష్టం?'

'అది గాకపోతే...పోనీ...యిదీ...'

'నీ యిష్టం!!.'

పెద్దబ్బాయ్కి కోపమొచ్చింది. సర్రున పైకొచ్చింది. పైకొచ్చి, మాటల రూపంలో—'బేబీ! ఏంటిరా ఒళ్ళుపొగరు! ఏదో పుట్టినరోజు గదా మరీ ఏడ్చిపోతావని చీరె కొందామనుకుంటే ఏమిటా తలతిక్క సమాధానాలు! అక్కడికి నువ్వు పుట్టింట్లో మహారాణిలా పెరిగి అత్తారింట్లో మహారాణికింద దాసీదాన్లా పడుండాల్సొచ్చినట్టు పాడుముఖం పెడతావేం? అసలీపూట నేను చీరె కొనిపెట్టగలుగుతున్నందుకు సంతోషించు. సంతోషించలేకపోతే నాకు నువ్వేం చీరెలు కొనొద్దు అని ఒళ్ళేడ్చుపోతే అవతలికిఫో'—అన్న మాటల రూపంలో అతగాడి నోటినుండి వెలువడబోయింది. కాని అతగాడి నోరు మూతపడి వుండటంతో (అప్పుడు పెద్దబ్బాయ్ నోరెందుకు మూతపడి వుందిరా? వాళ్ళున్నది వాళ్ళింట్లో కానందుకు వాళ్ళచుట్టూతా వున్నది వాళ్ళవాళ్ళు కానందుకు అవునా?) ఇంకాస్త పైకి పోయి కళ్ళల్లోంచి బైటపడ్డది.

సుజాత తలొంచుక్కూచున్నది గనక అచ్చూళ్ళేదు.

కాని వదిన—'యీ చీరలేసి సుజాకి నప్పనట్టుంది. కాస్త ఎక్కువ రేట్లలో ఏవైనా తీయమందురూ'—అనబోయింతల్లో పెద్దబ్బాయ్ కళ్ళన్చూసి ఆగిపోయింది. ఆవిడకి పొయ్యిలో మంటెక్కువైతే పొయ్యిమీది పాలు పొంగుతాయని తెలుసు. అలాగే పెద్దబ్బాయ్కి కోపమెక్కువైతే మాటలెక్కువగా మిగులుతాడని తెలుసు. అంచేత, పొయ్యిలో మంట తగ్గించలేని వంటవాడు పొయ్యిమీంచి పాలగిన్నెను దింపవతలపెట్టినట్టు పెద్దబ్బాయ్కోపం తగ్గించలేని వదిన కనీసం పెరక్కుండా చూసేందుకు ఆరాటపడింది.

'ఆ! యిలా చూస్తూ కూచుంటే కొట్లో వున్న చీరెలన్నీ చూడాలనిపిస్తుంది. తీరా చూసేక అదిగాదుయిదీ యిదిగాదు అదీ అనుకోవటం తప్ప కొనటమంటూ జరుగదు. ఎందుకొచ్చిన కాలయాపన గాని యిందాక మీరు చూసిన చీరె తీసుకొండి సుజాకి బాగా నప్పుతుందికూడాను'—యిలా అనేసి వూరుకోక

వదిన కొట్లో కుర్రాణ్ణి పిలిచి ఆ చీరె తీసిచ్చి 'పాక్' చెయ్యమన్చెప్పింది: చెప్పేక, కుర్రాడా చీరె తీసికెళ్లేక 'లే, సుజా మనం బయట నిలబడ్దాం' అంటూ సుజాతన్తీసుకుని బయటకెళ్ళింది.

పెద్దబ్బాయ్ అధర్మాన్ని జయించలేని ధర్మంలా అసలు నేరస్థుణ్ణి శిక్షించలేకపోయిన జడ్జీలా లిట్టు కుంటూ (?) లేచి డబ్బిచ్చి పాకెట్ తీసుకుని బయటకొచ్చేడు. ఓ పక్కగా ఒదిగి నుంచున్న సుజాత కా పేకెట్టు అందించాడు.

అన్నం అవసరమైన బిచ్చగాడు పైసా అందు కున్నట్టు అయిష్టంగా పెద్దబ్బాయిచ్చిన పాకెట్టందు కుంది సుజాత.

'యిక వెళ్దామా?'—పెద్దబ్బాయ్ నడక సాగించేడు.

'పదండి'—వదిన కదిలింది.

సుజాతకూడా కదిలింది.

ముగ్గురూ కొంతసేపు, కొంతదూరం నడిచేక వాళ్ళకో వూరేగింపు ఎదురొచ్చింది.

సుజాతవాళ్ళ న్నూసిన వూరేగింపులో మార్పేమీ రాలేదుగాని వూరేగింపున్చూసిన సుజాతలో మార్పొచ్చేసింది.

ముందు వూరేగింపును దూరంనుండిచూసిన సుజాత 'ఆ సినిమా బావుండేట్టుందే' అనుకుంది.

తర్వాత దగ్గరకొచ్చిన వూరేగింపునూ, వూరేగుతున్న బొమ్మల్నీ చూసిన సుజాత—'అబ్బ యీ సినిమా బ్రహ్మాండంగా వుంటుంది' అనుకుంది.

'మరి అంతబ్రహ్మాండంగావుండే సిన్మాని నువ్ చూడవా?'—ఈ ప్రశ్న యెక్కడ్నుండో రాలేదు—సుజాతలోంచి—మనస్సుజాత దగ్గర్నుంచి వచ్చింది.

'ఎందుకు చూణ్ణు బ్రహ్మాండంగా చూస్తాను!'—సుజాత్తాలూకు యీ జవాబు సుజాత కిష్టమైన జాంగ్రీలా లోనికెళ్ళింది. కాని మనస్సుజాత ఆ జవాబును లోపల యిమడనీయక తికమక పెట్టి 'ఎలా?' అన్న ప్రశ్నరూపంలో బయటకుపంపి సుజాతను తికమకపెట్టింది!

'ఎలా' అన్నప్రశ్న రాగానే సుజాత ఒక్క ప్రశ్నక్కూడా జవాబురాయలేని పరీక్షార్థి(ని)లా భయపడిపోయింది. ఒక బరువు దించీదించకుండానే మరో బరువెత్తుకోవాల్సొచ్చిన కూలిలా డీలా పడిపోయింది. చివరికి, కలిమిపోయి కష్టాలుకలిసొచ్చే రోజుల్లోన్పుట్టి కష్టాల్లో పెరుగుతున్న కామాక్షిలా బేలగా—'హవును! ఎలా చూడగల్ను? యిదేం నా హరికథా అనుకున్నావా తడవుగా తలుపు ల్తాళాలేసి వెళ్లి పందిరి గుంజకానుకూర్చుని, విని, పక్షులుపలికేవేళకు పరుగెత్తుకొచ్చేందుకు! యిది సినిమాఆయె! సినిమా అంటే టిక్కెట్టు - టిక్కెట్టంటే డబ్బులు—డబ్బంటే అన్నయ్య—అన్నయ్యంటే కర్కోటకుడు! నెలకు రెండు సినిమాలకంటే ఎక్కువ చూడగూడదని ఆంక్షపెట్టిన యీ కర్కోటకుడు మూడో సినిమా చూణ్ణిస్తాడా' అంటూ 'కర్కోటకుడి'దగ్గర పళ్లు కొరుకుతూ కసిగా పెద్దబ్బాయ్‌కేసి చూసింది.

పెద్దబ్బాయ్ అప్పటివరకు దిక్కుల్చూడకుండా నడుస్తున్నవాడల్లా అప్పుడే సుజాత దిక్కుకు చూసేడు. ఎర్రబడ్డముఖం, యింకా ఎర్రబడిన కళ్ళు, యింకా ఎర్రబడిన ముక్కూ చూసేడు. అలిగి ముద్దుగా మూలకూచున్న మూడేళ్ల పాపన్చూసి నట్టు ముచ్చటపడ్డాడు. స్టేజీమీద ఓపక్క డైలాగులు మర్చిపోయి నానా అవస్థపడుతుంటే మరోపక్క జనం తెగగోలచేస్తుంటే ఏంచేయాలో తోచక ఏడుపు మొహంపెట్టిన నటుణ్ణి చూసినట్టు జాలిపడ్డాడు. అందువల్ల తన కోపాన్ని మరిచిపోయి సుజాత కోపాన్ని తగ్గించబోయి రాజీపడుతున్న ధోరణిలో నవ్వుతూ అడిగేడు—'ఏం బేబీ! ఈ సినిమా బాగుంటుందా?' అని.

సుజాతకి పెద్దబ్బాయ్ నవ్వులో 'నువ్వసలా సినిమా చూస్తేగదా బావుందో లేదో చెప్పేందుకు' అన్న ఎగతాళి, అతగాడి మాటల్లో 'నా దయాదాక్షిణ్యాలుంటేనేగద నువ్వాసినిమా చూడగలిగేది'

కొచ్చేసరికి మ్మెమ్మెమ్మెమ్మెలే! ఓవేళ యేదైనా గుమాస్తా ఉద్యోగం దొరికినా, గుమాస్తా గాడి సంపాదనతో సుఖపడటమనేది కల్లగాదేమ్...]

'అయితే కట్నం యేమాత్రం అడుగుతున్నా రేమిటి?'—వదిన ప్రశ్న.

'కానీ కూడా అడగటంలేదు. కాకపోతే మనం పెళ్లిఖర్చులు భరించాల్సుంటుంది అంతే'!—పేదవాడింటికి భోజనానికొచ్చేందుకొప్పుకున్న పెద్దమంత్రి గారి పెద్దహృదయంగురించి చెప్పినట్టు చెప్పేడు పెద్దబ్బాయ్

[సెహబాష్! మంచిసంబంధమే వెలికేవురా పెద్దబ్బాయ్! అయినా యీ సంబంధం కుదిర్తే నువ్ కష్టం పెళ్లిఖర్చైనా భరించాల్సుంటుంది. కాని... అటు చూడు. గుడ్డరంగేవిటో కూడా తెలీనట్టు మాసిపోయిన బట్టలతో, మాంసాన్నంతా తినేసి లోకాన్ని చూడాలని తాపత్రయపడుతున్న ఎముకల్తో, వుంటే పచ్చగా, లేకుంటే ఎర్రగా రాగిగా కన్పిస్తున్న జుత్తుతో, నానారకాలైన కుళ్లుతోనిండి పొంగి పొర్లుతున్న చెత్తకుండీలా వున్నాడే గుడ్డిబిచ్చగాడు... అతడిదగ్గరకువెళ్లి 'నా చెల్లెల్ని చేసుకో'మ్మని అడగరా. అతగాడికి తోడు కావాల్సివుంటుంది—వెంటనే ఒప్పేసుకుంటాడు. నీకిహ పెళ్లిఖర్చుకూడా వుండదు. అతకాడు అడుక్కుంటి, తినకుండా దాచుకుంది పెళ్లిఖర్చు కిచ్చేస్తాడు. ఆ తర్వాత ఎల్లాగూ మేఁవిద్దరం నీదగ్గరా, నీలాటివాళ్లదగ్గరా ముష్టెత్తుకుంటామనుకో!]

'ఆహా! అయితే సుజా త్వరలో పెళ్లికూతురు కాబోతోందన్నమాట! ఏం పిల్లా పిల్లాడ్నిచూసేవా?–' సుజాతని మోచేత్తో పొడుస్తూ అంది వదిన.

సుజాత వదినెతో మాటాడలేదు—మనస్సుజాత వడిగింది—

'యిప్పు డెలా! జరగకూడం దేదో జరగేట్టే వుంది. యీ అన్నిగాడు అన్నంత పనీ చేసేట్టున్నాడు. మనసా— యిహ దారేదో నీకు తెలుసా...మనసా... తెలుసా...'

'అదిగో అదే దారి!'—మనస్సుజాత చూపెంది.

సుజాత చూసింది.

అక్కడ—అక్కడ బంగారు వాన పడుతోంది. అందులో సుజాత వుంది. సుజాత ఏదేదో వారపత్రిక ముఖచిత్రంలానో, ఆకర్షణీయమైన క్రోటను పత్రంలానో అందంగా తయారై కాలేజీకి వెళ్తోంది. దార్లో నర(క)లోకానికి, స్వర్గలోకానికి మధ్య వంతెనలా వున్న పొడవాటి కారొహాడి వుంది. దాన్నానుకుని సన్నవినారైనా వెయ్యేనుగులబలంకలవాడు (ఏనుగు చచ్చినా వెయ్యే బ్రతికినా వెయ్యే అని వాళ్లమ్మా నాన్నా అంటూండగా చాలసార్లు వింది సుజాత) పుణ్యాత్ముల్ని స్వర్గానికాహ్వానించే దేవేంద్రుడిలా నిలబడి వున్నాడు. అచ్చు సుజాత అభిమాన నటుడిలా వున్నాడు. అతగాడు గులాబీల్ని చూడగనే పరవశించి పోయినట్టు సుజాతను చూడగనే 'ఏక్ దమ్మున' ప్రేమించేసేడు (మీరు చూళ్లేదా? సుజాతకూడా ప్రేమించేసింది!)

అల్లా సుజాతను ప్రేమించినతడికి ఓ తోట బంగాళావుంది. బంగాళాలో వూరిన బంగాళాదుంప ల్లాంటి అమ్మా నాన్నా వున్నారు. హీరో వాళ్ల దగ్గరకెళ్లి—'డాడీ, మమ్మీ నేను సుజాతను లవ్ చేసేను. ఐ వాంట్ టు మారీ హర్' అన్చెప్పేడు. దానికి వాళ్ళు సుతరామూ ఒప్పుకోలేదు. హీరో సుజాతల పెళ్లికి అడ్డుగోడగా నిలిచి తప్పుకోనూ లేదు! దాన్తో హీరో ఆగ్రహించి 'యీ సిరిసంపదల్తో మీరే వూరేగండి. నేను నా సుజాత్తో వూరేగి ఏ వూరి కొంపలోనైనా పడుంటాను.' అని బంగాళా లోంచి బయటపడపోయేడు. కాని అతగాడి అమ్మా నాన్నా అతణ్ణి గట్టిగా పట్టుకుని, కళ్లనీళ్ళు పెట్టుకుని 'ఒరె నాయనా నీకోసం యీ ఆస్తిపాస్తు లనుకున్నాంగాని ఆస్తిపాస్తులకోసం నువ్వనుకున్నావా? నువ్లేందే మేంమాత్రం ఎలా బ్రతగ్గలంరా...కాసీయ్. నీ యిష్టమే మా యిష్టం. మేం యీ పెళ్లికి ఒప్పుకుంటున్నాం' అనేసేరు!!

(వాళ్లలా పెళ్ళికి ఒప్పుకు తీరాలంతే! లేకపోతే... సుజాతకు నచ్చే మొగుడు రావొచ్చుగాని ఆవమ్మాయికి నచ్చే బంగాళా, బంగాళాముందు తోట, తోటముందు కారు, కారులో షికారూ...ఇవన్నీ దక్కునా? దక్కవండీ బాబూ దక్కవ్!)

ఇహనేవుంది. హీరోతో సుజాత పెళ్ళి కాలేజీ ఎన్నికలంత హడావుడిగా జరిగిపోయింది. ఆ తర్వాత ఆ యిద్దరూ సీతారాముల్లా వనవిహారాలూ, పార్వతీ పరమేశ్వరుల్లా గగనవిహారాలు చేస్తూ అమెరికా వెళ్లేందుకు......

'ఏమ్ సుజా! ఏమిటా పాకు? ఇల్లొచ్చేసింది!'

సుజాత వులికిపడింది. తింటూన్న జీడిపప్పు వుస్మాలో రాళ్లంముక్క వచ్చినట్టు చిరాకుపడింది. ఓ వెలుగు వెలిగి ఆరిపోయిన జమీందారు ముఖంపెట్టి ఇంట్లోకి వెళ్లింది చేతిలోని పాకెట్టును టేబుల్ మీదకు విసిరేసి తనగదిలోకి వెళ్లబోయింది.

'జేటీ! ఇలారా!'

జేటీ వచ్చింది.

'కూర్చో.'

కూర్చుంది.

'బేబీ! యిన్నాళ్లనుంచీ యోగాని యివాళ నీ కోర్కెలు—అన్నింటినీ కాకపోయినా కొన్నింటినైనా తెల్సుకోదలిచేను. కాని చూడు తల్లీ! నీ ఒక్కో కోరికా, నీ సినిమా భాషలో చెప్పాలంటే, సెవెన్టీ ఎం. ఎం. స్క్రీనంత (అంటే తెలుగు తెరకు రెండింతలు తెలుగు తారలో సగప్రాయు) పెద్దది అయితే పట్టి తీర్చుకుందుకు నీకు, తీర్చేందుకు నాకూ వున్న అవకాశాలు నువ్ చిన్నతనంలో పేరంటానికెళ్తూ శగలు తెచ్చుకుందుకు తీసికెళ్లేదానికే కర్చీపులు...వాటింతంటే బహు కొద్దివి. యిహపోతే నీ కోరికల తెరలు సినిమా తెరల్లా పొడవులోనూ వెడల్పులోనూ పెరిగిపోతుండొచ్చు. ఎటొచ్చీ అవకాశపుతెరలే ఎప్పుడూ అల్లా కర్చీపుల్లా, ఎదుగు బొదుగు లేకుండా అల్లానే పడుంటాయ్! అంచేత తల్లీ, అవకాశాల్నిబట్టి కోరికల్ని మలచుకోవటం నీకూ మంచిది నాకూ మంచిది! యిహ వెళ్లు!!'

సుజాత వెళ్లింది. తన గదిలోకి వెళ్లింది.

వెళ్లి ఏడ్చింది!

తలుపులు గడియపెట్టుకుని మంచంమీద బోర్లాపడి భోరున ఏడ్చింది. ఏడుస్తూనే దేవుణ్ణి పిలిచింది. అత డొస్తాడో లేదో చూసుకోకుండానే అతగాణ్ణి దులిపేసింది.

'ఒరేయ్ దేవుడూ! చూసేందుకు కళ్లిచ్చేవ్. కోరుకుందుకు మనసిచ్చేవ్! అనుభవించమని మనిషిని పుట్టించేవ్! అయితే ఆ పుట్టించటం ఏ ఆరంతస్తుల భవనంలో నేనంటే పడిచచ్చేవాళ్ల మధ్య పుట్టించటమో బావుండేది. కాని నువ్వలా చెయ్యలేదురోయ్! నక్షత్రాలికెళ్ళి పూలకొమ్మల్నిచూసి నేనే గొప్ప అని పొంగిపోతూ, పెద్ద మేడల్నిచూసి 'హెచ్చే నేనే గొప్ప' అని కుంగిపోతూవుండే పెంకుటింట్లో పడేసేవ్. ఆ యింటోనే నాకో అన్నిగాణ్ణి సృష్టించేవ్! దాంతో నా పరిస్థితి యెలా తయారైందో తెలుసురా నీకు. వినరోయ్!.. యీడేందుకు నీళ్ళనైనా. నీళ్లిండా మొసళ్ళనైనా మెరిక ల్లాంటి కోరికలునైనా వాట్ని తీర్చుకుందు క్కావలసిన డబ్బు అన్నిగాడి దగ్గరుంది! వాడిసంగతి నీకు తెలీందేందిరా దేవుడూ! పైసా దొరికితే దానికి తోడుగా మరో తొంభైతొమ్మిది పైసలు పోగుచేసి రూపాయి చేద్దామని తాపత్రయపడే మనిషికాదురా వాడు. అల్లాటివాడు కాబట్టే నన్నూ, నాయిష్టాల్ని నిర్లక్ష్యం చేస్తున్నాడు. పైగా యివాళ నా కోరికల్ని కొండంతచేసి బుద్ధులు చెప్పేడ్రా దేవుడూ. కాని ఒరేయ్ ..చక్కమాట...వాన్లో తిరిగేవాడు గొడుగు కావాలనుకోవటం, చిల్లుల గొడుగున్నవాడు మంచి గొడుగు కావాలనుకోటం తప్పంటావా? పుట్టిం దగ్గర్నుంచి అడవిలో సీతలా నారబట్టలు కట్టుకుంటూన్న దాన్ని యిప్పుడు కాస్త మంచి చీరె కావాలనుక్కోవటం

నేరమ్రటా ? చెప్పవేరా? చెప్పూ... చెప్పూ... చెప్పూ!!!'

సుజాత మళ్లీ వలవల ఏడ్చేసింది. ఏడ్చి ఏడ్చి యిహ నా వ్చాయ్య లేక ఆపేసింది. ఆపేక ఆక లేసింది. అన్నం తినదలచుకోక రెండు గ్లాసుల నీళ్లు త్రాగేసింది. తాగేక కడుపు చల్లబడింది.

రాత్రివేళ కూచుని పగటిపూట పగవాడిలా వేధించిన ఎండ తీవ్రత గురించి మాటాడుకున్నట్టు కాస్త చల్లబడిన సుజాత ప్రొద్దుట్నుండి అప్పటి వరకు కడుపు మండినందుకుగల కారణాలను నెమరు వేసింది.

అంతా అయేక, 'పోనీ మన కోరికల విలువ కొంత తగ్గించుకుంటే యీ లన్నిగాడు నిజంగానే తీర్చేస్తాడేమో'నన్న అనుమానం వచ్చింది.

అనుమానం వచ్చేక 'పోనీ ఒదీచూస్తే పోలా' అన్న ఆలోచనొచ్చింది.

ఆలోచనొచ్చిన వెంటనే సుజాత, 'పోనీలే ప్లిమత్కారొద్దు ఫియట్కారు చాలు! నూటపాతిక రూపాయల్చీరొద్దు మూడుపాతిక చీరె చాలు నా మొగుడు కోటీశ్వరుడే కానవసరం లేదు. లక్షాధి కారి అయితే చాలు. అదీగాకపోతే యే బాదరబందీలేని వెయ్యిరూపాయల జీతగాడైనా ఫరవాలేదు' అనుకుంది.

అనుకున్నాక. అనుకున్నది అనుకున్నట్టు జరుగుతుందేమోనని అనుకోన్నాళ్లు ఆశగా ఎదురు చూసింది. చూసి చూసి యీ తగ్గింపు ధరల కోర్కెలు తీరటంకూడా మనదేశంలో ఆహార విషయంలో స్వయంసమృద్ధి సాధించినంత నిజం అని తెలుసు కుంది.

నిజానికి యీ నిజం సుజాత గుండెల్ని కలుక్కుమనిపిస్తూంటుంది—ఎప్పుడూ కాదు. అప్పు డప్పుడు—పెద్దపెద్ద బట్టలకొట్లూ, కొట్లముందు షో కేసులూ, షో కేసుల్లో ట్యూబులైట్లకింద నిగ నిగలాడే చీరల్చూసినప్పుడూ, తనీడు పిల్లలు (మగ పిల్లలుకాదు) బంగారంలాంటి చీరెల్లో, బంగారపు మెడల్లో బంగారబ్బొమ్మల్లా కారుల్లో కనిపించి నప్పుడూ!

ఇవాళ్టి కివేళ...కాలేజీనుండి కొచ్చేలోపల అప్పటికప్పుడే అయిదుసార్లు కలుక్కుమంది సుజాత నిండుగుండె. యింటికొచ్చి కాసిన్ని కాఫీనీళ్లు తాగి పది పైసల లైబ్రరీలో అద్దెకు తెచ్చుకున్న సినిమా పత్రికలో సితార పెళ్లిఫోటో (నిజ్జం పెళ్లిఫోటో). ఫోటోలోని సితార అలంకారం చూసేక ఆరోసారి కలుక్కుమంది సుజాత తాలూకు పలుచని గుండె. ఎంతైనా పిడికెడు గుండె యిన్ని సార్లు కలతపడటంతో సుజాతకి భరించరాని (భయం కాదు) బాధేసింది. దాంతో తప్పు తను తిట్టు కూడా. తనని కన్నవాళ్లనీ, పోషిస్తున్నవాళ్లని శాపొస్తున్నట్టెట్టిపోసింది. యిహ ఓట్టువలనవాళ్లు కన్పించక - 'యీ దేశంలో కొందరికే అన్నికోరికలూ తీర నేలా; కొందరు అందరు అదృష్టాల పాకంలా కుత కుతలాడి పోనేలా' అని కసిగా ఏడ్చేద్దామనుకుంది.

సరిగ్గా అప్పుడే వచ్చింది, సుందరి 'సుజా సుజా' అనుకుంటూ.

సుందరి సుజాతవాళ్ల పొరుగింట్లో వుంటున్న గుమాస్తా యిత్రం కూతురు. మనిషి పొడవైతే పెరిగింది గాని లావుకాలేపోయింది. బలమైన తిండిలేక యెప్పుడూ నీరసంగా లక్ష్మీసీ జబ్బులాగు వూగుతూ వుంటుంది. ఆ పిల్ల వటిరంగుకు కను ముక్కు తీరుకు యెంత విలువైన చీరైనా యిట్టే నప్పుతుందిగానీ అమ్మాయి మాత్రం యెప్పుడూ (యిప్పుడు కూడా) గవర్నమెంటువారు పొదుపూ పొదుపూ అంటూ వాడే చిత్తుకాగితాల కవర్లలాంటి ఓటిగుడ్డలు కట్టుకు తిరుగుతుంది.

అసలు సుజాతకీ సుందరికీ పెద్దబ్బాయ్గారి బండిగుర్రానికి పేద టాంగావాడి గుర్రానికి వున్న తేడా వుంది.

అయినా సుందరి ఎప్పుడూ ఆనందంగా నవ్వుతూంటుంది.

అయితే యీ ఆనందం, సుందరానందం, సుందరి యింట్లో పండేదికాదు. అలా అని గుమాస్తా యంత్రం అనుకున్నదానికంటే ఎక్కువ అప్పు సంపాదించగలిగిన రోజున రూపాయిచ్చి సుందర్ని సినిమాకి వెళ్ళమన్నప్పుడుగాని, అదే గుమాస్తాయంత్రం పెళ్ళాం పోరగా పోరగా సంవత్సరానికో రెండు సంవత్సరాలకో పాత యినుము కొనేవాడిలా గుడ్డల కొట్లన్నీ తిరిగి తిరిగి చివరికి ఖర్చవక మిగిలిన గుడ్డల తానొటి చౌగ్గా పట్టుకొచ్చి (అప్పుచేస్మే) యింట్లోవాళ్ళందర్తోపాటు సుందరిక్కూడా ఓ మున్సిపాల్టీ యూనిఫారం దానం చేసినప్పుడుగానీ, లేకపోతే యింట్లో పచ్చడితోపాటు పనసపొట్టుకూర చేసుకున్నప్పుడుగానీ కలిగేది కాదు ఆ ఆనందం !

మరెప్పుడు కలిగేది ??

అదే.. సుందరి కాలేజీకి వెళ్ళినప్పుడూ, అక్కడ ఆముదం దీపాల్లాకాక ఆకాశ దీపాల్లా వెలిగిపోతున్న అమ్మాయిల్నిచూసి పలకరించినప్పుడు, వాళ్ళ చీరెల్ని వగల్ని సున్నితంగా పట్టుకుని కంచిలో బంగరు బల్లిని తాకినట్టూ, పూజారి చూడకుండా దేవుణ్ణి ముట్టుకున్నట్టూ మురిసిపోతూ, వాళ్ళు వాటిని ఎప్పుడు ఎక్కడ ఎందుకు ఎలా కొన్నారో అడిగి తెలుసుకున్నప్పుడూ, తీరికవేళల్లో (అబ్బ సుందరికి ఎంత తీరికనీ!) వాళ్ళ యిళ్ళకువెళ్ళి తన యింట్లో లేనివాటిని వాళ్ళ యిళ్ళల్లో దగ్గరగా చూసినప్పుడూ పండుతుంది, ఆ ఆనంద !!

అయితే పండిన ఆనందాన్ని పదిమందికి పంచక పోతే అదికాస్తా ఎండిపోతుందన్న నమ్మకంపోటు ది సుందరికి. అంచేత తను ఓ యింట్లో చూచింది మరో యింట్లోనూ, ఒహరి దగ్గర విన్నది మంరో హరి దగ్గరా చెప్పి సంతోషిస్తుందా పిల్ల!

'రా సుందరీ! రా...రా...కూర్చో!'—సుజాత సర్దుకుని సుందరికి కుర్చీ చూపించింది.

సుందరొచ్చి 'హమ్మయ్య' అంటూ కూచుంది.

'ఏమిటివేళ కాలేజీ ఎగ్గొట్టేవ్?'—సుజాత అడిగింది.

'ఎగ్గొట్టక ఛస్తానా మన పార్వతి ఒర్తుదే అయితేను! అన్నట్టు మరిచేపోయా...యివేళ నువ్ రాలేదేమిటీ'?

'ఆ యేవో బద్ధకించేసు! బాగా జరిగిందా?'

'బాగా జరిగేందుకు బజారంటా పండుగ చేసేరా ఏమిటీ! ఏదో నేనూ నా బోటివాళ్ళు మరో ముగ్గురూ వచ్చేరు అంతే! కాని సుజా యివాళ పార్వతి వో చీరె కట్టుకుంది ..అబ్బ కళ్ళు తిరిగేలా వుందంటే నమ్ము!'

'ఆవిడకి కొనిపెట్టానన్నాడు. యిహ కళ్ళు తిరిగే చీరలేంఖర్మ ఏకంగా వళ్ళు తిరిగే చీరలే కట్టుకోగలదు!'

'సరేలే! వాళ్ళ నాన్న కొన్న చీరె.. వాళ్ళ నాన్నలానే వుంది!'

'మరి?'

'మరీ...'—సుందరి నాలుగ్గోడలూ చూసింది చెవులుగానీ మొలిచాయేమోనని!

'ఎవరూ లేర్లే చెప్పు!'

'ఆ చీరె వరదరాజులు...మన క్లాస్‌మేట్ వరదరాజులు తెచ్చేడు!'

'నిజంగా?'

'న్యూస్ పేపర్లోనైనా తప్పులూ సవరణలూ కన్పిస్తాయ్‌గాని మన దగ్గరల్లాటివి మచ్చుకైనా దొరకవ్. కావాలంటె వెళ్ళిచూడు...అడుగు'

'వరదరాజులు పార్వతికి చీరె లెవ్వాడంటె, అత డికీ పార్వ...

'ఆ...ఆ...అప్పుడే కథ అల్లావాకు అసలు జరిగిందేమిటంటే నిన్న 'లంచ్ ఇంటర్వెల్'లో నేనూ పార్వతి మామూలుగా చెట్టుకింద నిలబడ్డాం. పార్వతి సంగతి నీకు తెలిసిందేగా—పీలుచిక్కితే చాలు తనకు నైలెక్స్‌చీరె లంటె ఎంత యిష్టమో, అది కొనుక్కోలేక యెంత కష్టపడుతుందో ఏకరువుపెడ్తుంటుంది. నిన్నగూడా చెట్టుకింద అలాగే ఏకరువు పెడ్తూ

పెద్దాస్త ఏడుపు మొహం పెట్టేసి - 'లాభంలేదు! నాన్న నాకు ఈ జన్మలో సైకెక్స్‌పెరె కొని టడు. కొనిపెట్టడు' అని యెంతో దిగులుపడి మళ్లీ అంతలోనే కళ్లింతచేసుకుని 'అవునుగాని సుందీ! రేవు నా పుట్టినరోజున నా కెవరేనా సైకెక్స్‌పెరె ప్రెజంట్‌చేస్తే ఎంత బాగుంటుందో కదూ!!' అంది.

'చేసేవాళ్లుంటే బాగానేవుంటుంది' అన్నానేను.

దానికి పార్వతి మా పక్కగా వెళ్తున్న వరదరాజుల్ని చూసి 'అవును కాలేజీలో యింతేసి పెద్ద మనుషులున్నారు కాని ఏం లాభం' అంది.

వరదరాజులు ఆ మాటలు విన్నాడు. నవ్వుతూ మాదగ్గరకొచ్చి 'ఏవిటి లాభనష్టాల జేరీజు వేస్తున్నారు' అన్నాడు.

పార్వతికి ఏంచెప్పాలో తోచక 'యేంలేదండీ రేవు నా బర్త్‌డే' అంది.

'అచ్చా! అయితే మీ పుట్టినరోజు పండక్కి నన్ను పిలుస్తారా?'—వరదరాజులు అడిగేడు.

'పిలిస్తే వస్తారా వస్తే తెస్తారా!'- కొంటెగా అంది పార్వతి.

'మీరు పిలిస్తే వస్తాను' మీరు ఏది కోరితే అది తెస్తాను!'—మహానందపడిపోతూ అన్నాడు వరదరాజులు.

'అయితే రేపు ఉదయం పదిగంటలకల్లా పంపేయండి సైకెక్స్‌పెరె...'

అంతే! వరదరాజులు మారుపలక్కుండా వెళ్లిపోయేడు. మరుసటిరోజు అంటే యివ్వాళ...చెప్పిన టైంకి పరీక్షకి వచ్చేవాడిలా చక్కావచ్చాడు మానవు! నన్నూ సైకెక్స్‌పెరె తెచ్చేడు అమాయకుడు!!'

సుజాత కెందుకో అంతోటి వరదరాజులూ వరదలోకీసినవాగులా మెత్తబడి మెత్తటిపెరె ప్రెజంట్ చెయ్యడానికిగల కారణం పార్వతి తాలూకు అమోఘమైన తెలివే వనిపించింది!

'ఆడవాళ్ల మనసులు వెన్నలా అమాత్రం యీమాత్రం వేడికే యిట్టే కరిగిపోతాయంటారు గాని యీ మగవాళ్ల మనసులే మరీ అన్యాయం. వేరే మాటటుంచి వెన్న చూస్తేనే కరిగిపోతారు! లేకపోతే అది రమ్మని పిలవగనే అతను రావటమేవిటి అంత ఖరీదైనదొకటి తేవటమేవిటి చెప్పు!'

సుజాత కెందుకో ఆ క్షణంలో 'మగవాళ్లను అందరూ వరదరాజులే!' అనిపించేను.

'మరి నే వస్తా సుజా! మళ్లీ లక్ష్మీవాళ్లింటి క్కూడా వెళ్లాలి!'

'లక్ష్మివాళ్లింటికా ఎందుకూ?'

'వూరికే సరదాకి. నువ్వూ రకూడదూ యిప్పుడే వచ్చేద్దాం'

సుజాత కాస్త ఆలోచించి అంది—'అల్లాగే కూచునుండు వస్తాను!'

'త్వరగా కానీయ్!'

'కానివ్వ! మనవేవన్నా బీరువులకొద్దీ బంగారవూ, బీరువాల కొద్దీ చీరెలూ వున్నాయా అదికాదు యిదీ యిదికాదు అవీ అని ఆలస్యం చేసేందుకు. యిప్పుడే అయిదు నిముషాల్లో వచ్చెయ్యనూ!'

* * *

సుభద్ర వయసులో చిన్నదైనప్పటికీ వయసు మళ్లిన వాళ్లపెద్దమ్మలాగు యెప్పుడూ 'సొంత యిల్లంటూ వోటుంటే తిన్నా తినకపోయినా అడిగే వాడుండడు' అనుకుంటూంటుంది. స్వంతయిల్లు వుండీ తినడానికి లేకపోతే యెల్లా వుండేదో చెప్పలేంగానీ తినటానికి వుండి స్వంతయిల్లు లేకపోయేసరికి ఆవిడ చుట్టుపక్కల జనంవంతా తనచుట్టూ చేరి 'నువ్ తిన్టంలేదు నువ్ తిన్టంలేదు' అని అల్లరి పెడుతున్నట్టు బాధపడి పోతూ వుంటుంది. అందులో ఈవేళ 'యింటాడు' డబ్బవసరం డబ్బవసరం అంటూ యింటద్దెకొరకు యింటిచుట్టూ మూడు సార్లు తిరిగెళ్లేడో యేమో సుభద్ర తినకున్న యింటిబాధని మూడుపెట్లు మూడుసార్లు హెచ్చవేసి మరీ బాధ పడిపోసాగింది. అలా బాధపడుతూనే

పొయ్యమీద వప్పువడేసి పప్పుడకలేదని కొట్టువాడ్ని తిట్టి, కూరలు తరుగుతూ గొంతు కోసుకుందుకు కూడా పనికిరాదని కత్తిపీటను కసురుకుని 'బురుజులు కట్టిన కొంపనుకుని యింత మిడిసిపాటు వెధవకి' అని యింటాడ్ని తిట్టి, 'అసలు మాదేలే తప్పు!...వూరిద్దైనా సొంత కొంపంటూ ఒకటి ఏర్పరుచుకోక అద్దెకొంపల కెగబాకటం మాదే తప్పు' అని సినిమా చివర్లోని దుర్మార్గుడిలా పశ్చాత్తాప వడిపోయి విరాగ్గావెళ్లి పత్రిక తీసుకుని మళ్లీ యింటిఆలోచన రాగా పరాగ్గా వుండిపోయింది.

అప్పుడే ఆ యింటి తలుపు మోగింది.

మనుషు లేనప్పుడు వంటింట్లో జొరబడే దొంగకుక్క కోసం కాచుక్కూచుని అది రాగానే కర్రుచ్చుకు బయల్దేరే యిల్లాల్లా చేతిలోని పుస్తకాన్ని విసి రవతల పారేసి 'మళ్లీ వచ్చినట్టున్నాడు త్రాష్టుడు' అనుకుంటూ వెళ్లి తలుపు తీసింది, సుభద్ర.

తలుపవతల యింటాడు లేడు! యింటి పక్కనుండే బాయమ్మ (రాంబాయమ్మో లక్ష్మింబాయమ్మో సరిగా తెలీదు) వుంది. పళ్లు కన్పించేలా నవ్వుతూవుంది.

కాలేజీఫీజు కట్టటం యెల్లారా భగవంతుడా అని మథనపడిపోతున్న బీద విద్యార్థికి ఫీజక్కర్లేదని తెల్సినట్టు 'యింటాడు వచ్చుంటాడు తగావుకి దిగాలి కాబోలు' అనుకుంటూ తలుపుతీసిన సుభద్రకి బాయమ్మ కన్పించేసరికి పెద్దబరువు దిగినట్టు ఫీలయింది. తేలిగ్గా నవ్వేస్తూ 'రండి పిన్నిగారూ లోపలికి రండి' అంటూ బాయమ్మని ఆహ్వానించింది.

బాయమ్మ లోపలికొస్తూ 'అయితే తలుపు తటి ందెవరనుకున్నావ్?' అనడిగింది.

'ఇంకెవరున్నారూ ఈ యిల్లుగల రాక్షసుడు. సరిగ్గా ఫస్టుతారీఖున డెబ్భైరూపాయ తీసికెళ్లి వాడిచేతుల్లో పోస్తున్నావా! అయినా తృప్తిలేదు వాడికి. ఇరవై అయిదో తారీఖునుంచీ 'అద్దె అద్దె' అంటూ పీక్కు తింటుంటాడు!'

'మరింకా నయంకదూ! యిల్లు ముచ్చటగా వుంది. ఆ యింటాడుకూడా అద్దె అద్దె అంటూ వెంటబడ్తాడే తప్ప లప్పటికప్పుడు కక్కమని పీకలమీద కూచోడు. మా పరిస్థితి మరీ అధ్వాన్నమే! మా యిల్లేమో మా పెద్దత్తగారిలా యివాళో రేపో అంటుంటుంది. అసలా తలుపుల్చూశావుగా... ముట్టుకుంటేచాలు. అర్ధరాత్రి వరకూ వూరంతా తిరిగొచ్చిన మనవడికి అన్నం పెట్టేందుకు లేచే బామ్మలా మూలుగుతుంటై. అంతోటింటికి పాతికరూపాయలు. అదీ ఫస్టుకిగాదు ఆయింటాడు యేరోజొస్తే ఆరోజు... యేవేళ నిమ్మంటె ఆవేళ తల తాకట్టు పెట్టైనా సరే తెచ్చివ్వాల్సిందేగా!'

'అద్సరేగాని పిన్నీ. నిన్నసాయంత్రం ఎక్కడికెళ్లేరూ? అన్నిసార్లు పిలిచినా పలకలేదూ!'

'నిన్న సాయంత్రమేవో రాఘవయ్యగారి పెద్దమ్మాయిన్నూసేందు కెవరో వస్తున్నారంటే వెళ్లొచ్చేను. యిప్పుడేమో రాధమ్మగారు యిల్లు కట్టుకుంటున్నారూ, శంకుస్థాపన యివేళంటే వెళ్లి చూసొస్తున్నా.'

'రాధమ్మగారు యిల్లు కడ్తున్నారా!!??'

'యిళ్లేవిటే తల్లీ వాళ్లు కోటలైనా కట్టగల్రు!'

'ఏవిటి మాటల్తోనా?'

'కాదు డబ్బుల్తోనే!'

'అదేవిటి పిన్నీ వాళ్లాయన చేసేది కంపౌండరుద్యోగం. అందుకొచ్చేది రెండొందల జీతం'

'అయ్యో పిచ్చితల్లీ! జీతాల్తోటే మెతుకులే సరిగారావు యిహ మేడ లెక్కడ్నుంచొస్తై. యీ పైపై పనులన్నీ పై సంపాదనతో తీరాల్సిందే!'

'అయ్యో మోసమా!'

'అబ్బ! అంత అమాయకంగా మాట్లాడతావేమే కూతురా. మా అబ్బాయిమాత్రం సంపాయించటంలా?'

'ఎవరూ...మీ అబ్బాయిగారా. సడేలే. ఆయనకి తల్లో నాలుకా చేతిలోఎముకా వుంటే మేపి అద్దె కొంపలో ఎందుకు మగ్గుతాం? ఆ జీతంరాళ్లైనా నెల్నెలా గవర్నమెంటువారు పిలిచిస్తున్నారుగనక సరిపోతూంది. లేకపోతే అదీ పుచ్చుకోకుండా అక్కడే వచ్చేస్తూ కూచోరూ!!'

సుభద్రతాలూకు యీ దుస్థితికి బాయమ్మ బోల్డు జాలిపడిపోయింది.

తన్నుచూసి జాలిపడేవాళ్లున్నారుగదా అన్న సంతోషంలో సుభద్ర మరింత బాధపడిపోయింది.

* * *

సుబ్బారావుకి డ్యూటీ అంటే యిష్టం.

సుబ్బారావుని బజార్లో చూస్తే 'పాపం ఎవడో వుద్యోగంకోసం తిరుగుతున్నట్టున్నాడ'నుకుంటారు. హాస్పిటల్లో చూస్తే 'చ్చొచ్చొచ్చొ యింత చిన్న వయసులో యెంత పెద్దజబ్బుచేసిందో యేమో అలా అయిపోయేడు' అనుకుంటారు ఎటొచ్చీ అతగాడు ఆ వెడల్పాటి టేబుల్‌వెనకా, లావుపాటి కుర్చీలో ఒదిగి కూచున్నప్పుడే......అతణ్ని చూసి అందరూ డాక్టరనుకునేది. [మనిషి బక్కవాడైనా అతడికి మాంచిబలమైన పేరుంది. అతడి హస్తవాసి మంచిదని అముద్రిత సర్టిఫికెట్లు చాలామంది చాలా యిచ్చేరతడికి]

'డాక్టరు బాబూ...డాక్టరు బాబూ.'

కొత్తసినిమాకి టిక్కెట్లు యిస్తున్నవాడిలా బుర్రొంచుకుని బరబర 'ప్రిస్క్రిప్షన్లు' రాసిస్తున్న సుబ్బారావు తలెత్తేడు. ఎదురుగా మొక్కులు తీర్చుకుందుకు దేవుడిదగ్గరకొచ్చిన భక్తుడ్లా అతివినయంగా (నిలబడి)వున్న వ్యక్తిని గుర్తించేడు—

'ఏం తాతా ఎలా వుంది నీ మనవడికి? పన్లో కెళ్తున్నాడా?'

'తమరి దయవల్ల కులాసాగానే వున్నాడు బాబూ! సావుబతుకుల్లో వున్నవాడిని బతికించి మా కప్పగించారు. తమ ఋణం యీ జన్మలో తీర్చుకోలేం. యీ కాస్త......'—తాత డజను చక్కెరకేళీలూ, తమలపాకులూ, ఆకుల్లో అయిదు రూపాయలూ—మొత్తం కలిపి సుబ్బారావు టేబుల్ మీ దుంచేడు.

సుబ్బారావు వాటిని చూసేడు.

వాటిని తెచ్చిన తాతని చూసేడు. (అజ్ఞానులకు జ్ఞానోపదేశం చేసేప్పుడు బుద్ధుడు కూడా అలాగే చూసుంటాడు!). చూస్తూ అన్నాడు—

'తాతా! మొక్క పెరగాలంటే నీరుపొయ్యాలి. మన మొక్కేగదాఅని మరిన్ని నీళ్లుపోస్తే ఆ మొక్క కాస్తా నీరుకమ్మి చచ్చిపోతుంది. అవునా? నేనైనా అంతే! మీకు వైద్యం చేసినందుకు జీతం తీసుకుంటున్నాను. జీతం తీసుకుంటున్నవాణ్ణి, యిల్లాంటి మేతలు మేయటం క్షేమంకాదు—మేపటం నీకు క్షేమంకాదు!!'

'జీతాలు తీసుకుంటున్న వాళంతా యిలా అంటున్నారా బాబూ? యేదో నా సంతోషం కొద్దీ......'

'ఒద్దు తాతా! కానుక లివ్వటం నీకు సంతోషమైతే పుచ్చుకోవటం నా కిష్టం! కాదు గూడదంటే...యిటు చూడూ... నా కివ్వదల్చుకున్న డబ్బుపెట్టి యీటానిక్కొని నీ మనవడిచేత తాగించు. యింకా త్వరగా కోలుకుంటాడు. యీపళ్లు పట్టుకెళ్లి పిల్లలకి పెట్టు!'

తాత డాక్టరిచ్చిన మందుచీటీని, డాక్టరు టేబుల్‌మీది కానుకల్నీ తీసుకున్నాడు, 'దర్మప్రభువైన డా. సుబ్బారావుని వెయ్యేళ్ళు వర్ధిల్లమని నిండుమనసుతో దీవించి, కృతజ్ఞతలు నిండిన కళ్లతో సెలవు తీసుకున్నాడు.

తాత సెలవుపుచ్చుకొని వెళ్లిపోయిన

చాలా సేపటివరకు వెళ్ళిపోని రోగులు—'యీ డాక్టరు డాక్టరుకాదు దేవుడు' 'ఏమమంటోళ్ళ వూరి కోళ్ళంటే సాలు దేరం ఒడక్కుండా బాగు పడి పోద్ది' 'దర్మాస్పత్రిలో యిట్టాంటి దర్మ పెబువుని సూత్తుంటే సేతిబీరకాయలో కూడా నెయ్యుంతుద్దేమో ననిపిత్తుంది' లాటి మాట లనటం సుబ్బారావు వినగలిగేడు.

సుబ్బారావు వినలేని మాటల్ని అప్పుడే అక్కడికొచ్చిన డాక్టర్ రమేష్‌కూడా వినగలిగేడు— కనుకనే అనగలిగేడు—

'ఏమిటిసార్ వీళ్ల పొగడ్తలు ఆగస్తులు దాటు తున్నై. కొంపతీసి వీళ్లిళ్లకెళ్లి వైద్యం చేస్తా నని చెప్పారా యేమిటి?'

'హ్హాబ్బే అదేమి లేదండీ! అవ్వరే.. మీరి వెళ్తప్పుడొచ్చేరేమిటీ మీకు మార్నింగ్ డ్యూటీ లేదుగా!'

'మార్నింగ్ డ్యూటీ లేదు — యీవెనింగ్ డ్యూటీకిరాను. అది చెప్పేందుకే వచ్చాను!'

'ఏం?'

'ఏం లేదండీ! నేటిపూట వూరెళ్తున్నాను. వాల్రోజుల్దాకా రాను. కాస్త నే వచ్చేవరకు మీ 'కన్నబిడ్డల్ని' సాయంత్రం పూటకూడా చూస్తుండండి!'

'అల్లాగే!'

'అబ్బ ఎక్స్ట్రావర్కైనా యెంత తేలిగ్గా ఒప్పేసుకున్నారు సార్!'

'అది నా డ్యూటీ!'

'డ్యూటీలు, ఎక్స్ట్రాడ్యూటీలు 'కరెప్టు'గా చేయటం తప్పనుగాని... చేస్తూకూడా ఏమీ తీసి కోకపోవటం తప్పంటాను!'

'తీసికోటేం! గవర్నమెంటు జీతమిస్తోందిగా!'

'అబ్బ వస్తోందిలెండి జీతం. దాంతో సహ కొంటే అయిదారుబస్తాల బియ్యం కొనగలం. మరి కూరా నారో!?'

'చూడండి సార్! డాక్టరనేవాడు రోగి పుండు మీది ఈగలా బ్రతగ్గూడదు. రోగిమంటలు చల్లార్చే నవనీతంలా వుండాలి. అది నా ప్రిన్సిపుల్!'

'సర్సరి. నాకు బస్సుకు టైమవుతున్నట్టుంది...'

'వెళ్లిరండి!'

(సశేషం)



# శాస్త్ర సాహిత్యాలు పరస్పర విరోధులా?

శ్రీ 'అనంతం'

## శాస్త్రం

'శిష్యతే అనేన' అనే వ్యుత్పత్తి గలిగి, 'శస్' ధాతువుకంటె 'ష్ట్రన్' ప్రత్యయం చేరగా నిష్పన్నమైన రూపం 'శాస్త్రం'. దానికి నిదేశమని, నియమన గ్రంథమని అర్థాలు. వేదాలూ, తదంగోపాంగాలు వ్యాకరణాదులూ శాస్త్రాలు. 'శ్రుతి, మీమాంసా న్యాయతర్కాలూ తపఃప్రవృత్తులైన బ్రహ్మకు మనః సంజాతాలు, శబ్దమాగుములు' అని మత్స్య పురాణం రెండవ అధ్యాయం చెప్తున్నది.

"అధ్యాత్మ శాస్త్రమే ఉపాదేయం.' 'ఇది జ్ఞేయం, ఇది జ్ఞేయం' అని తదితర శాస్త్రాలను వందయేండ్లు చదివినా అంతుండదు. ఆయువు మాత్రం తరిగిపోతుంది. కనుక, వీటిని విడిచి పర లౌకికం ఆచరించాలి. సంసారోత్తరణయత్నం చేయని వాడు పండితుడైనా మూర్ఖుడే, శక్తుడైనా అశక్తుడే" అని అగ్నిపురాణం మునామద్వాదశినామాధ్యాయంలో ఉన్నది.

'శాస్త్రోక్త కర్మనే ఆచరించాలి. తదితరమూ వ్యేదకర్మేతరమూ ఆచరిస్తే నరకం వస్తుంది' అని పద్మోత్తరఖండ సప్తమాధ్యాయంలో ఉన్నది.

ఇది శాస్త్రమూ తత్ప్రయోజనమూ గురించి మనవారి ఆలోచనా పద్ధతి.

పాశ్చాత్యులు శాస్త్ర పర్యాయంగా 'సైన్సు' (Science) అనే పదం విరివిగా వాడతారు. ఇప్పుడు మనం విజ్ఞానశాస్త్రం అనే దానికి సమానంగా వాడబడుతున్న 'సైన్సు' స్థానంలో ఆదిలో 'ఫిలాసఫీ' (philosophy) అనే పదంకూడా వాడేవారు. వారి ధోరణి గురించి ఆలోచించేటప్పుడు శాస్త్రపదానికి సైన్సు అనీ, మనవారి ఆలోచనాసరణి గురించి చెప్పుకొనేటప్పుడు వ్యాకరణాది శాస్త్ర సముదాయం అని సీమితం చేసుకొంటే కొంత సౌకర్యం ఏర్పడుతుంది. వారు వానియందూ, వీరు వీని యందూ అధికంగా కృషిచేసినవారు గనుక. వారు శాస్త్రమంటే జ్ఞానదాయకము అని చెప్పారు. (Science is the communication of knowledge defined by Max Eastman in his lecture entitled 'Literature in an age of science' published in 'The writer and his craft') సత్యమూ జ్ఞానమూ అభిన్నాలు గనుక సత్యవ్యక్తీకరణమే శాస్త్రముపని అని మొత్తంపై మనం అనుకొనవచ్చు.

## సాహిత్యం

సహితములయిన శబ్దార్థముల భావం సాహిత్యం అని నిష్పత్తి. రఘువంశం, కాదంబరి, శాకుంతలం, రామాయణం, మను వసు చరిత్రలు, వేయిపడగలు, ప్రతాపరుద్రీయనాటకం—మొదలయిన రసానంద ప్రధానాలయిన గ్రంథాలు సాహిత్యం అనేది అనుభవసిద్ధమైన విషయం.

పాశ్చాత్యులలో దీనికి (సాహిత్య పదానికి) సమానార్థకంగా వాడబడేపదం పరిమితార్థంలో 'పొయిట్రీ' (Poetry), విశాలార్థంలో లిటరేచర్ (Literature). వారు గద్యాన్ని పద్యంతో పాటు పొయిట్రీ అనరు; అది వేరే విషయం. పొయిట్రీ అంటే 'అనుభూతిని వ్యక్తీకరించేది' అనేది వారి క్రొత్తగా వచ్చిన నిర్వచనం. (Poetry is commu nication of experience—Max Eastman in the above quoted book P. 26.)

ఇక్కడ ఒక్కమాట : మన ఆలంకారికులలో 'కావ్య' నిర్వచనం విషయంలో ఉన్నట్లే, అక్కడా వారి పొయిట్రీ, లేదా, లిటరేచర్ నిర్వచనం విషయంలో అనేకమైన తలపట్లు ఉన్నాయి. తలలు ఉన్నచోట తలపట్లు తప్పవు మరి. అయితే కాలానికీ తగినదీ, మన ప్రాచీనుల రసవాద ధోరణికి దగ్గఱదీ ఈ పై నిర్వచనం.

కనుక మనంకూడా 'అనుభూతి ప్రధానమయినది సాహిత్యం' అనుకొనవచ్చు.

## అ ను భూ తి

రచయిత ఒక దృశ్యాన్నో, వస్తువునో, ప్రాణినో చేష్టనో చూడటంవల్లగానీ, మాటనో, పాటనో, ధ్వనినో వినటంవల్లగానీ, వాయువో, వస్తువో స్పృశించినందువల్లగానీ, ఒక పదార్థం భుజించినప్పుడుగానీ, ఒక పరిమళాన్ని ఆఘ్రాణించినప్పుడుగానీ, భూతభవిష్యద్వర్తమానాలలోని ఏ సంఘటననో చింతించినప్పుడుగానీ, హృదయంలో ఒక కదలిక—ఆనండి, మార్పుఅనండి—కలుగుతుంది. అతడు ఆ కన్నదిగాని, విన్నదిగాని, స్పృశించినదిగాని, తిన్నదిగాని, మూర్కొన్నదిగాని, చింతించినదిగాని రమణీయమైనా, ఏవమునో జాలినో నవ్వునో వెఱపునో వింతనో కినుకనో ఉత్సాహాన్నో నిస్పృహనో కలిగించేది అయినా, అతనిలో కలిగిన ఆ కదలిక–ఆ మార్పు–ఆనందం అనిపించాలి, అతనికి అతడు ఆ వస్తువునో భావాన్నోగూర్చి చేసిన ఆ వర్ణననో వివరణనో—అది పద్యగద్యగేయకథాది ఏ రూపాన చేసినా—చదవగానే పఠితకు తత్స్పర్శస్పందనయే కలిగి, తత్పదృశరూపసాక్షాత్కారమే కలిగి, తత్సదృశానందమే కలగాలి. అదీ అనుభూతి.

ఈ అనుభూతి కలగటానికి ఇంద్రియాలూ, మనోబుద్ధులూ కొంతవఱకూ సాధనాలు అయినా, ఇది తదతీతమైనది. కనుకనే, అలౌకికం.

## అనుభూతి — సత్యం

దీనిపై కలిగే సహజప్రశ్న ఇదే! అనుభూతి సత్యాలు పరస్పర విరోధులా? ఎన్నటికీ కావు. ఒకదశలో అనుభూతికూడా శాస్త్ర సత్యమంత సత్యమే. త్రాసులోతూచి, బద్దతోగాని గ్లాసుతోగాని కొలిచి చూచేటందుకు సాధ్యం కానంతమాత్రాన అది అసత్యంకాదు. కనుక అట్టి తేడాలేదు. ఒకవేళ ఏమైనా తేడాఉన్నదని అనుకొన్నా, తేజస్తిమిర న్యాయంవంటి వైరుధ్యం వాటిమధ్య ఏమీ లేదు.

కొందఱు శాస్త్ర-సాహిత్యాలలో మఱొక రకం భేదం ఉన్నది అంటారు. అది యిది. "శాస్త్రంలో శాస్త్రజ్ఞుడు నిత్యసన్నిహితుడై ఉంటాడు. ఎలా అంటే 'ఈ రెండు వస్తువులనూ కలిపితే ఈ వస్తువు అవుతుంది' అని తేర్చి చెప్తూ ఉంటాడు. రచయిత సాహిత్యంలో అలా ఉండడు' అని. ఉండక పోవటం సాహిత్య దృష్ట్యా గుణమేకాని దోషం కాదు. కాని, ఉంటాడు. 'సుబ్బయ్యముందుకు నడిచాడు. సుబ్బమ్మ వెనక్కు రెండడుగులు వేసింది' అని వాళ్లిద్దరిమధ్య కథ చెప్తున్న వాడి గొంతు మనకు ఇంగుమని వినిపిస్తూనే ఉంటుంది, ఒక్క నాటకంలోతప్ప.

## వైవిధ్యం – వైరుధ్యం

సాహిత్యం వేఱు శాస్త్ర వేఱు అన్నది అనుభవ సిద్ధమైన విషయమే. సాహిత్యం వ్యంగ్య ప్రధానం. శాస్త్రం శబ్దప్రధానం అర్థప్రధాన మైనది మూడవది ఉన్నది. అది పురాణేతిహాసాది. కాని దాని కిక్కడ ప్రసక్తి లేదు. అయితే, రెండూ భిన్నములయినంతమాత్రాన విరోధులు కానక్కఱ లేదు. వైవిధ్యం వేఱు, వైరుధ్యం వేఱు. లంకలో రావణుడూ ఉండవచ్చు, అరణ్యంలో రాముడూ ఉండవచ్చు, ఈయన భార్య జోలికి ఆయన రాకున్నంతవఱకూ. వస్తే వైరుధ్యం తప్పదు మరి.

## వి రో ధా భా స

వైరుధ్యం లేనే లేనప్పుడు దాని ప్రసక్తి ఎందుకు రావలసి వచ్చింది, 'ఆవెమ్మ పిన్నిగారూ, మీరు కొనబోయే గేదె, మా పెట్టబోయే పాట్ల పాదుని తినేసింది తేప్పఅన్న విధంగా' అంటే,

ఉన్నది; లోకుల దృష్టిలో విరోధాభాస ఉన్నది. ఏమిటీ దానికి దృష్టాంతరం? అంటే, అటునుంచి నఱుక్కొని రావాలి

## విజ్ఞాన విద్వేషులు

విజ్ఞాన శాస్త్రరంగంలో విప్లవం తీసుకు వచ్చినవాడు న్యూటన్. ఆతను క్రొత్త సంగతులు ప్రకటించేసరికి రచయితలు వాటిపట్ల కాలక్రమాన అనేక విధాల అభిప్రాయాలు వెలిబుచ్చారు: పద్దెని మిదవ శతాబ్ది మొదటి కాలంలో సైన్సుమీద సాహిత్య రచయితలు విరుచుకుపడ్డారు. వారికి నాయకుడు జోనాథన్‌స్విఫ్ట్. (See P. 25 to 27 of the book—Literature and Science by B. Ifor Evans). ఆతడు తన రచనలలో న్యూటన్‌ని వేళాకోళం పట్టించాడు. దీనికి కారణం సైన్సుపై కంటె న్యూటన్‌పైగల ద్వేషమూ, అతని కీర్తిపై గల అసూయా కారణమట!

పోప్‌కూడా సైన్సుని విమర్శించాడు.

న్యూటన్‌ని మెచ్చుకొన్న రచయితలున్నా వాళ్ళు మొదటి తరగతి రచయితలు కారు.

బ్లేక్ సైన్స్‌ని ఖండించాడు అయితే, ఆతని కారణం భావనాశక్తికి అది ప్రతిబంధకమని. ఆతని దృష్టిలో 'న్యూటన్' అన్నది ఒకని పేరుకాదు. 'భావనా విరోధి ప్రతీక.'

కీట్సు కవిత్వంలో న్యూటన్ పేరెత్తకపోయినా సైన్సుని విద్వేషించాడు. వ్యక్తిగతసంభాషణలలో 'న్యూటన్ భావనా ధ్వంసకుడు' అన్నాడనటానికి సాక్ష్యం ఉన్నది. (పై పుస్తకం పుట 40).

తరువాతి వారిలో ఇంకా ఎందఱో విజ్ఞాన విద్వేషులున్నారు కాని కొందఱు ముఖ్యులైన ఆంగ్ల రచయితలకు శాస్త్రంపట్ల ద్వేషం ఉన్నదనటానికి ఈ నిదర్శనాలు చాలు.

## కవి—పండితుల రవరవలు

శాస్త్ర పండితులకూ కవులకూ మధ్యమా, శాస్త్రాలకూ కవులకూ నడుమనూ రవరవ లున్నట్లు మనకు జనశ్రుతి ఉన్నది :

(1) 'శాస్త్రం చదవలేనివాళ్ళు కవులూ, కవిత్వం చెప్పలేనివాళ్ళు పౌరాణికులూ, పురాణమూ చెప్పలేనివాళ్ళు సేద్యగాళ్ళూ, సేద్యమూ చేతగాని వాళ్ళు భక్తులూ అయిపోయారు.

'శాస్త్రేషు హీనాః కవయో భవన్తి
కవిత్వహీనాశ్చ పురాణభట్టాః
పురాణహీనాః కృషికా భవన్తి
భగ్నాః కృషే ర్భాగవతా భవన్తి.'

అన్నది నిస్సందేహంగా శాస్త్రజ్ఞులమాట. కనుకనే కవులకంటె తమను ఒకమెట్టు పైనుంచుకొన్నారు.

(2) 'పండితకవులే కవులు. కేవలకవులు కేవలం కవులే. పండిత కవయః కవయః, కేవల కవయస్తు కేవలం కవయః.'

ఇదీ పండితాధిక్యాన్ని సూచించే పండితవాక్యమే:

(3) కాగా, కాళిదాసు అన్నాడనే మరొక ఉక్తి పండితలోకంలో ఉన్నది. కాళిదాసు తర్క శాస్త్రం చదవసాగాడు. ప్రామాణ్యవాదఘట్టం అందులో కొంచెం గడ్డునది. అక్కడకు వచ్చేసరికి ఆయనకూ కష్టం అనిపించింది. ఈ శాస్త్రాభ్యాసం తన కవిత్వాన్ని—కవితానిర్మాణశక్తిని – హరిస్తున్నట్లు కనిపించింది. వెంటనే 'నా కవిత్వాన్ని అపహరించే ఈ ప్రామాణ్య వాదానికి ఒక నమస్కారం. 'నమః ప్రామాణ్య వాదాయ మత్కవిత్వాపహారిణే' అన్నాడట.

(4) పాండిత్యం బరువు ఎక్కువైతే కవితా కన్య మెడ విఱిగిపోతుందని మనవాళ్ళు అనుకొన్నారు కొందఱు. 'దండి కాళిదాస భవభూతులకు వివాదం వచ్చి ఎవళ్లము గొప్పవాళ్లమో మాలో, చెప్పమని కాళికాదేవిని అడిగారట. ఆమె 'దండికవి, దండికవి, భవభూతి పండితుడు' అని చెప్పి, తనమాట అందులోనూ ఇందులోనూ కలుపనందుకు కోపపడిన కాళిదాసును, 'నీవే నేను, నీవే నేను, సందేహం

లేదు' అని సమాధానపరచి, అతని సర్వాధిక్యం తెల్లపరచినది' అని ఒక కాకమ్మ కథ చెప్పె.

'కవిర్దండీ, కవిర్దండీ
భవభూతిస్తు పండితః'
'కోహం రండే !' 'త్వమేవాహం,
త్వమేవాహం నసంశయః'

అనే శ్లోకం చదుస్తారు ఇది కాలక్రమాన తత్తదభిమానులు కట్టిన కథే అయినా కొందరి దృక్పథాన్ని తెలుపుతున్నది.

(5) పండితులను కవితాకన్య వరించదనే వరించదు పొమ్మన్నవారూ ఉన్నారు మనలో. 'కవితా కన్యకు వ్యాకరణజ్ఞుడు తండ్రి: తార్కికుడు సోదరుడు: కనుక వారిని ఆమె చేరదు. ఛాందసుడు (వేద విద్యాంసుడు) మడపుపేనుగు వంటివాడు. కనుక భయపడ్డట్టు అతనికి దూరంగానే తొలగిపోతుంది. మీమాంసకుడు నపుంసకుడని నిరసిస్తుంది. కావ్యాలంకరణవేత్తనే తనంతతానై ఆదరంతో వరిస్తుంది.

'నైవ వ్యాకరణజ్ఞమేతి పితరం,
న భ్రాతరం తార్కికం,
దూరాత్సంకుచితైవ గచ్ఛతి పునః
చండాలవత్ ఛాందసాన్,
మీమాంసానిపుణం నపుంసక ఇతి
జ్ఞాత్వా నిర స్యాదరాత్
కావ్యాలంకరణజ్ఞ మేవ కవితా
కన్యా వృణీతే స్వయం'

ఇలా స్పష్టంగా బిల్హణీయంలో చెప్పినవాడు కవి.

ఇంకా ఇలాంటివెన్నో ఉన్నా, ఇక్కడ కవి పండితులమధ్య కలత ఉన్నదనేటందుకు ఈ ఉదాహరణాలు చాలు.

## వైరుధ్య కారణం

పాశ్చాత్య రచయితలలో స్విఫ్ట్ విమర్శకు ల్లారే ఊహించిన వ్యక్తిగతమైన ద్వేషమూ, అసూయా కారణాలుగా అక్కడే చెప్పాము. వారిలో, తదితరుల విషయంలో, 'సైన్సు భావనను చంపేస్తుంది' అన్న భ్రాంతి మూలకమైన భయం కారణం.

ప్రాచ్యులలో పైని ఉదాహరించిన ఒకటవ రెండవ ఉదాహరణాలను పరిశీలిస్తే కవిత్వ పాండిత్యాలలో ఏది గొప్ప అనే వివాదలో పాండిత్యం గొప్ప అనే వాదం వినిస్తుంది. నాలుగవ ఐదవ ఉదాహరణాలలో పండితులను తీసివేయటం కనిపిస్తుంది. వీటిని పరిశీలిస్తే కవులూ శాస్త్రసంవేతులూ జన దృష్టిలో తామే అధికులం అనిపించుకొవాలని తామే వారి గౌరవాదరాలను పొందాలనే పరస్పరం పడిన పోటీయే ఇందుకు కారణం అనిపిస్తున్నది. ఒక సమయంలో కవులకూ మరొకసమయంలో పండితులకూ ఆధిక్య గౌరవం లభిస్తే తదితరులు వారు వారు నింద చేసుకొన్నారనుకొనవచ్చు.

ఇంతంత గొప్పవారయిన కవి పండితులకు వైరుధ్యాని ఈర్ష్యాసూయలూ వ్యక్తిగత ద్వేషమూ కారణం అనటం సముచితం కాదేమో అనే భావం కొందరు సహృదయులలో ఉన్నది. అది కారణం కాకుంటే కాంక్షించదగినదేకాని, సత్యం దానికి విభిన్నం. గతంలో, వర్తమానంలో ఇందుకు ప్రత్యక్ష సాక్ష్యాలు కోకొల్లలు ఎంత గొప్పవారైనా శాస్త్ర సాహిత్యవేత్తలూ కామక్రోధవశులయిన మానవులే!

కాగా, కవితా నిర్మితికి శాస్త్రం అడ్డమా? అన్నదానిని పై వాటిలో మూడవ ఉదాహరణం స్పృశిస్తున్నది. కళాభ్యాసి సుకుమార మనస్కుడై ఉంటాడు. తన ఇచ్ఛవచ్చినట్టు చేసుకొనే భావనలో కలిగిన ఆనందం తన ఇచ్ఛతో నిమిత్తం లేకుండా, ఒక్కొక్కప్పుడు ఇచ్ఛా విరుద్ధంగాకూడా, సాక్షాత్కరించే శాస్త్ర సత్యాన్వేషణలో అతనికి లభించదు. కేవలం బుద్ధికి సాధ్యమయ్యే తర్కాది శాస్త్రాభ్యాసం స్వేచ్ఛానిరోధరూపమైన కష్టాన్ని అతనికి కలిగించి అతని కిష్టమయిన కవితకు అతనిని దూరం చేయవచ్చు.

అయితే, ఇంతమాత్రానికే శాస్త్రం సాహిత్య విరోధి అనుకొన నక్కఱలేదు.

## ప్రతిభ–వ్యుత్పత్తి

మన ప్రసిద్ధ కవులందఱూ ఉద్దండ పండితులు. పాండిత్యపు కండలు పెంచుకొని పరవాది భయంకరులుగా సంచరించి పీరవిహారం చేసినవారు శ్రీనాథుడు లెండఱో! అయితే కేవల పాండిత్యం (వ్యుత్పత్తి) సాహిత్య సృష్టికి చాలదు, అంతేకాదు, పనికిరాదు. కవికి పనికిరాని, తెలియరాని విషయం, జ్ఞానం, లేదు. రవి గాంచనిచోటు కవి గాంచును. దేని సాహాయ్యంతో? ప్రతిభా సాహాయ్యంతో. ప్రధానమైనది ప్రతిభ. ఈ ప్రతిభావ్యుత్పత్తులకు అభ్యాసం తోడు కావాలి, ఇవి మూడూ కలిసి ఉంటేనే ఉత్తమ సాహిత్యోత్పత్తి జరుగుతుంది. ఆ ప్రతిభాహీనులైన పండితులు కవులు కాలేరు— అని గుర్తించిన పండితులు మన కవులు. ప్రతిభ నెంత చక్కగా నిర్వచించరు వారు! ఒకభావాన్ని గాని, వర్ణనముగాని వ్యక్తీకరించ దలుచుకొన్నప్పుడు తదనుగుణమైన 'శబ్దార్థాలనూ, అలంకార తంత్రాన్ని, ఉక్తిమార్గాన్ని, ఇంకా అవసరమైన ఇట్టివానినీ హృదయంలో (తళుక్కుమని) స్ఫురింప జేసేది ప్రతిభ. 'యా శబ్దగ్రామ మర్థ సార్థ మలంకారతంత్ర ముక్తిమార్గ మన్యదపి తథావిధ మధి హృదయం ప్రతిభాసయతి సా ప్రతిభా' (కావ్య మీమాంస) అన్నమాట చెప్పిన రాజశేఖరుడు మంచి కవి కూడా.

ఉత్తమశ్రేణికి చెందిన మన కవులు ప్రతిభా వ్యుత్పత్తులను వాటివాటి యోగ్యస్థానాలను ఎఱిగి, యథార్థంగా ఆరాధించా రనడానికి ఎన్ని ఉదాహరణాలనయినా చూపవచ్చు. ప్రతిభాశాలి అయిన కవి కాళిదాను 'శాస్త్రే ష్వకుంఠితా బుద్ధిః (రఘు 1—19) శాస్త్రానికి తీక్ష్ణబుద్ధి అవసర'మనీ, 'ప్రియశిష్యా లలితే కలా విధౌ (రఘు 8—67) లలితకళలు సుకుమారుల సొమ్ము' అనీ సూచించాడు. అలాగని, సాహిత్య ప్రష్టలకు నిశితమైన బుద్ధిలేక పోయినా ఫరవాలేదనీ, అలరులకు కళలంటవనీ అనటం తెగేదాకా లాగటమే అవుతుంది. ఈ రెండో ఉదాహరణంలో శిష్య లలితకళాపురకాంత అయితే గురువు అవివర్భృష్యమైన మహారాజు అన్నసంగతి మఱచిపోరాదు.

వ్యుత్పత్తి రచయితఊహకు బలా న్నిస్తుంది. భావవ్యక్తీకరణకు బహుమార్గాలను చూపిస్తుంది. ఏ శాస్త్రీయ విషయమూ రచయితకు ఉపయోగించకుండా పోదు. అయితే, తనకు తెలిసినదంతా 'ఇది నాకు తెలుసును సుమా, నేను పండితుడను సుమా, కాదని కొంటున్నారేమో' అని ప్రదర్శనకోసం రచనలో క్రుక్కక, ప్రణయకేళిలో నాజూకయిన కపోల చపేటాలులా బహుసకృత్తుగా వాడుకోవాలి.

## భవభూతి

ఈ సంగతి మన కవులకు కూలంకషంగా తెలుసు. కనుకనే, వేదవేదాంగ పండిత ప్రకాండుడు భవభూతి 'వేదాలూ వేదాంతాలూ (ఉపనిషత్తులూ) అధ్యయనం చేశాము. యోగసాంఖ్యాల జ్ఞానం కబళించాము— అని అంటాతా చెప్పి ఏమి లాభం? అందువల్ల నాటకానికి ఒరిగేదేమీ లేదుకదా' అని తేల్చి చెప్పాడు: అయితే, అంతతో వదలక 'ఇక అపేక్షితార్థ సమర్పక ప్రౌఢిన్యమూ, శ్లాఘ్యార్థత్వమూ, అనేకార్థప్రతిపాదనసామర్థ్యమూ వాక్కులకు కావాలంటారా? ఉన్నది. అదే వ్యుత్పత్తికీ కవితా శక్తికీ జ్ఞాపకం' అన్నాడు.

'య ద్వేదాధ్యయనం, తథోపనిషదాం,
సాంఖ్యస్య యోగస్య చ
జ్ఞానం, తత్కథనేన కిం నహి తతః
కశ్చిద్గుణో నాటకే!
య త్ప్రౌఢిత్వ ముదారతా చ వచసాం
యచ్చార్థతో గౌరవం
తచ్చేదస్తి తత స్తదేవ గమకం
పాండిత్య వైదగ్ధ్యయోః!

(మాలతీ మాధవ ప్రస్తావన)

ఉన్న సామగ్రి ఉర్విఅంత ఉన్నా ఏది ఎక్కడ వింతవఱకూ వాడదగినదో బాగా తెలిసిన కవి భవభూతి. కనుకనే, ఈ వేద వేదాంత వేదాంగ పాండితిని అవసరమైన చోట్ల తళుకులా ఉపయోగించుకొన్నాడు. ఉదాహరణకు:

'ఆవిర్భూత జ్యోతిషాం బ్రాహ్మణానాం
యే వ్యాహారా స్తేషు మా సంశయో భూత్
భద్రాహ్యేషాం వాచి లక్ష్మీ ర్నిషక్తా
నైతే వాచం విప్లుతార్థాం వదన్తి

—(ఉత్తరరామ చరిత్ర 4—18)

'పరంజ్యోతిః సాక్షాత్కారం పొందిన బ్రాహ్మణుల మాటలపై అవిశ్వాసం కూడదు. వారి వాక్కులో శుభలక్ష్మి ఉన్నది. వారు అసత్యం పలుకరు' అని అరుంధతి అంటుంది కౌసల్యతో. ఆమెవంటి బ్రహ్మవేత్తి పలుకులకు లౌకిక ఊహ ఆధారమా ? 'భద్రైషాం లక్ష్మీ ర్నిహితాధివాచి' అన్న శ్రుతి, పై శ్లోక రచనకు ఆధారం అంటున్నారు వ్యాఖ్యాత శ్రీమాన్ వాధూల వీరరాఘవాచార్యులు. వేదంలోని భావాన్నేకాదు మాటలనే భవభూతి, పై శ్లోకంలో ఎలా నిక్షేపించాడో గమనిస్తే ఋషుల, ఋషిపత్నుల సంభాషణలు మనకు ఋక్కులలా ఎందుకు వినిపిస్తాయో తెలుస్తుంది.

(2) అలాగే మఱొకచోట. లవచంద్రకేతు సంభాషణం సందర్భం. లవుడు చంద్రకేతునితో 'రాముడు ఉత్తముడు. కాని ఆయన అశ్వరక్షకులు కాఱుకూతలు ప్రేలారు. అవి సకల క్షత్రియులనూ అధిక్షేపిస్తున్నవి. అందువల్ల నాకు కోపం వచ్చింది' అని చెప్పి, ఎలాంటి మాటలవల్ల కోపం వస్తుందో ఎలాంటి మాటలు మంచివో వివరిస్తాడు. ఈ వివరణకు ముందే లక్ష్మణుని కొడుకు అశ్వరక్షకుడు చంద్రకేతువు నవ్వుతూ 'ఏమిటీ' నీకు నాయన గారి ప్రతాపోత్కర్ష వింటే కూడా కోపం వచ్చిందా?' అంటాడు. దానికి జవాబు చెపుతూ లవుడు *యత్పునః చంద్రకేతో వదసి, 'కిన్ను భవత స్తాత ప్రతాపోత్కర్షే ప్యమర్షః' తత్ పృచ్ఛామి, కిం వ్యవస్థిత విషయాః క్షత్రధర్మాః ? ఇతి. అయితే, చంద్ర కేతూ, నీవు నన్ను 'నీకు నాయనగారి ప్రతాపోత్కర్ష కూడా కోపం తెప్పించిందా?' అని అడిగావు గనుక నిన్ను ప్రశ్నిస్తున్నాను, క్షత్రియధర్మాలు రామునియందు మాత్రమే ఉండాలని నియమం ఉన్నదా ఏమిటి?' అంటాడు. (ఉ. రా. చ. 5వ అం.)

ఈ వాక్యంగురించి ఒక ఇంగ్లీషు వ్యాఖ్యలో (ఉ. రా. చ. బాలమనోరమప్రెస్, మైలాపూర్, మద్రాసు) 'ఈ లవుని మాటలు శాస్త్రవాద సందర్భ వాక్యాలను జ్ఞప్తికి తెస్తున్నాయి' అని వ్రాశారు. అవి జ్ఞప్తికి తెస్తున్నమాట నిజమే. అయితే ? అలా జ్ఞప్తికితెచ్చేలా భవభూతి వ్రాసినందున నాటకానికి కలిగిన మేలేమో వారు వివరించలేదు. భవభూతి మహాపండితుడు కనుక ఆ శైలి వదులుకోలేక పోయాడు అన్నట్లు ఎవరైనా అభిప్రాయ పడవచ్చు. కాని, తత్వం అదికాదు. అదే అయితే ఎల్లెడలా ఆ శైలి లేదే! భవభూతి కావాలని అక్కడ ఆ శాస్త్రవాదశైలి ఉపయోగించాడు. లవుడు ప్రాచేత సాంతేవాసి. మహాప్రతిభతో సర్వ శాస్త్రాలనూ కుశలవులు వాల్మీకివద్ద అభ్యసిస్తున్నారనీ సహాధ్యాయులెవరూ వారిని అందుకోలేక పోతున్నారనీ అంతకుముందు ద్వితీయాంకారి విష్కంభంలో చెప్పించాడు. ఆశ్రమవాసి, గుఱ్ఱాన్నైనా చూడని నిత్యవిద్యావ్యసని, బాలుడు, మాటాడే మాటలు ఎలా ఉండాలో అలా వ్రాశాడు. ఇది వ్యుత్పత్తి ఫలం. దాన్ని ఉపయోగించుకొనే అమేయ ప్రతిభకు అసదృశమైన నిదర్శనం.

## కా ళి దా సు

శాస్త్ర పాండితిని కవికులగురువు, కాళిదాసూ ఉపయోగించుకొని దానిని ఎంత సవృత్తుగా వాడాలో తెలిపే ఒరవడి దిద్దాడు. రెండుదాహరణములు:

*స హత్వా వాలినం వీరః
తత్పదే చిరకాంక్షితే

ధాతోః స్థాన ఇవాదేశం
సుగ్రీవం సంన్యవేశయత్
—(రఘు 12-58)

'వీరుడు రాముడు వాలిని సంహరించి చాలా కాలంనుంచి కావాలని కోరుకొంటున్న అతని పదవిలో సుగ్రీవుణ్ణి ధాతువు స్థానంలో ఆదేశాన్నివలె ప్రవేశ పెట్టాడు.' ఆదేశం అంటే ఒక శబ్దం స్థానంలో విధింపబడే మఱొక శబ్దం. 'అస్తేర్భూః' అనే సూత్రం ప్రకారం 'అస్' ధాతువు స్థానంలో విధింపబడిన భూ ధాతువు అస్ ధాతువుయొక్క అశేష కార్యాన్నీ నిర్వహిస్తుంది. అలా వాలి స్థానంలో సుగ్రీవుణ్ణి ప్రవేశపెట్టాడు. ఇది వ్యాకరణజ్ఞానం కారణంగా సాధ్యమైన అసాధారణ చమత్కార జనకమైన ఉపమ. ఏమిటీ ఆ అసాధారణ చమత్కారం? దీని కిటుకు పదవాక్యప్రమాణపారావారపారీణ మహా మహోపాధ్యాయ కోలచల మల్లినాథసూరి వ్యాఖ్యలో వ్రాసిన పంక్తిలో 'అస్తి ధాతోః స్థానే ఆదేశో భూ ధాతు రస్తి కార్య మశేషం సమభిధత్తే'లోని 'కార్యం అశేషం' అన్న రెండు మాటలలోనూ ఉన్నది. సుగ్రీవుడు వాలి కార్యములను అన్నిటినీ నిర్వహిస్తాడు అని సూచితమన్న మాట. వాలి పదవిలో సుగ్రీవుడు ప్రవేశించినందున వానరరాజ్యాధిపతి మాత్రమేకాదు ఆయన తారాపతికూడా. బహుసంగ్రహంగా అయోధ్యారణ్య కిష్కింధా సుందర యుద్ధ కాండలలోని కథను ఒక్క సర్గలోని నూటనాలుగు శ్లోకాలలో—అందులోనూ నూటొక్కటి అనుష్టుప్ శ్లోకాలే—చెప్పవలసిన మహాకవికి, ఇంత మహార్థ సూచకంగా చెప్పటానికి ఈ ఉపమ ఎలా సాయపడి నదో చూడండి. ఇలాగే అన్ననుచంపి అతని పదవి విభీషణుడికీ ఇచ్చాడు రాముడు. కాని అక్కడ వేయ లేదే ఈ ఉపమ! 'ప్రియ సుహృది విభీషణే సంగమయ్య శ్రియం వైరిణః, తన శత్రువు సంపదను తన ప్రియ మిత్రుడు విభీషణునకు సంక్రమింప జేశాడు' (రఘు 12—104) అని మాత్రమే చెప్పాడు. ఇలాంటి సర్వాంగీణ సర్వతోముఖ సమగ్ర

సుందరంగా ఉపమలను ప్రయోగిస్తాడు కనుకనే 'ఉపమా కాళిదాసస్య' అన్నారు !

(2) అబ్ధప్రతిష్ఠాః ప్రథమం
యూయం కిం బలవత్తరైః
అపవాదైరివోత్సర్గాః
కృత వ్యావృత్తయః పరైః
—(కుమార. 2—27.)

తారకాసుర నిర్జితులై బ్రహ్మపాలికి పోయిన దేవతలతో ఆయన పలికే సందర్భం. 'మీరు మొదట మంచిస్థితి పొందినవారు, అపవాద శాస్త్రాలచేత సామాన్య శాస్త్రాలవలె మీకంటె బలవత్తరులైన శత్రువులవల్ల మీకు బాధకలిగినదా?' అని దాని భావం. 'నిరవకాశాహి విధయః సావకాశాన్ విధీన్ బాధన్తే, నిరవకాశ విధులు సావకాశ విధులను బాధిస్తవి' అన్నది శాస్త్రపరిభాష. ఇంద్రాదులు తూర్పు మొదలయిన దిక్కులకు పాలకులు అన్నది సామాన్యం. రాజ్యం వీరభోజ్యం కనుక వాళ్లను మించినవాళ్లు వాళ్లను ఓడిస్తే ఆ సామాన్యవిధి ఎలా ప్రవర్తిస్తుంది ?

## శ్రీ నా థు డు

ఇలా శాస్త్రీయ విషయాలను కవిత్వోపయోగులుగా అనేకాంధ్రకవులూ నిక్షేపించారు.

ప్రాతఃకాలము వాయసంబు
పణినాపత్యోక్త శాస్త్రంబులోఁ
దాతఙ్ స్థానులు చెప్పఁ డెవ్వి యను
చందంబొప్పఁ గొకా యనం
జాతుర్యం బలరార నుత్తరము
విస్పష్టంబుగాఁ గోకిల
వ్రాతంబిచ్చెఁ దుహీతుహీ యని
గృహారామప్రదేశంబునన్.
—(శ్రీనాథుడు. శృం. నై. 8—11.)

పాణినీయ వ్యాకరణశాస్త్రంలో తు. హి. అనేవి లోట్ప్రత్యయాలు. వాటి స్థానంలో 'తుహ్యోః తాతఙ్ ఆశి ష్యన్యతరస్యాం'అనే సూత్రంవల్ల తాతఙ్ (తాత్)అనే ప్రత్యయం వికల్పంగావచ్చి, తూతు—

యూ్యాత్, యాహి-యాతాన్‌అనే రూపాలు సిద్ధిస్తున్నా అప్రాయి. ఈ విషయం మనస్సులో ఉంచుకొని కాకులు కోకిలలను 'లఙ్ ఏ ప్రత్యయాలస్థానంలో వస్తుందో చెప్పండి'అని ప్రశ్నిస్తే, కోకిలలు 'తుహీ, తుహీ'అని జవాబు చెప్పాయట! అయితే, ఇది శ్రీరాఘువి సొంతంకాదు. భట్టుహర్షునిది. అయితే యేం? తెలుగులోనికి తెచ్చి ది ఆయనే కదా?

## బాలగంగాధరతిలక్

ఆధునిక రచయితలు సైన్సుకు సంబంధించిన విషయాలను తెలుగులో ఎంతో విరివిగా వాడుతున్న సంగతి సర్వవిదితమే. కీ. శే. బాలగంగాధరతిలక్ 'ప్రిజమ్‌వంటిది జీవితం' అన్నారొకచోట. ప్రిజమ్‌ను ఉపమగా గ్రహించడం దున జీవితవైవిధ్యంగూర్చి ఒక్క మాటలో చెప్పగలిగారు.

ఇలా ఎంతటివో ఇంకెన్నో ఉదాహరణలు చూపించవచ్చు.

ఈ విధంగా శాస్త్రాలు సాహిత్యసృష్టికు సహాయకారులు, ఉపయోగకారులు అన్నది సిండి తార్థం.

## భావన_జ్ఞానాజ్ఞానాలు

ఇలాకాక 'శాస్త్రజ్ఞానం భావనాశక్తిని నశింప జేస్తుంది'అన్న వాదాన్నే అంగీకరిస్తే, 'అజ్ఞానం భావనాశక్తిని పెంపొందిస్తుంది' అన్నదాన్నీ అంగీకరించవలసిఉంటుంది. అంతకన్న హాస్యాస్పదమైనది ఉండదు. చంద్రుణ్ణిగూర్చి ప్రాచ్యవిజ్ఞానంలో ఊహలు ఎన్నడూలేవు. అది వారి దృష్టిలో గోళమే. అయితే, అందులో ప్రాణు లున్నాయన్నారు. ఒకప్పు దుండేవేమో! ఏమి తేలినట్లు అప్పుడే? అయినా, చంద్రసంబంధికల్పనల కల్పనకు ఆ విజ్ఞానం ఎన్నడూ అడ్డంరాలేదు.

ఎక్కువగా తెలిసిన వివరాలవల్ల ఎక్కడైనా కవిత్వం పల్చబడిందీఅంటే ఆ వివరాలలో కవిత్వానికి పనికివచ్చే ఘట్టాలను రచయిత యేర్పుకొనలేక పోయాడనో, ఉపయోగించుకొనలేకపోయాడనో అను కోవాలితప్ప ఆ దోషం జ్ఞానానిదికాదు. కాళిదాసు రఘువంశంపేరిటో రఘువంశరాజుల చరిత్రనే వ్రాసినా ఒక్కొక్కరాజు జీవితంలోని తదితర రాజ జీవన భిన్న మైన కవిత్వోపయోగి రసవద్ఘట్టాలనే వర్ణించాడు. మేఘమంటే ధూమజ్యోతిస్సలిలమరుత్తుల సన్నిపాత మన్న తెలివి మేఘదూతంవంటి అద్భుతకాల్పనిక కావ్యం వ్రాయటానికి ఆయనకు అడ్డురాలేదు.

## పరస్పరోపయోగాలు

పైని వివరించినట్లు శాస్త్రం సాహిత్యానికి సహాయకారి అయినట్లే, శాస్త్రవృద్ధికీ, శాస్త్ర వ్యాప్తికీ సాహిత్యం కారణం అవుతుంది. శాస్త్రాన్ని మడిసరుకుగా అవగాహన చేసుకోలేని సుకుమార బుద్ధులను దానికి పూసిన కవిత్వపురంగు ఆకర్షించి శాస్త్రీయ విషయావగాహనకు ప్రేరకం అవుతుంది. ఇందుకు ఏర్పడినవే సంస్కృతంలో భట్టికావ్యాదులు. కనుకనే ఆలంకారికులు కవులను కావ్యకవి, శాస్త్రకవి, ఉభయకవిఅని విభజించారు ముక్తాయింపుగా.

ఇక అధునాతనమైన సైన్సును అందుకో అవగాహనకూ తేవటానికి సాహిత్యమెలా ఉపయోగకారి అవుతున్నదీ ఆంగ్లసాహిత్యపరిచితులైనవారికి బాగా తెలును. సైన్సు విషయాలు ఆధారంగా ఆ భాషలో వచ్చిన రచనలద్వారా ఎందరో ఆ విషయాలపై అభిరుచిలేనివారూ వాటిని గ్రహింపగలుగుతున్నారు. హెచ్. జి. వెల్సు మొదలైనవారు తమ రచనలలో చేసిన ఊహలు ఇటీవల సైన్సు సాధించిన అద్భుత ఫలాలకు ప్రేరకాలని చాలామందికి తెలును.

శాస్త్రవిజ్ఞానం రచయితకు వ్యక్తీకరణలో, అవగాహనలో పుష్టినీ, సులువునూ ఇచ్చినట్లే సాహిత్యం శాస్త్రకర్తకు తుష్టినీ, ఆనందాన్నీ, ఉత్సాహాన్నీ, ఉదాత్తతనూ ఇచ్చి, క్రొంగొత్తవిషయ శోధనకు స్ఫూర్తినికూడా కలిగిస్తుంది. హక్స్లీ జేబుతో ఎప్పుడూ ఏదో రసవద్రచన ఉండే

దంటే శాస్త్రవేత్తకు సాహిత్యంతో ఉండవలసిన సంబంధాన్ని గ్రహించవచ్చు. డార్విన్ ఎంతగానో కవిత్వప్రియుడు.

'సాహిత్య సంగీతకళా విహీనః సాక్షాత్పశుః పుచ్ఛవిషాణహీనః (భర్తృహరి). సాహిత్యసంగీతకళా విహీనుడు తోకా కొమ్ములూలేని సాక్షాత్పశువు'అన్న కవులే 'అనేకసంశయోచ్ఛేది, పరోక్షార్థస్య దర్శకం, సర్వస్యలోచనం శాస్త్రం యస్య నాస్త్యంధ ఏవ సః (హితోపదేశః, ప్రస్తావికా, 10) పలుసంశయములం దొలఁచును, వెలయించు నగోచరార్థ విజ్ఞానము, లోకులకక్షి శాస్త్ర, మయ్యది యలవడ దెవ్వనికి వాఁడ యంధుఁడు జగతిన్ (చిన్నయసూరి నీతిచంద్రిక)' అన్నారు. కనుక మానవత్వంనుంచి పశుత్వానికి దిగ జారిపోకుండా ఉండాలంటే సాహిత్య పరిచయమూ, గ్రుడ్డివాళ్లు అయిపోకుండా ఉండాలంటే శాస్త్ర జ్ఞానమూ అవశ్యకాలే.

## విజ్ఞానయంత్రం

కన్నుకంటే విజ్ఞానం అందరికీ కలిగించాలనే ప్రయత్నంలో మన విద్యావేత్తలు చిన్నతనంనుంచీ సైన్సుగూర్చి కొంతఅయినా అక్షరాస్యులందరికీ తెలిసేటట్లు విద్యాప్రణాళికలలో ఏర్పాట్లుచేశారు. అయితే సాహిత్యప్రీతి ఏర్పడటానికి మహాకవుల మేలి రచనలు చిన్నతనంలో కంఠస్థం కావటం అవసరం అనే విషయం విస్మరించారు దేనికో? ఇందువల్ల విజ్ఞానాభిరుచి వ్యాపిస్తున్నందుకు ఆనందించవలసిందే కాని హృదయం సంకోచించుకుపోయి, బుద్ధి ఒక్కటే విపరీతంగా పెరిగిపోతే, అదేదో రోగం అను కొనవలసివస్తుంది. ఇదే ఇలాగే కొనసాగితే, ఉన్న కొద్దిపాటి భాషాసాహిత్యాధ్యయనద్వారాలను కూడా మూసివేసే ప్రయత్నాలు విజయవంతాలే అయితే, కొన్ని తరాలు గడిచేసరికి మనిషిలో రసాస్వాదనశక్తి పూర్తిగా పోయి, కేవల విజ్ఞానయంత్రం అయిపోదా మనిషి?

---



# జల్లెడలో నీళ్లు

శ్రీ పరిగి రాధాకృష్ణ

ఇదొక తమాషా
కపిల్ రంగులో కళ్లు
అసికేషన్ శైవులో ఒళ్లు
అర్థమవని జీవితంలో
పైన మిన్ను కింద మన్ను
ఈ రెంటినీ కలపాలని విరుగుతున్న వెన్ను
రాత్రింబవళ్లు ఇంటా బయటా
కీచులాటలూ కుమ్ములాటలూ
లేకుంటే బార్లో కళ్లుమూతలు
కాకుంటే బజార్లో పిచ్చికూతలు
అద్దాల వెనక అందంగా కనపడే
నాగరికతా విలాసాన్ని చూసి
చూసి చూసి నోట్లో నీళ్లూరి
అది చేతికందే మార్గం లేక
వెనుదిరిగి కనుమరుగులో
కంటితడి తుడుచుకుని
దిక్కులు చూచే దుస్థితిలో
దీనజన సందోహం!
పీకికే బరువైన నిరుద్యోగ పర్వం
జీవితం ఎక్సోడస్
అన్ని చేతులు చాచి
మింగాలని చూసినపుడు
ఎలా బయటపడాలో తెలీక
తన్నుకుంటున్న ప్రాణాలు.

## జల్లెడలో నీళ్లు

అందరూ నీతులే వల్లించి
భావాల్ని అటూయిటూ పేని
బండబూతులూ తిట్టి
బుకాయింపుకి దిగి
బతకడం మాట మర్చిపోతున్నారు.
బుద్ధికీ మనసుకీ మధ్య ఒద్దిక లేదు
నీతికీ జాతికీ నడుమ వంతెన లేదు.
పాదరసమై బుద్ధి
మనసనే బండరాతిపై
అంటకుండా దొర్లిపోతూ
దేనికది వేరుగా
వేళ్లు నరికిన చెట్టులా వూగుతూ
రేగిన సంఘర్షణకి
చెలరేగిన సంతాపానికీ
కర్తలెవరో తెలీక
ఏరూపమూ అస్పష్టతలోంచి బయటపడక
ఏభావానికీ అయోమయంనుంచీ విముక్తి లేక
అంతా కింగ్ లియర్ మనస్థితిలా గజిబిజిగా
అంతా ఇయాగూ పన్నాగంలా తడిగుడ్డ కోతగా
పైగా
ఒకేవాదానికి వేర్వేరు వేదికలు
ఒకే అనర్థానికి వెయ్యారు సంజాయిషీలు
శబ్దాలూ స్లోగన్లూ సరికొత్త జోకర్ ముక్కలు
అర్థాలూ అంతరార్థాలూ జల్లెడలో పట్టిన నీళ్లు
మకిల పట్టిన మనసులు
వెకిలిచేష్టల పుట్టలు
ఆశిందే ఆదర్శం!
అసలు ఆనందమే అపురూపం !!
సన్నివేశం సానుతాప సందేశసూచకం !!!

---

# క్షేత్రయ్య పదాలలో విశేషాలు

శ్రీ మంచాళ జగన్నాథరావు

ఇదం శరీరం కౌన్తేయ!
క్షేత్ర మిత్య భిధీయతే,
ఏత ద్యో వేత్తి తం ప్రాహుః
క్షేత్రజ్ఞ ఇతి తద్విదః.

అని శ్రీ కృష్ణభగవానుడు శ్రీమద్ భగవద్గీత పదమూడవ అధ్యాయమున ఏది క్షేత్రము? ఎవడు క్షేత్రజ్ఞుడు? అను విషయమును అర్జునునకు ఉపదేశించియున్నారు. మహాజ్ఞానులనుగాని పిలువదగని ఇటువంటిపేరుతో క్షేత్రజ్ఞుని లోకులు పిలిచి గౌరవించిరనగా క్షేత్రజ్ఞుని జ్ఞానసంపద ఎటువంటిదో అర్థమగునుగదా! క్షేత్రజ్ఞుని అసలుపేరు 'మువ్వ వరదయ్య'అని కీర్తిశేషులు శ్రీ విస్సా అప్పారావు పంతులుగారు ఊహించి, ఒక చక్కని అందమయిన కథను కల్పించినారు. మహామహుల జీవిత విషములు సాధారణముగా గోప్యముగా ఉండుట అందరకు తెలిసిన విషయమేకదా! చవ్వాది లింగడు, కంచి వరదుడు, పాలగిరిచెన్నుడు, తిల్లగోవిందుడు మొదలయినవారు అనేకమంది స్వాములు మువ్వగోపాల స్వామితోపాటు క్షేత్రజ్ఞుని పదములలో సాక్షాత్కరించియున్నారు. నీలవేణి, అలివేణి, సన్నుతాంగి, లతాంగి, మోహనాంగి మొదలయినపేర్లు ఎన్నిటితోనో నాయికలను పిలుచుకొన్నారు. లభ్యమయిన పదములలో వరద, మోహనాంగి అనునవి ఎక్కువగా కానవచ్చును. నాలుగువేల రెండువందల పదములు చెప్పిన ఈ మహారసజ్ఞుని జీవిత విశేషములు మనకు తెలియకపోవుట విచారకరము. కీర్తన, కృతి అనునవి అంతగా ప్రచారములో లేని క్షేత్రజ్ఞుని కాలమున పాడుచు, ఆడుచు, అభినయముతో ప్రదర్శింపబడున వన్నియు పదములుగానే పిలువబడుచుండెడివి!

క్షేత్రజ్ఞులు క్రీ. శ. 1625—30 ప్రాంతములనుండి క్రీ. శ. 1670—75 వరకు దక్షిణాదిని పాలించిన కొంతమంది ప్రభువుల ఆస్థానములలో తన పదములు పాడినట్లు ఆధారములు కనబడుచున్నవి కనుక 1605—10 ప్రాంతములయందు జన్మించి 1680 ప్రాంతమువరకు జీవించియుండవచ్చునని అనుకొనవచ్చును. క్షేత్రజ్ఞుని కాలమునకు సుమారు నూరు, నూటయాభై ఏండ్ల వెనుకటివారు తాళ్లపాకవారు, పురందరదాసులవారు. వీరిలో తాళ్లపాక అన్నమయ్యగారు అతివృద్ధులుగా వున్నప్పుడు చాలా చిన్నవయస్సులోవున్న పురందరదాసులవారు తిరుపతిలో వారిని దర్శించిరని వినికిడి. అనగా క్షేత్రజ్ఞునికి పురందరదాసులునకు మధ్యగల వ్యత్యాసము 78 సం॥ మాత్రమే అయివుండవలెను.

ఇచ్చట ఒక విషయము స్పష్టముగా గమనించవచ్చును. సుమారు క్రీ. శ. 1400 ప్రాంతము నుండి కర్ణాటక సంగీతమునకు సేవలుచేసి తమ అమూల్యరచనాపుష్పములను అర్పించి తరించిన వాగ్గేయకారుల చరిత్రలు దొరికినంతవరకు పరిశీలించి చూచినచో 'ఈనాటి కర్ణాటక సంగీతమునకు స్వరూపమును ఎవరు ఎంతవరకు ఏర్పరచిరి?' అను విషయము కొంతవరకు అవగాహన కాగలదు.

క్షేత్రజ్ఞునికి ముందుతరమువారు తాళ్లపాకవారి వంశజ్ఞులు పురందరదాసులు మొదలగువారు. సుమారు అరువది, డెబ్బది సంవత్సరములతరువాత ఇప్పుడు మనము సంగీత త్రిమూర్తులని పిలుచుకొనుచున్న శ్యామశాస్త్రులవారు, త్యాగరాజస్వామివారు, ముద్దుస్వామిదీక్షితులవారు, మున్నగువారు వుండుట వలన అక్కడక్కడ అతికొద్దిసంఖ్యలో మిగిలివున్న

అన్నమయ్య, పురందరదాసులు, క్షేత్రజ్ఞుల రచనలలో గల సంగీతమును పరిశీలించి చూచినచో పదునాలుగవ శతాబ్దమునుండి ఈనాటివరకు సంగీతపు పోకడలు, రాగాల స్వరూపాలు కొంతగా అవగాహన చేసుకొనుటకు అవకాశముండవచ్చును. క్షేత్రజ్ఞుని అసలుపేరు ఏదయినను కానిండు. తాను ఎటువంటి జీవితము గడిపియుండినను యుండవచ్చును. ప్రస్తుతము మనకు లభ్యమయిన 332 పదముల సాహిత్యమును, అందలివే 128 పదముల సంగీత సందర్భములను పరిశీలించి చూచినచో మనలను దిగ్భ్రాంతి గొలుపు పరమ సత్యములుగా కాననచ్చునవి ఇవి.

వివిధమానసిక, శారీరక, అవస్థ, వయోభేదములుగల స్త్రీ—పురుషుల ప్రవృత్తులను మనకు చెప్పుటలో శ్రోత తానుకూడా ఒక పాత్రవలెనో లేక తన భావములను తానే చదువుకొనుచున్నట్లుగనో భ్రమ కలుగునట్లు జీవచైతన్యము ఒలుకు విధముగా ఈతనివలె చెప్పగలవారు కలరా? అని అనిపించును.

రసగంగాధరమును రచించిన జగన్నాథపండితరాయని భావమును తేటతెల్లముగు తెనుగున చెప్పుచు ఒక్కొక్క పదమున ఒక్కొక్క సన్నివేశమును పోషించి అక్కడక్కడే పరాకాష్ఠను చూపించుచు, పదమునందు తాను చూచిన దృశ్యమును మనకు మరువరానిదిగా మరలమరల తలచితలచి ఆనందించుటకు గాను, పదిలముగా మనసునందు దాచుకొనువిధముగా చెప్పగలిగి నేర్పరియు, చదురియు క్షేత్రజ్ఞులు.

మేరువపదమునందు నాలుగువేల రెండువందల పదములు పాడినట్లు క్షేత్రజ్ఞులు చెప్పుకొనియున్నారు. అందు మధుర తిరుమలేంద్రుని ఎదుట కొమ్మని రెండువేల పదములును, తంజపురికేగి ఒక వన్నికి దయచేయక ముందుగా మధురాపురి కేగినారని క్షేత్రజ్ఞునిపై అలిగి ఆ అలుకతీరి తంజావూరి అచ్యుతవిజయరాఘవుడు క్షేత్రజ్ఞుని 'వెలయు మనుష్యుల వెంబడిసి' దర్శింపగా వెయి పదములు వారికి పాడి వినిపించితినని, గొలకొండనవాబు తులసిమూర్తి అయిన గోపాలదేవుని మహిమలు శంకింపగా నలుబది దినములలో వెయ్యిన్నూరు (1,200) పదములు వినిపించితి ని చెప్పిరి.

ఈ మేరువ పదమునందు పేరుకొన్న ప్రభువుల పరిపాలనా కాలము

మధుర తిరుమలేంద్రుడు
క్రీ. శ. 1623–59 వరకు

తంజావూరి అచ్యుత విజయరాఘవుడు
క్రీ శ. 1633–73 వరకు

గోలకొండనవాబు అబ్దుల్లాకుతుబుషా
క్రీ. శ. 1622—72 వరకు.

కనుక సుమారు ఏబది సంవత్సరములలో మనకు నాలుగువేల రెండువందల పదములు చెప్పితినని చెప్పినను, ఇంకను ఎన్నిపదములు పాడియుండిరో ఊహించుటకు శక్యముకాని ఈ పదరచనాకర్త పటవమునకు చేతులు జోడింపవలెనుకదా!

ఇక్కడ ఒక విషయము అప్రస్తుతముకాదు. తులసిమూర్తి అని ఒక పండితుడు గోలకొండవారి ఆస్థానమున ఉండిరనియు వారితో క్షేత్రజ్ఞునకు వాదు కలిగినదనియు ఒక యూహకు కొందరు విజ్ఞులు రూపకల్పన లిచ్చియున్నారు. ప్రతిభాశాలి అయిన క్షేత్రజ్ఞునితో వాదులాడగలిగిన శక్తిసంపన్నుడయిన వాగ్గేయకారుడు ఆ కాలమున నిజముగా వుండియున్నచో ఒకటిరెండు రచనలయినను ఆ వాదు వారివి మనకు లభ్యముకావా? క్షేత్రజ్ఞులు పేరుకొన్న తులసిమూర్తి గోపాలదేవుడే ఎందుకు కాకూడదు? అప్పటి మహమ్మదీయ ప్రభువులు హిందువుల దేవతలయందు నమ్మిక అంతగా లేనివారని చరిత్ర మనకు చెప్పుచునేయున్నదికదా! తంజావూరి, మధుర ప్రభువుల మధ్యగల వైమనస్యమును క్షేత్రజ్ఞులు ఎంతో నేర్పుగా తమ పదములో 'అలుకతీరి తంజావూరి అచ్యుతవిజయరాఘవుడు' అని రెండవ చరణము ప్రారంభమునవే చెప్పియున్నారు.

'బలవంతుడగు గోలకొండపాదుషా తులసి

మూర్తితో వాదు తలచేవేళ' అనుటలో 'వాదు' అనునది గోపాలదేవునితో పాదుషాకు. కనుకనే 'నలుబది దినములలో నన్నుకూడి వెయ్యిన్నూరు పదములు వినిపించె'నని చెప్పుకొన్నారు. 'నన్నుకూడి' అనుటలో తనకును స్వామికిని భేదమే లేదన్నట్లు ధ్వనించుటలేదా!

క్షేత్రజ్ఞులు మధుర భక్తి సంప్రదాయమునకు చెందిన మహాభక్తుడు. ఈతడు పండితుడు, కవి, గాయకశిఖామణియై రసికుడై యుండగా మువ్వపురియందు గోపాలదేవుని ఆలయమునగల ఒక దేవదాసిని చూచి వలచెననియు, ఆమె నిజమయిన దేవదాసి కనుక మానవసంపర్కము ఒల్లనిదై స్వామివారిని శరణుజొచ్చి ఆలయముననే దాగియుండగా, ఈతడు అచ్చటికివచ్చి ఆమెను అర్థించెననియు, ధనము, బలము, యవ్వనము, విద్య, మొదలగునవి గల ఈ వ్యక్తిని సామాన్యునివలె తృణీకరించినచో పగబట్టి బలవంతముగా తనకు ముప్పు తేగలడని యెంచి, దైవకృపవలన కలిగిన ఒక యుక్తిని ప్రయోగింపదలచి ఇతనితో 'స్వామి, తమరు గొప్పకవి, పండితులు కదా! నన్ను పొందగోరుదురేని నా స్వామి మువ్వగోపాలుని మీ పదములతో మెప్పించి పొందుదు'రని అర్థింప, విద్వాంసుడయిన ఈతడు 'ఇంత చిన్న సవాలుకే తాను నిలువబడలేనా!'అని యెంచి ఒప్పుదల తెలిపి ప్రయత్నించగా దేవతాపరముగా అంతవరకు ఒక్కఅక్షరమైనను చెప్పియెరుగనివాడును, శృంగార రచనలయందుతప్ప అభిరుచిలేనివాడును అగుటచేత గోపాలదేవునిపై పదము చెప్పుటకు సందర్భమే తోచక ఇచ్చినమాట నిలువబెట్టుకొను పట్టుదలపై మూడు దినములు అహోరాత్రములు స్వామియందే మనస్సు నిలిపి అచటనే యుండగా, మూడవనాటి అర్ధరాత్రికి గోపాలదేవుని అనుగ్రహము కలిగి పదకవితా సామ్రాట్టు కాగల తన అదృష్టమునకు నాందిగా ఆనందభైరవిరాగమున ఆదితాళములో 'శ్రీపతిసుతుబారికి నే నోపలేక నిను వేడితే కోపాల? మువ్వగోపాలా!'అను తొలిపదము పాడగా, అతనితో పాటుగా మూడుదినములనుండి అచ్చటనేయుండి ఏమి కానున్నదోయని ఆతురతగా ఎదురుచూచుచున్న ఆ యువిద ఆనందబాష్పములతో ఈతనికి తన్నర్పించుకొనగా, అతడు మధురభక్తి సాక్షాత్కారమున కలిగిన చైతన్యముతో 'అక్కా! నీవు నాకంటె ముందుగా స్వామికి ప్రియురాలివైతివి. ఇప్పుడు స్వామికి నాపైకూడా కొంతప్రియము కలుగునట్లు చేయుము'అనియు, ఈ లోకమందలి జీవాత్మలన్నియు స్త్రీలని పరమపురుషు డొక్కడే పురుషుడని అలౌకికమయిన ప్రేమభావముతో ఆ స్వామిని ఆరాధించి తరించవలెనను జ్ఞానము తన కుదయించినది కనుక ఆమెవలెనే స్వామికి తాను దాసుడనని' చెప్పెననియు, అది విని ఆమెయు సంతసించి తరించినదనియు, అనుశ్రుతముగా ఒక కథ పెద్దలవలన వినవచ్చుచున్నది. నిజానిజములు తెలుసుకొనుటకు ఆధారములు లేవు.

మధురభక్తి సంప్రదాయమును శృంగారపరముగా చెప్పుట ప్రాచీనులు అనేకమంది చేసియున్నదే! నాయకుని పొందుటకు నాయిక పడువేదన, నాయకుని పొందిన అనుభవములను, ఇతివృత్తములుగా నుండుట పదములలో పరిపాటి. ఉదాహరణకు 'ఇద్దరివలెనె ఎవ రున్నారురా.' అను సౌరాష్ట్రపదమునందు అన్యోన్యతగల దంపతులు జన్మజన్మలకు దంపతులుగానే పుట్టుదురను మూలసూత్రములలో ఒకదానిని ఎంతచక్కగా చెప్పియున్నారో చూడండి. ఇందరి నాయకులు - నలరాజు, కృష్ణుడు, రఘురాముడు, రంగేశుడు, హరిశ్చంద్రుడు, మదనుడు. వీరితో 'దమయంతి, సీతదేవి, చంద్రమతిగా కష్టములయందును, రుక్మిణి, రంగనాయకి, రతీదేవిగా సుఖములయందును నీకు నీడగానేయున్నావు.' అని చమత్కారముగా చెప్పుటలోని భావసౌందర్యమును తెలుసుకొని ఆనందింపవలెను. 'ఇద్దరిసందున'' అను కళ్యాణి పదమునందు 'మనమిద్దరము ఏకశయ్యాగతులమై యుండగా మనమధ్య నెవతయో స్త్రీ పవ్వళించినట్లు నాకు అనుభవమగుచున్నది. ఈమె యెవ్వరు? గాజుల చప్పుడు నేమంటివే'. ఆమె

'మోవి పొరపాటున అని యుంటిని, అది నమిలిన చెరకు పిప్పివలె చప్పనయి యుండెగదరా!' అనినచో, ఇందలి నాయకుడు పరమాత్ముడు, నాయిక జీవాత్మ! వీరిరువురి ఏకాంతమును భంగపరచునది 'మాయ'. ఈ మాయ స్త్రీ మూర్తి. వివిధములగు ఆకర్షణలను చూపుచున్నది 'మాయ' అని గుర్తించిన తరువాత నమలిన చెరకుపిప్పివలెగాక ఇది వేరెట్లుండగలదు! ఇటువంటి విశేషములు పదముల యందెన్నియో కలవు. ఈ నాటి సాంఘికపు మర్యాద సరిహద్దుల లోనే పదములుపాడి విని ఆనందించుటకు ఏ విధ మయిన ఇబ్బందియులేని పదములెన్నియో కలవు.

శృంగార రసమును, దానియందలి అనుభవములను కూలంకషముగా చెప్పినది ఎరిగి చెప్పని విధముగా క్షేత్రజ్ఞులవారు తమ పదములలో చెప్పియున్నారు. శృంగార రసమును ప్రధానముగా గ్రహించి పూర్వులు కావ్యనాటకాలంకారములను ఎన్నిటినో రచించియున్నారు. మహాకవి జయదేవుని గీతగోవిందమందలి శృంగార గీతములను పాడుకొనుటకు అభ్యంతరము లేనిచో, మనకు క్షేత్రజ్ఞుని పదములు పాడుకొనుటకు అభ్యంతర మేల యుండవలయును? ఈతని పదములు స్వచ్ఛమగు తెలుగు నుడికారములో యుండుటయేనా! ఈనాడు అతి ప్రముఖముపై ప్రచారములోనికి మనము తెచ్చుచున్న జావళుల సాహిత్యములు జుగుప్సాకరముగా యుండుటలేదా?

క్షేత్రజ్ఞుని పదములను ఈ నాటి మన సభ్యతా పరిధులకు సరిపోయిన తవరకే పాడుకొనవచ్చును కదా! కుటుంబ సభ్యులు, స్త్రీ పురుషులందరు అరమరికలు లేకుండా విని ఆనందించుటకు అభ్యంతరములేని రచన లెన్నియో కలవుకదా! వాటినైనను ప్రచారములోనికి తెచ్చుట కర్నాటక సంగీతమందలి అభిరుచి నెరిగిన విజ్ఞుల, విద్వాంసుల ధర్మమని నేను భావించెదను.

పదములయందలి సంగీతము వయ్యారపు నడకలతో వంపులుగల స్వరసంపుటులతో మందగమనమున సాగుచూ, ఈ నాటి విమానవేగపు సంగీతమునకు తనకు సంబంధమే లేనట్లు గంభీరముగా గమనమున సాగిపోవుచుండును. క్షేత్రజ్ఞులవారికి కొలదిగా వెనుకటి వారయిన అన్నమాచార్య, పురందరదాసుల సంగీతపు పోకడలను, పదరచనాపద్ధతులను పరిశీలించి చూచినచో క్షేత్రజ్ఞుని కాలము నాటికే చాలా వరకు కొండమలహరి, గేయహెజ్జుజ్జి, గుమ్మకాంభోజి, సామంతము మొదలయిన రాగములు ప్రచారమునుండి తొలగి, కాంభోజి, భైరవి, ముఖారి మొదలగు రాగములు ప్రజాదరణ పొందుచున్నట్లు తోచును. సామంతమునకు నీలాంబరి, దేశాక్షికి బిళహరి, ఫలమంజరికి కానడ, గౌరిపంతునకు గౌళిపంతు మొదలగు రాగములు వాడుకలోనికి వచ్చుటయు గమనించవచ్చును.

క్షేత్రజ్ఞుని కాలమునాటికి కర్నాటక సంగీతమునందువచ్చిన కొన్నివిచిత్రములగు పరిణామములను ఇచ్చట మనము తరచి చూడవలసియున్నది. భరతుని నాట్యశాస్త్రము సుమారు రెండువేలయేండ్లకు ముందటిదిగా చెప్పుచున్నారు. భరతుని నాట్యశాస్త్రమున సంగీతమును నాటకమునకు ఒక ఉపాంగము గానే చెప్పియున్నారు. ఈతడు నాటకమునకు కావలసిన అన్నివివరములను కూలంకషముగా చెప్పియున్నాడు. నాటకశాల నిర్మాణమునుండి ఒటిధుల ఆసనములవరకు ఈతడు కొలతలతో సహితముగా ఎట్లుమర్చవలెనో చెప్పియున్నాడు. వీణావేణుమృదంగములకు మాత్రమే ప్రాధాన్యతగల దినములనాటి గ్రంథమయినను, ఇందు ఇన్ని తంత్రియందు ఈ స్వరము పుట్టుచున్నదిఅనిమాత్రమే చెప్పియున్నాడు. అనగా వీణయందు శ్రుతులను గుణించుటకు, స్వరములను చెప్పుటకు, తంత్రుల సంఖ్యనే ఉదహరించియున్నాడు. భరతుడు చెప్పినది ఈనాడు వాడుకలో ఉన్న వీణ కాజాలదు. భరతుడు చెప్పిన వీణ 'సంతూర్' అనబడు కాశ్మీరదేశపు తంత్రీవాద్యమును, 'స్వరమండల'అని ఇప్పుడు పిలవబడుచున్న ఒక తంత్రీవాద్యమును పోలియుండవచ్చును.

నాటకమునకు ఉపాంగముగానున్న సంగీతము కాలక్రమమున ప్రత్యేకతను సంపాదించుకొనుటచేత 'సంగీత రత్నాకరము' మొదలగు గ్రంథములు వెలసినవి. స్వరములు శ్రుతులు రాగములు మొదలగు ముఖ్యవిషయములయందు భరతునకిని, రత్నాకరమునకు మధ్యగల సుమారు 700 సంవత్సరముల కాలములో ఎన్నియో మార్పులు వచ్చినవి. అందువలననే నాట్యశాస్త్రమునకును, సంగీతరత్నాకరమునకును చాలా విషయములయందు అభిప్రాయభేదములు గోచరించుచున్నవి. రత్నాకరమునకు వ్యాఖ్యలు వ్రాసిన వ్యాఖ్యాతల కాలము ననుసరించి అప్పటికి వాడుకలోగల పద్ధతులను ప్రాచీన గ్రంథముల రచనలకు వారు చెప్పిన అర్థములు మనము గమనించవలసియున్నవి. ఉదాహరణకు చూడండి. ఈనాటి వయోవృద్ధుల నడిగినచో వారి చిన్ననాటి అలవాట్లు, ఆచారములు, విద్యలు, విద్యాగౌరవములు ఎట్లుండినవి? ఇప్పుడెట్లు మారినవి? అను విషయములను చెప్పగలుగుచున్నారు కదా! సుమారు ఒక వంద సంవత్సరములలోనే ఎన్నియో మార్పులు మనము చూచుచున్నాముకదా! మంచికా, చెడ్డకా అను విమర్శ అప్రస్తుతము. కొన్ని వందల సంవత్సరములలో వచ్చిన ఇట్టి మార్పులను విడదీసి 'ఆనాటి గ్రంథకర్త అభిప్రాయము ఇది.' అని చెప్పుట ఏమంత సులభమయిన విషయమా!

సంస్కృతభాషలో ఎంతటి అభిప్రాయమునైనను ఒకటిరెండు వాక్యములుగల సూత్రములలో చెప్పదగు అవకాశములు కలవు. ఆ సూత్రములకు భాష్యము అవసరము లేకుండగనే కొంతకాలమువరకు పండితులర్థముచేసికొని అభ్యసింతురు. ఆ తరువాత అభిప్రాయభేదములు పుట్టి అవి భాష్యములుగా అవతరించుట జరుగుచునేయున్నది. అందువలననే ఒకరి భాష్యమునకు, మరియొకరి భాష్యమునకును వ్యత్యాసము లెన్నియో మనకు తోచుచున్నవి. మూలసూత్రములు, ఈనాడు వాడుకలోనున్న సంగీతమునకు అన్వయించుటకు ఏవిధమయిన అవకాశములేని విధముగా నేటి సంగీతము మార్పుచెందినది. ఇది 'కాలక్రమమున వచ్చుమార్పు' అని మనము అర్థము చేసికొనవలసినదేకదా!

వీణ ప్రధానమయిన సంగీతవాద్యముగా పరిగణింపబడుట అనాదిగా వచ్చుచున్న ప్రసిద్ధమయిన విషయమే కదా. ఈ ప్రాచీనవాద్యమునందు ఒక్కొక్కరొక్కొక్కవిధముగా మార్పులు తెచ్చుటయు జరుగుచునేయున్నది. ఇప్పటివరకు మన మెరిగిన గ్రంథములలో 'కచ్ఛపి' విద్యాధిదేవతవీణయని, 'మహతి' నారదమహర్షి వీణయని, 'కళావతి' తుంబురువీణయనియు ఇంకను ఎందరెందరో వీణయందు తెచ్చిన మార్పులు వారివారి నామధేయములతో పిలుచుకొనుట జరిగియున్నది. సంగీతమునందు (అనగా గాత్రసంగీతమునందు) వచ్చు మార్పులను వీణయందు పలికించుటకుగల అవకాశములను విజ్ఞులు పరిశీలించినప్పుడు కలిగిన తప్పనిసరి అవసరములే ఈ మార్పులు.

శ్రీ కృష్ణదేవరాయలువారు ఆంధ్రదేశమును పరిపాలించిన కాలము క్రీ. శ. 1509 నుండి 1529 వరకును. రాయలువారి అష్టదిగ్గజములలో ఒకరయిన అల్లసానిపెద్దన కవీంద్రుడు తన 'మనుచరిత్ర' (అను) ప్రబంధములో 'ప్రాతఃకాలపు మందపవనములు వాతాయనమునుండివచ్చి తాకుటచే ఆసమయమున నిన్న నీవు శ్రుతిచేసి ఉంచిన వీణ నాటనే పలుకుచున్నది. ఓ లోలాక్షి ప్రాతఃసమయ రాగమయిన దేశాక్షి రాగమునకు వీణ శ్రుతి చేయవద్దమ్మా'! అని నాయికతో ఆమె చెలి చెప్పినట్లు పేర్కొన్నారు. అనగా సుమారు క్రీ. శ. 1600 వరకు వీణ ఒక్కొక్క రాగమునకు శ్రుతి చేసుకొనవలసిన అనేక తంత్రులుగల వాద్యముగానే వుండి యుండవలయును. 16 వ శతాబ్దపువారయిన రామామాత్యుల కాలము నాటికే లక్ష్య లక్షణములు వేరగుచున్నవనియు వీనిని సమన్వయించి గ్రంథరూపమున వ్రాయవలెననియు తన ప్రభువులు కోరగా తాను 'స్వరమేళ కళానిధి' అను గ్రంథమును వ్రాసితినని చెప్పుకొన్నారు. రామామాత్యుల తరువాత వారయిన సోమేశ్వర పండితులు 'రాగవిబోధ

మను గ్రంథమున ఈనాడు మనము ఉపయోగించుచున్న వీణకు ఒక క్రొత్త స్వరూపమును సృష్టించి వారు ఒక్కొక్క స్వరమును లేక శ్రుతిని పలికించుటకు ఒక్కొక్క తంత్రిని వాడుటకు బదులుగా నాలుగు తంత్రులుమాత్రమేవేసి తంత్రులక్రిందుగా సారికలు (మెట్లు) అమర్చుకొనుట సులభమగు పద్ధతి అని వీరు నిరూపించినారు.

అనగా 17 వ శతాబ్దపు తొలి రోజులలోనే సోమేశ్వరుని వీణ రసజ్ఞుల మన్ననలుపొంది ప్రచారమునకు వచ్చినట్లు ఊహింపవచ్చును. గోవింద దీక్షితులు, వెంకటమఖి, ఘనం సీనయ్య మంత్రి మొదలగు లక్ష్య లక్షణ శుద్ధిగల మహావిద్వాంసులు వీణయ దరి సారికలపై గమక వరికాదులు పలికించు విధములను తరిచిచూచి, కర్నాటక సంగీతమును అత్యంతమనోహరముగా తీర్చిదిద్దిరి. ఏక శ్రుతి, ద్విశ్రుతి త్రిశ్రుతి, చతుశ్శ్రుతి, పంచశ్రుతి, షట్శ్రుతి రిషభములవంటివి స్పష్టముగా చూపగల శక్తి ఉండుటవలనను ఎటువంటిగమకములైననుసర్వాంగముగా సుస్పష్టముగా పలికించుటకు అవకాశముండుటవలనను, విశేషించి సాహిత్య భావమును పలికించుటలో గాత్రమునకు అతిసన్నిహితముగా ఉండుటవలనను ఇప్పటివీణ స్వర సూక్ష్మములను తెలుసుకొనుటకు ఎంతగానో ఉపయోగపడుచున్నది. ప్రాచీనులు చెప్పినట్లు తంత్రులను మేళవించుటలో అనాడు ఈనాడు కూడా సారికలపై నిర్దుష్టముగా గమకములు పలికించుటలో నేర్పరి కావలసిన వైణికుడు 'వీణావాదన తత్వజ్ఞః శ్రుతిశారద విశారదః' అను సూక్తికి ఉదాహరణగా ఉండవలసియున్నది.

దక్షిణదేశమున కర్నాటక సంగీతమని పిలువబడుచున్న మన సంగీత పద్ధతిలో గమక వరికాదుల ప్రయోగములు పరిష్కృతములై నిర్దుష్టముగా ఉపయోగించు సంప్రదాయములు నానాటికి స్థిరపడుచున్నవి. ఉత్తరాదిని గల సితారు, వీను మొదలయిన వీణా స్వరూపములలో మధ్యమధ్య కొన్నిసారికలను వదలి అమర్చుకొనుట అలవాటుగా నున్నది. ఇంతే కాదు. ఉత్తరాదిని చాలావరకు సారికలను దండి క్రింది భాగమున ఒకవిధమగు సూత్రములో బంధించి హెచ్చుతగ్గులు చేయవలసినచో వెనుకముందుకు జరుపుకొను అవకాశము కలుగునట్లు ఏర్పరచుకొన్నారు. వీణలకు సాంబ్రాణి, సీసమందు, బొగ్గు, గుగ్గిలము మొదలయినవి పొడిచేసి వస్త్రకాచితము చేసి తగు పాళ్లలో కలిపి మైనముసంకి ఆ మైనము దండిపొడవునా గోడలుగాపెట్టి, ఆ గోడలపై అడ్డముగా శ్రుతిశుద్ధముగా ఒక స్థానంలో 12 సారికల నమర్చుకొనుట దక్షిణాదిని వాడుకలో నున్నది. అందుచేతనే అనులోమ విలోమ గమకములు అనగా ఒక స్వరమును దానికన్న హెచ్చుగాగాని కొద్దిగా తక్కువగాకాని పలికించుటకు ఎంతో సులభసాధ్యమగుచున్నది. ఇక వీణనుగురించి చెప్పటము చాలించి తిరిగి క్షేత్రజ్ఞులను గురించి చెప్పుకుందాము!

క్షేత్రజ్ఞులు వాడిన రాగములలోని పదముల యందలి గమక వరికాదులు, అందలి సందర్భములను పరిశీలించి చూచినచో ప్రాచీనసంగీత సంప్రదాయము తెలుసుకొనదలచినవారికి ఉపయుక్తము కాగలదు.

ముఖ్యముగా ఘంటా, నవరోజు, శుద్ధకాపీ, సైంధవి, గౌరిపంతు, ఖండె, గౌరి, సామంతం, సింధూరతిలకం మొదలయిన రాగములకు క్షేత్రజ్ఞని పదములే ఆధారములని అనుకొనవచ్చును. ఇంతవరకు దొరికిన పదములలో సుమారు ఏబది రాగములు క్షేత్రజ్ఞులు వాడినట్లు తెలియుచున్నది. కాని నాలుగువేల రెండువందల పదములను పాడిన ఈగాయక శిఖామణి ఇంకను ఎన్ని ప్రాచీన రాగములను పాడియుండెనోకదా! కాంబోజి, భైరవి, తోడి, ముఖారి, శహన, బేగడ సురటి, కళ్యాణి మొదలగు రాగములలో ఈతని పోకడలు రసపుష్టియును, సందర్భశుద్ధియును, కరిగిన గమకములు, సంచారములతోనిండ ఎంతయో హృదయంగమముగా నుండును. ముఖ్యముగా 72 మేళకర్త చక్రము లేర్పడుటకు పూర్వమే రసజ్ఞుల మన్ననలు పొందిన

ఎన్నియో భాషాంగరాగముల స్వరూపములు మనకు పదములలో కానవచ్చును.

విలంబకాలములో గానము చేయదగు క్షేత్రజ్ఞుని పదములు అభినయమునకు ఎంతయో తగినవిగా నుండును. పదములందలి సంగతి పలుకునప్పుడే అందు అభినయము ద్యోతమగునట్లు సంగీతమును సమకూర్చుట ఈతనికే చెల్లినది. ఎవడు భాషయందలి ఉచ్ఛారణా విశేషములను, స్వరములయందలి గమక వరికాదులయందలి బరువు ఒరపులను, భావములయందుగల వయ్యారములను తానెరిగి గానము చేయగలుగునో ఆతడు శ్రోతలను రసానంద లహరులలో ఉయ్యాలలూపగలడు. సంగీతము, సాహిత్యము, అభినయము అను ఈ మూడింటియందును ప్రజ్ఞాపాటవము కలవారికే పదములు పాడి మెప్పించుటకు వీలగుచున్నది. కనుకనే ఈ నాడు పదములు పాడువారు కరువగుచున్నారు. ఇప్పుడు కీర్తిశేషులు వీణ ధనమ్మ వారి సంతతివారు వారి శిష్యులు పాడుచున్నారు.

నా చిన్నతనములో సేలమునందు కొంతకాలముండుట తటస్థించి, అచ్చటగల వృద్ధనట్టువనారు వద్ద సుమారు నూటయేబది పదములను అభ్యసించు భాగ్యము నాకు కలిగినది. పదములను అభ్యసించునాటికి నాకు భాషాజ్ఞానము వస్తుగౌరవము తెలియని కారణమున మరచిపోను, మిగిలిన డెబ్బదియెనిమిది పదములను స్వరపరచి ఇవ్వగా కీర్తిశేషులు శ్రీ టి. వి. సుబ్బారావుగారు పరిష్కరించగా ఆంధ్ర గానకళాపరిషత్తువారి ఆధ్వర్యమున కీర్తిశేషులు శ్రీ విస్సా అప్పారావు పంతులుగారు అచ్చొత్తించిరి. ఇప్పుడు మరికొన్ని పదములను స్వరపరచి అచ్చొత్తించుటకు సిద్ధపరచియున్నాను. నావద్ద పదములను అభ్యసించి కొందరు గాయనీగాయకులు పాడుచున్నారు. ప్రాచీన సంప్రదాయమునందు అభిమానముగల రసజ్ఞులందరు క్షేత్రజ్ఞుని పదములు పాడి, విని ఆనందింతురుగాక.

---



నాటిక:

# ఎంతెంతదూరం!

శ్రీ ఆదివిష్ణు

ఇందులో...

| | | |
|---|---|---|
| దామోదరం | : | పుర ప్రభువు. |
| కేశవరావు | : | దామోదరంగారికి బావమరిది. |
| నారాయణ | : | ఒక మనిషి, అంతే. |
| దీక్షితులు | : | కవి, పేదలకవి బిరుదాంకితుడు, సూక్ష్మంగా పేక. |
| చైనులు | : | అవసరమైనవాడూ, అనవసరమైనవాడూను |
| సంజీవి | : | కుర్రవాడు, పిల్లకాకి. |
| భైరవయ్య | : | |

(గత సంచిక తరువాయి)

[దామోదరం వెళ్ళిపోయేడు. కేశవరావు నడ్డిని చేతులుంచుకుని కాసేపు ఆలోచించేడు. ఒక నిర్ణయానికి వచ్చేడు. కుర్చీలను కిందపారేసేడు. పిస్తోలు తీసుకుని మేడమీదకి వెళ్ళిపోయేడు.

అప్పుడు – లోపలిగదిలోంచి సంజీవి వచ్చేడు. అతను దిగులుగా వున్నాడు. చుట్టూతా కలయజూసేడు. ఒకమూలగా తుపాకీ కనుపించింది. అది పుచ్చుకున్నాడు. ఒక్కక్షణం కోపంతో, ఆవేశంతో అతను నూగిపోయేడు. మేడమీదకి వెళ్ళబోయేడుగాని, ఏదో గుర్తుకొచ్చి ఆగిపోయేడు. తుపాకీని యథాస్థానంలోనుంచి బయటకు వెళ్ళిపోయేడు.

అతను వీధిలోకి వెళ్ళింతర్వాత కేశవరావు మేడదిగి వచ్చేడు. అతని దుస్తులూ, తలా చెరిగి వున్నాయి. నుదుటిమీద గుడ్డ కట్టుకున్నాడు. దానిమీద ఎర్రసిరా అద్దేడు. వచ్చి, సోఫాలో కూచున్నాడు. దామోదరం వదిలివెళ్ళిన తుపాకీని చేతిలో వుంచుకుని దిగులుగా వున్నాడిప్పుడు. నారాయణ చైన్నులతో వచ్చేడు. కేశవరావుని ఆ స్థితిలో చూచి ఇద్దరూ గుమ్మందగ్గర ఆగిపోయేరు. మొట్టమొదట చైన్ను పరామర్శించేడు ]

చైన్ను: ఛేర్మన్ దెబ్బతీసివెళ్ళేడా సార్?

కేశ: (లేచి నించున్నాడు బాధని అభినయిస్తూ. నెమ్మదిగా అన్నాడు) కాల్చడంచాతగాక దెబ్బతీసివెళ్లేడు. రండి నారాయణగారూ! రండి, కూచోండి

నారా: (కూచుంటూ అన్నాడు) అంతా చైన్ను చెప్పేడు. పరుగెత్తుకుంటూవచ్చేం.

కేశ: థేంక్సండి, చాలా థేంక్స్.

నారా: ఈ ఛేర్మన్‌ని మన మింతకాలమూ ఎలా భరించేమో అర్థంగాకుండావుంది. అభ్యుదయ భావాలు బొత్తిగాలేని రాక్షసుడు. లోకకంటకుడు. అభివృద్ధి నిరోధకుడు.

చైన్నుల: పచ్చినెత్తురుతాగే పరమనీచుడు. వీడా మనకి ఛేర్మన్? మీరు ఊం అనండిసార్! దెబ్బకి దెబ్బ ముట్టచెబుదాం!

కేశ: (పేలవంగా నవ్వి అన్నాడు) వద్దు! హింసా ప్రవృత్తి మనకి వద్దు. చంపడానికి వచ్చిన మనిషి నన్ను చంపలేదు. నేం నష్టపోనూ లేదు. ఈ గాయమంటారా? నా గుండె గాయంకంటె ఇదేం గొప్పకానేకాదు.

నారా: ఛేర్మన్ అనుకున్నది సాధించివెళ్ళే మనిషి అలాంటిది, తుపాకీలవచ్చి తుపాకీ నిక్కడ వదిలివెళ్లడంటే ఆశ్చర్యంగావుంది.

చైన్నుల: మిడిల్ డ్రాప్!

కేశ: (బాధ నభినయించేడు) నిజం చెప్పేరు: మిడిల్ డ్రాపే! బావగారు తుపాకీతో వస్తున్నారని చైన్నుల చెప్పినప్పుడు యిక్కడ ప్రళయమేదో జరుగుతుందని నేనూ ఊహించేను. కాని నారాయణగారూ! అటు చూడండి. (పార్వతి ఫోటోని చూపేడు) నా భార్య పార్వతి! బావగారి చెల్లెలు! ఆవిడే! సాక్షాత్తు ఆ దేవతే నన్ను కాపాడింది. ఇక్కడ జరగవలసిన మహాసంగ్రామాన్ని ఆవిడే ఆపింది. చచ్చి స్వర్గానవున్నా, అనుక్షణం నన్ను నీడలా వెంబడిస్తూనేవుందండి! ఆవేశంలోవచ్చిన బావగారు, చప్పున చల్లారిపోయి 'నా చెల్లెలి భర్తవి గనుక బతికిపోయేవు' అన్నారు. నేనేమే నేమో! (ఆవేశం నటించేడు). లక్ష ఛేర్మన్‌లు వచ్చి లక్ష తుపాకులతో కాల్చినా నా ఆశయ సిద్ధికి విఘ్నం కలగదన్నాను. నా ఆశయం నన్ను వజ్రకాయుణ్ణి చేసిందన్నాను. కాల్చడం మాని నామీన కుర్చీలు విసిరేడు బావ! పిచ్చిబావ! నేనూ కుర్చీలను విసరగలను. అవసరమైతే కాల్చనూగలను. నా కెదురు నిల్చిన మనిషిని చంపి పాపం కట్టుకునే కంటె, ఆ మనిషికి నా ఆశయాన్ని వివరించి నావేపు అతన్ని తిప్పుకునే పుణ్యమ్మీద అభిమానమున్న మనిషినిగనక బావగారిమీద చేయి చేసుకోలేదు. నారాయణగారూ! బావని కాల్చకుండానే అతని ధనిక స్వభావాన్నీ, దోపిడీ విధానాన్నీ ఏదోఒక రోజున మార్చగలనండి. మనిషి స్వభావమ్మీద నాకు నమ్మకం యింకా చావలేదండి. మనుషులందర్నీ మార్చేస్తాను. సమభావం, సమానత్వం, పేదల రాజ్యం తెస్తానండి. నా కల నిజం చేసుకుంటానండి. (చేత్తో తలపట్టుకున్నాడు). అబ్బా!

నారా: ప్లీజ్...మీరింక విశ్రాంతి తీసుకోవాలి.

కేశ: విశ్రాంతా? నా కా విశ్రాంతా? ఇంతలో లేదు. ఇంతలో నాకు విశ్రాంతివద్దు:

చైన్నుల: ఇదే భావం, మీ ఆత్మావలోకనంలో చెప్పేరు. ఎంత అందంగా చెప్పేరండి.

నారా: అవును! అన్నట్టు, మీరు కవులని నా కింతవరకూ తెలీదు సుమండి!

కేశ: నేను కవినా? నేరా కవిని? చైన్నులలాటి నా అభిమానులు నన్ను కవిగా చెప్పుకుంటారు. ఏమో? మీరన్నట్టు నేనూ కవినే నేమో? నేను పొందిన క్షోభ, మనఃక్లేశం పదిమందికీ చెప్పాలని ప్రయత్నించేను, ఆ ప్రయత్నాన్ని మీరూ మీరూ కవిత్వమంటె కవినే నేను! ఎన్నో రాత్రిళ్ళ—నగరమంతా నిద్రపోతున్న సమయంలో నేనొక్కణ్ణీ మేలుకుని వున్నాను! అప్పుడు నా తప్పొప్పుల జాబితాలో తలదూర్చేను. నా తప్పుడు జీవితాన్ని చదివి చదివి కృంగిపోయేను. మనసు తేలిక పడేంతవరకూ ఏడ్చి ఏడ్చి నన్ను నేను

ఓనార్చుకున్నాను. ఆ పైన - కాగితాన్ని నాలుగక్షరాల పశ్చాత్తాపంతో నలుపుచేసేను. దాన్నిమీరు పవిత్ర్యమని అంగీకరిస్తే తప్పకుండా కవినే నేను! ఆత్మావలోకనంలో వచ్చి నిజాల తోరణాలున్నాయి. నా గత హీనమైన బ్రతుకుతోపాటు నా భావి సుందర స్వప్నముంది! ఈ రెండూ మిమ్మల్ని కదిలించి, మీ రసహృదయాలను స్పందింప జేస్తే కవినే అవుతాను.

నారా: (ముగ్ధుడయ్యేడు) మీలాంటి పురోగాముల్ని మోస్తూ ఈ నగరం పునీతమైంది. చైర్మన్‌ని భరిస్తున్న ఈ నగర దౌర్భాగ్యాన్ని మీరే తొలగించాలి.

కేశ: మరో మహానుభావుడు ఈ నగరానికీ రాబోతున్నాడు. నా 'ఆత్మావలోకనా'న్ని ఆవిష్కరించి, మన పౌరులచేత సన్మానం స్వీకరించబోతూన్న ఆ మహానుభావుడు మహాకవి పేక! మహాకవి పేక ఈ నగరాన్ని చూస్తాడు. ఈ నగర వ్యాధిని పరీక్షిస్తాడు. నిజమే— మీరన్నట్టు ఈ నగర దౌర్భాగ్యం తొలిగిపోయే రోజొచ్చేసింది!

నారా: (ఆనందంతో ఉక్కిరి బిక్కిరయ్యేడు) మహాకవి పేకా? ఎంత అదృష్టం? మన నగరానికి మహాకవి పేక వస్తున్నాడా? పేక మీకు తెలుసునా సార్?

కేశ: తెలుసా అంటె ఏం చెప్పను? తెలుసు! లేదు! పేక రాసిన కావ్యాల్లో ప్రతిఅక్షరమూ తద్వారా ఆ కవి హృదయమూ నాకు బాగా తెలుసు! పేక వ్యక్తిగా నాకు బొత్తిగా తెలీదు. మహాకవిని మనం ప్రత్యక్షంగా చూడక్కర్లేదు నారాయణగారూ! ఆయన కవిత్వాన్ని మన ఆత్మబంధువుగా ఎంచుకుంటే చాలు!

నారా: (కదలిపోయేడు పూర్తిగా) కేశవరావుగారూ! ఏమిటో అనుకున్నానుగానీ, పరిపూర్ణమైన వ్యక్తి మీరు! చెడు చేయనిదే మంచి విలువ తెలీదంటారు. మీరు అది నిజం చేసేరు. కొన్నేళ్లపాటు మీరు దోపిడీవర్గం మనిషై ఆ వర్గంలోవున్న నీచాన్ని అనుభవ పూర్వకంగా తెలుసుకుని—దానిపై రోత కలుగగా తిరుగుబాటుచేసి మాకు దగ్గిర వాలేరు. మహాకవి పేకని అభిమానించే రసహృదయులైన మీకు నా హృదయపూర్వకమైన అభివాదాలు. చెప్పండి. మీ ఆత్మావలోకనం ఆవిష్కరణ ఎప్పుడు? మహాకవి పేక రాక ఎప్పుడు? చెప్పండి సార్?

కేశ: ఆగష్టు పదిహేను! స్వతంత్ర భారతదేశావతరణం రోజు! బానిస బ్రతుకునుండి విముక్తి పొంది, నేటి స్వతంత్రుడ్ని బానిసగా చేసుకుంటూన్న ప్రస్తుత హింసామయచరిత్రకి ఈ ఆగష్టు పదిహేను గొప్పపేరడీ! 'ఆత్మావలోకనం' సరిగ్గా ఆ రోజే ఆవిష్కరింపబడేది.

నారా: అయితే, ఆ ఏర్పాట్లు నా కొదిలేయండి. ఇంతకంటె మహద్భాగ్యమైన అవకాశం నాకు మరొకటి లేదు. రాదు. మీరు నిశ్చింతగా వుండండి. ఆగస్టు పదిహేను సరిగ్గా వారం రోజుల్లో వుంది. ఫర్లేదు. ఏర్పాట్లు ఘనంగానే చేయవచ్చు.

కేశ: థేంక్స్. మనిషికి మనిషితోడు. సదాశయానికి సదాశయం తోడు.

(సంజీవి నీరసంగా వచ్చి నిలబడ్డాడు. అతన్ని చూచి అందరూ మాట లాపేసేరు. చాలాసేపు నిశ్శబ్దంగా వుంది. సంజీవి పిచ్చిచూపులు చూస్తున్నాడు. కేశవరావు సంజీవి దగ్గిరికెళ్లి, అతని భుజాన్ని తట్టేడు. సంజీవి కేశవరావు 'దొంగదెబ్బ' వేపు చూస్తున్నాడు)

కేశ: ఎక్కడికి వెళ్లేవు సంజీవి?

సంజీ: (ఇంకా కేశవరావు వేపే చూస్తున్నాడు)

చైన్మ్లు:మరేం ఫర్లేదు సంజీవీ! కేశవరావుగార్ని చైర్మన్ కాల్చలేక పోయేడు.

సంజీ: కాల్చలేరు. కాల్చడం ఇకముందు జరగదు.

నారా: మంచి మాటన్నావ్! నువ్వెక్కడ్నుంచి వస్తున్నావ్!

సంజీ: చైన్మ్లగారు పరుగెత్తేరు. నేనూ పరుగెత్తేను.

కేశ: ఎక్కడికి?

సంజీ : ఏమో తెలీదు. పరుగెత్తేను. ఇంకా పరుగెత్తేను. పరుగెత్తుతూనే రక్షించండి...రక్షించండి అని గావుకేకలు వేసేను. పరుగెత్తేను. నా కేకలు ఎవరూ వినలేదు. నా కేకలు నా గొంతులోనే వుండిపోయేయి. రక్షించేందుకు ఎవరూ రాలేదు. పరుగెత్తుతూనేవున్నాను. పరుగెత్తి, పరుగెత్తి అలుపొచ్చి ఆగిపోయేను. ఆగిపోయి కూలిపోయేను. కూలిపడ్డాను.

చైన్మ్లు: ఎక్కడ?

సంజీ : ఇక్కడే!

నారా : (భయపడ్డాడు. మనిషిని పట్టుకు కుదిపేడు) సంజీవీ! ఇటు చూడు. ఏమిటి నువ్వు మాటాడేది?

సంజీ : నిజం. నిజం మాటాడుతున్నాను. నిజంగా నిజమే మాటాడుతున్నాను. నిజాన్ని నిజంగా నిజమే మాటాడి మాటాడ్తున్నాను. నేనంతా నిజమే మాటాడుతున్నాను.

కేశ : నాయనా! సంజీవీ! ఏంజరిగింది బాబూ? నేను క్షేమంగానేవున్నాను నాయనా!

చైన్మ్లు: చూడు సంజీవీ! కేశవరావుగారికి ఏ ఆపదా జరగలేదు. క్షేమంగా వున్నారు. వారికి మనమంతా తోడుగావున్నాం. రా! లోపలికొచ్చి విశ్రాంతి తీసుకో ముందు.

(చైన్మ్లు సంజీవిని లోపలిగదిలోకి తీసుకెళ్లేడు)

కేశ : (క్షణమాగి అన్నాడు) ఈ విశ్వాసాన్ని చూసేరా? నేనంటె సంజీవి కెంతటి ప్రేమో అర్థంచేసుకున్నారా? నా గాయాన్ని చూచి షాకైపోయేడు. ఎక్కడిదండీ ఈ అనుబంధం?

నారా: కన్నసంతతి నొదిలి సంజీవిని ఆ స్థానంలో వుంచేరంటె సాధారణ విషయమా సార్?

కేశ : ఏమో? ఏది సాధారణమో, ఏది అసాధారణమో! ఈ మమతలూ, ఈ స్నేహాలూ, మంచితనాలూ అనుభవానికి వస్తున్నప్పు డంతా నన్ను నేను మరిచిపోయి పులకించిపోతూంటాను.

(చైన్మ్లు లోపలిగదిలోంచివచ్చి అన్నాడు)

చైన్మ్లు: ఏంలేదు. చిన్నషాక్. అదే సర్దుకుంటుంది.

కేశ : (ఫోన్‌దగ్గిరికి వెళ్లేడు) డాక్టర్‌కి ఫోన్ చేస్తాను.

చైన్మ్లు: అయితే మాకింక సెలవిప్పించండి.

నారా : నమస్తే! వెళ్లొస్తాం.

[కేశవరావు రెండు చేతులూ జోడించేడు. నారాయణా, చైన్మ్లా వెళ్లిపోయేరు. ఆ తర్వాత కేశవరావు ఫోన్ డయల్‌చేయడం ప్రారంభించేడు.

అప్పుడు వేదికమీద దీపాలు ఆర్పబడ్డాయి.]

## 2

[ఆగస్టు పదిహేను. అదే యిల్లు. కేశవరావు ఒక్కడే ఫోన్‌దగ్గిర కూచున్నాడు.]

కేశ : (ఫోన్ డయల్‌చేసి మాటాడేడు) హల్లో... ఈజిట్ రైల్వే ఎంక్వయిరీస్......చూడండి. మెయిల్‌కింకా ఎంతటైముందండీ?...వచ్చేసిందా...థేంక్స్.

(ఫోన్ పెట్టేసేడు. క్షణం గడిచింతర్వాత ఈ తడవ దామోదరం నెంబరు డయల్‌చేసేడు. ఫోన్లో దామోదరం దొరకగానే మొహంలో వెల్తురు నింపుకుని మాటాడటం ప్రారంభించేడు.)

కేశ : హల్లో...బావగారా? నమస్కారం. యస్. నేనే! పది నిమిషాల్లో మహాకవి పేక వస్తున్నాడు.

మెయిలొచ్చేసిందిట. మహాకవిని రిసీవు చేసు కునేందుకు నారాయణా, చైన్నాల్లా వెళ్లేరు.... ఎవరు?......చికా!......లేడు. సెలవు పెట్టి వాళ్లూరు వెళ్లాడు. బహుశా అత నివాళ రాకపోవచ్చు...ప్రస్తుతం నేనొక్కడ్నేవున్నాను... అవునండి...మహాకవి పేకకి ఇక్కడే విడిది ఏర్పాటుచేసేను...సరిగ్గాసాయంత్రం ఆరింటికి 'ఆత్మావలోకనం' ఆవిష్కరణ! ఇవాళ మళ్లా మీకు ఫోన్‌చేయడం నీ లవదు. ఇంటినిండా మనుషులుంటారు. నామినేషనా? పూర్త యింది...మన మనుకున్నట్టు పేదలపార్టీ అభ్యర్థిగా వన్నే నామినేట్ చేసేడు నారా యణ!...థేంక్స్...ఇక వుంటాను...అన్నట్టు పెదబాబు ఖర్చుకి డబ్బు పంపేరా?...రైట్... వెడతాను. తీరుబాటుచేసుకుని నేనే బెంగుళూరు వెళ్లి వాడిని చూచివస్తాను. అల్లాగే... నమస్కారం...

[ఫోన్ పెట్టేసి మేడమీదికి వెళ్లేడు. చేతిలో ఒక దండ పుచ్చుకుని మళ్లా మేడ దిగివచ్చేడు సరిగ్గా అదే సమయానికి సంజీవి గుమ్మంలో ప్రత్యక్ష మయ్యేడు.]

సంజీ : గుడ్‌మార్నింగ్ సర్!

కేశ : వచ్చేసేవా? నువ్వు రావనుకున్నానుసుమీ!... ఇంకో పది నిమిషాల్లో మహాకవి పేక వచ్చే స్తున్నారు. ఇదిగో ఈ దండ వారికోసమే ప్రత్యేకంగా కట్టించేను.

సంజీ : దండ అందంగావుంది సార్.

కేశ : అవుమా! నిన్నగా మీ వూరినుంచేనా వస్తూంట? బాగా వలిగిపోయేవు. నీ వంట్లో యిప్పుడెల్లా వుంది?

సంజీ : నేను క్షేమమే సార్! మా వూరు వెళ్లిం దగ్గర్నుంచీ నాకు నిద్రలేదు. అందుచేత నలిగి వున్నాను. అంతే.

కేశ : నిద్రలేదా? ఎందుకుట? అన్నట్టు మీ అమ్మా నాన్నా క్షేమంగా వున్నారా?

సంజీ: నాన్న క్షేమమే నాతోపాటు. కానీ, అమ్మ యింక బతకదు: చివరిక్షణాలు.

కేశ : సంజీవీ!

సంజీ: అవున్సార్! అమ్మ నిజంగా బతకదు. ఆ మాయ దారి రోగం అమ్మని బతకనివ్వదు.

కేశ : (సంజీవి భుజాన్నితట్టి అన్నాడు) ధైర్యంగా వుండు. అయినా, ఈ పరిస్థితుల్లో అమ్మ నొదిలి ఇప్పుడెందుకు వచ్చేవ్?

సంజీ: (పేలవంగా నవ్వి అన్నాడు) పోయే అమ్మ ఎల్లాగో పోతుంది. అందుకనిచెప్పి ఇక్కడ నా విధుల్ని నేనెల్లా మరిచిపోతాను చెప్పండి?

కేశ : నీ విధులా?

సంజీ: అవున్సార్! మహాకవి పేక ఇవాళ వస్తున్నారు. మీ 'ఆత్మావలోకనం' కావ్యావిష్కరణ ఇవాళ జరుగుతుంది. నా చేతినిండా పని! ఇవాళ నేనిక్కడ లేకపోతే, మీ కెంత కష్టమో చెప్పండి?

కేశ : నేనంటె నీకెంత అభిమానమయ్యా! నన్ను గౌరవించు చాలు. వెళ్లు. ఇక్కడి వ్యవహా రాలు నేను చూచుకుంటానుగాని నువ్వు మీ వూరెళ్లిపో!

సంజీ: క్షమించండి. నేను వెనక్కి తిరిగి వెళ్లిపోవ డానికి రాలేదు. ఈ రోజు నా జన్మకిక తిరిగిరాదు ఇవాళ నా చేతనైన సాయం చేసి నన్ను పుణ్యం కట్టుకోనివ్వండి. మరింకేమీ చెప్పద్దు.

కేశ: (నిట్టూర్చేడు) సరే! నీ యిష్టం. నువ్వింతగా అడుగుతున్నావ్ గనక నీ యిష్టమొచ్చి నట్టె కానివ్వు. లోపల ప్రింకులున్నాయి. అతిథులొస్తున్నారు. సిద్ధంచేయి. వెళ్లు.

(సంజీవి లోపలి గదిలోకి వెళ్లబోతూ తుపాకీని చూచి ఆగిపోయేడు)

సంజీ: సార్! ఈ తుపాకీనింకా యిక్కడే వుంచేరు? ఛేర్మన్‌గారికి పంపలేదా?

కేశ : ఇక్కడే వుండనివ్వు. జ్ఞాపకార్థం పడి వుంటుంది.

సంజీ: (తుపాకీని తీసుకున్నాడు) పాపం; దీని నొసట నేం రాసివుందోగాని—ఎంతో విలువైన వస్తువు. పూచిక పుల్లలా పడివుంది యిక్కడ!

కేశ : (ఖంగారుగా అన్నాడు) జాగ్రత్త! లోడ్‌చేసి వుంచి.

సంజీ: ఈ తుపాకీ గురించిన చరిత్ర చైన్లు చెప్పేరు సార్! ఇది, ఇంతకుమునుపు చాలా మంది అమాయకుల్ని కాల్చి 'పాపం' మూటగట్టుకుందిట! దీని వయస్సాలోగాని కనీసం ఒక్కమంచి కార్యంకూడా నోచుకోలేదుట. కొన్ని వస్తువులు ఎన్ని అర్హతలూ వుండి గూడా యిలాగే దుమ్ముకొట్టుకు పోతుం టాయి సార్!

(తుపాకీని కింద వుంచేసేడు సంజీవి)

కేశ : (సంజీవిని చిత్రంగా చూస్తూ అన్నాడు) చిత్రంగా మాటాడుతున్నావ్?

సంజీ : వేదాంతం సార్! ఈ వారంరోజులూ అమ్మ పక్కన కూచబడి నేర్చుకున్న వేదాంతం!

(మాటలాడి సంజీవి వేగంగా లోపలికి వెళ్లిపోయేడు. కేశవరావు ఆశ్చర్యంగా చూస్తూ నిలబడి వున్నాడు. ఇంతలో బయటనుంచి 'మహాకవి పేకకి జై' అనే నినాదాలు వినిపించేయి. కేశవరావు ఉలిక్కిపడి దండతో వీధిగుమ్మంవేపు నడిచేడు. నారాయణ ముందుగా వచ్చేడు. ఆనందంగా కేశవరావుతో అన్నాడు.)

నారా : వచ్చేసేరు. మహాకవి పేక వచ్చేసేరు. దండతో రెడీగా వున్నారుగదా! ఒక్కక్షణం.. మహాకవిని తీసుకొస్తాను.

(క్షణంలో మాయమై మళ్లా మహాకవితో ప్రత్యక్షమయ్యేడు నారాయణ. మహాకవి అందంగా బలంగా వున్నాడు. మధ్యవయస్కుడు.)

నారా : వీరే...మన కేశవరావుగారు. మనందరి కేశవ రావుగారు!

కేశ : (దండని మహాకవి మెళ్లోవేసి, చేతులు జోడించి వినయంగా అన్నాడు) నమస్కారం! ఇవాళ సుదినం. మిమ్మల్ని కలుసుకునే భాగ్యం నా కివాళ దొరికింది. దయచేయండి.

[మహాకవి హుందాగా నడిచివచ్చి సోఫాలో కూచున్నాడు.]

పేక : చాలా సంతోషం. చిన్నప్పుడు, అలనాడెప్పుడో చూసేను ఈ వూరు. బాగా పెరిగిపోయిం దిప్పుడు. చాలా బాగా పెరిగిపోయింది.

కేశ : ఊరు పెరగడంతోపాటు ఊరి సమస్యలూ పెరిగిపోయేయి. వాటితోపాటు బావగారి ఆదాయమూ పెరిగిపోయింది.

పేక : బావగారంటె?

నారా : ఛేర్మన్. దామోదరంగారు.

పేక : దామోదరంగారా! అవునవును. విన్నాను. ఇక్కడికొచ్చేముందు నేను చాలా సేకరించేను వివరాలు! ఈ ఊరికి సంబంధించినవి. ఇక్కడ బతికే సగటుమనిషి సగటు జీవితమెంత దుర్భరమోకూడా విన్నాను.

కేశ : బాగా చెప్పేరు. సంజీవి!—

[సంజీవి డ్రింకులతో, చైన్లు సూటుకేసుతో వచ్చేరు.]

చైన్లు: దుంపతెగిపోయింది. ఓకులు తగ్గించుకునే సరికి తల ప్రాణం తోకకి వచ్చిందనుకోండి. [సంజీవి డ్రింకులు పంచేస్తున్నాడు]

పేక : (డ్రింకు పుచ్చుకుంటూ అన్నాడు) ఒకులు తగ్గించుకోడమంటె?

చైర్మన్: (ఒకచేత్తో సూటుకేసూ, ఒకచేత్తో డ్రింకూ పుచ్చుకుని ఇబ్బందిగానే ఉన్నాడు) జనం సార్! వాళ్లని మంచిమాటలతో వెనక్కి పంపే సరికి నా తాడు తెగింది. 'ఇయ్యాళ సాయంత్రం టవున్‌హాల్లో మహాకవిని అందరూ చూడొచ్చు వెళ్లండి బాబూ వెళ్లండి' అని వాళ్లకాళ్లా గడ్డం పట్టుకు బతిమిలాడేను. వెళ్లిపోయేర్లెండి. ఈ సూటుకేసు ఎక్కడ పెట్ట మంటారు కేశవరావుగారూ?

సంజీ: ఇలా ఇవ్వండి! (చైర్మన్ దగ్గిరున్న సూటుకేసు పుచ్చుకున్నాడు)

పేక : జాగ్రత్త బాబూ! నెమ్మది. సూటుకేసులో వస్తువులు చాలా వున్నాయి. అన్నట్టు ఇతనెవరు?

కేశ : సంజీవి! ఇక్కడే నా దగ్గిరే వుంటున్నాడు.

నారా: తమకి దార్లో చెప్పేను చూడండి. నైట్ కాలేజీ...

పేక : అవునవును. అదృష్టవంతుడు. (క్షణమాగి) చూడు సంజీవీ! ఆ సూటుకేసు నెక్కడైనా భద్రంగా వుంచేం?

(సూటుకేసుని తీసుకెళ్లి తుపాకీ పక్క నుంచేడు సంజీవి.)

పేక : తుపాకీ వుందిక్కడ! కేశవరావుగారు వేట మనుషులా?

నారా : అది వీరిది కాదులెండి. ఛేర్మన్‌గారిది.

చైర్మ : కేశవరావుగార్ని కాల్చడానికి తీసుకొచ్చి. కాల్చడం పోయి — దాన్నిక్కడ వదిలివెళ్లిపోయేడు. ఏ ఫైన్ మిడిల్ డ్రాప్!

పేక : (మూడ్‌లోకి వచ్చేసేసు) మనం కలియుగం లోకి పోతున్నాం...మనిషిని మరో మనిషి కాల్చిచంపడం దినచర్యలో తప్పనిసరిగా ఒక ఐటమైపోయింది! భోగలాలసుడైన మనిషికి ఒక స్టేజిలో హింసాప్రవృత్తి అలవాటు పడుతుంది. తన మితిమీరిన అవసరాలు, ఖరీదైన కోరికలు ఇవన్నీ ఫలవంతం కావాలంటె అతను కొందరి నోళ్లని కొట్టాలి! ఎక్స్‌ప్లాయిటేషన్! ఒక గొప్పవాడిచేత కొందరు సగటు మనుషులు దోపిడి చేయబడుతున్నారు. దీనివల్ల సగటు నడుం విరిగిపోతోంది! పేదవాడు యింకా పేదవాడవుతున్నాడు గొప్పవాడు యింకా పైపైకి ఎదిగిపోతున్నాడు. రేస్... రేస్...పరుగుపందెం ప్రారంభంలోనే ఈ గొప్పవాడు ముందు నిలబడి వున్నాడు. వెనకున్న పేదవాడు ఎప్పుడూ వెనకే మరి! అయినా పందెం సాగుతూనే వుంది. రెస్ట్‌లెస్! ఎయిమ్‌లెస్! హెల్ప్‌లెస్! స్టిల్ ది రేస్ ఈజ్ గోయింగ్ ఆన్!

పేదమనిషీ! ఆగక్కడ!
ఆగిపో తమ్ముడూ!
ఈ పరుగుపందెం నీక్కాదు!

కేశ : (మహాకవి చదువుతూన్న గేయాన్ని అందుకున్నాడు)

నీ గుండె గాయం
ఈ పందేనికి సరిపడదు!
నీ కాళ్లు విరగ్గొట్టిన
మనిషితో నీకు పందెమా!
ఆగిపో.

పేక :(ఆనందించేడు) థేంక్స్. అందుకున్నారు.

కేశ : ఏం చేయను చెప్పండి? మీ 'పరుగుపందెం' నన్ను అంతగా ఆకర్షించింది. చదవని రోజు లేదు. నాకు మీ కావ్యం 'గీత'.

నారా : తమకి ఈ కేశవరావుగారు ఏకలవ్యులు.

పేక : అంతమాటెందుకు లెండి?

కేశ : నిజం. నారాయణ సరిగ్గానే చెప్పేరు.

వారా : మా వూరికి వీరు వొచ్చారు, మరో పేకంటె నమ్మండి.

[సంజీవి డ్రింకు తాలూకు ఖాళీగ్లాసులు పట్టుకు వెళ్ళిపోయేడు.]

పేక : చాలా సంతోషం! ఆలస్యమైనా మంచితరుణం లోనే వచ్చేను ఈ వూరు! పేదలపార్టీ తరఫున కేశవరావుగారు పోటీచేయడం ఇక్కడ పేదల అదృష్టం!—

మంచిరోజు లొచ్చేస్తున్నాయ్...
నిద్రలే! నిద్రలే!
అదుగో సూర్యుడు ఎర్రగ వున్నాడు...
కళ్ళువిప్పు! కళ్ళువిప్పు!

వారా : (ఈ తడవ నారాయణ అందుకున్నాడు.)

రాత్రి వచ్చిన పీడకల ఇక రాదు, ఇక లేదు...
నిలబడు! నిలబడు!

విజయోయ్ నేస్తం నీ శ్రమకి ఫలితం దక్కింది...
నన్ను నమ్ము! నన్ను నమ్ము!

పేక : థేంక్స్. థేంక్యూ వెరీ మచ్! నన్ను అభిమానించే సహృదయు లింతమంది నిక్కడ చూచి తరించేను! నేనిక్కడికి రావడం కేశవ రావుగారి అదృష్టమన్నారు. నే నొప్పుకోను. ఆ అదృష్టంలో నాకూ భాగముంది. పంచండి.

చైన్లు : (ఏంచెప్పాలో తోచక చెప్పేడు) ఇద్దరు కవులు మాటాడుకుంటున్నప్పుడు, కవి గాక పోతే మూడోవాడికి వళ్ళు మండిపోతుం దంటారు. ఎవడో గిట్టనివాడు ఆ మాట అని వుండాలి. ఎంచేతంటె—ఇక్కడ మీ సమావేశం చూస్తుంటె—కవినికాని నాకు—వళ్ళు మండటంపోయి, వన్నీటిస్నానం చేస్తున్న ట్టుంది. ఆలకించేందుకు ఇబ్బంది లేకపోతే మన ప్రయోగవూ ఆలకించండి.

దిగులుపడకు బ్రదర్—
ఎందుకష్టతుంది కౌంట్?
నీ మనసు మంచిదైతే—
నీ సీక్వెన్స్‌కి ముక్క దొరికి—
నీ ఆట బతుకుతుంది!
డ్రాప్‌చేయకు! డ్రాప్‌చేయకు!
నమ్ము నన్ను! నన్ను నమ్ము!
ప్రస్తుతానికింతె! చిత్తగించగలరు.

పేక : బాగుంది! చూస్తుంటె మీరు—

చైన్లు : ఇప్పటివరకూ మీ పేరు—కేవలం మీ పేరు మీద మోజెక్కువగలవాడిని. కాని, తమరు పేకని—అనగా పేట్లపేకని తక్కువ చేయకండి. బాధపడి పోగలను.

కేశ : (మహాకవితో) రైల్లో, అంతదూరంనుంచి వచ్చేరు. కాసేపు రెస్టు తీసుకోండి. ఈలోగా, మేము టవున్‌హాలుకి వెళ్ళి—ఇక్కడ కది అర ఫర్లాంగుంటుంది—అక్కడి ఏర్పాట్లెంత వరకూ వచ్చేయో చూచివస్తాం. ఏమంటారు?

పేక : అల్లాగే...

కేశ : సంజీవీ!

సంజీ : (లోపల్నుంచి వచ్చేడు) సార్!

కేశ : నువ్వు యిక్కడే వుండి కవిగారి అవసరాలు చూస్తుండు. టౌన్ హాలుకివెళ్ళి యిప్పుడే వచ్చేస్తాం. వచ్చింతర్వాత లంచ్! ఒ. కె?

సంజీ : ఒ. కె. సర్!

కేశ : పదం డయితే! (పేకతో) రెస్టుతీసుకోండి. మళ్ళా కలుసుకుందాం. వస్తాం.

నారా : సెలవు. మళ్ళీ వస్తాం.

చైన్లు : ప్రస్తుతానికి—డ్రాప్.

(అందరూ వెళ్ళిపోయేరు. మహాకవి సిగరెట్టు తీసేడు. అగ్గిపెట్టికోసం జేబులు తడుముకుంటూం డగా సంజీవి అగ్గిపుల్ల వెలిగించేడు.)

పేక : (సిగరెట్టు ముట్టించుకుని అన్నాడు) సంజీవి! చాలా మంచి పేరు!

సంజీ : పేరువరకూ మంచి పేరే! కానీ, నా పేరుతో నేనింతవరకూ ఎవర్నీ బతికించలేకపోయేను.

పేక : నువ్వేం డాక్టరువా? ఒకర్ని బతికించడానికి?

సంజీ: పైగా, ఒకర్ని చంపేనుగూడా!

పేక : (అదిరిపడ్డాడు) వాట్? చంపేవా? ఎవర్ని?

సంజీ: అమ్మని. మా అమ్మని. దీర్ఘరోగంతో మంచానపడ్డ నా తల్లికి నామీద ఆశ ఎక్కువ. కనీసం నేనైనా సుఖంగా బతుకుతున్నానని మురిసిపోయేది. కానీ, నేను బతుకుతున్న విచిత్ర పరిస్థితుల్ని నా తల్లికి చెప్పక తప్పిందికాదు! పూర్తిగా విని నా తల్లి కుళ్లి కుళ్లి ఏడ్చింది. ఆ రాత్రే నా తల్లి శాశ్వతంగా కళ్లు మూసింది. నా పాడు కథ చెప్పి నా తల్లి ప్రాణం తీసిన ఖూనీ వెధవని సార్ నేను! నేను సంజీవినా? ప్రాణం పోయడం మాని ప్రాణం తీసుకున్న మహాపాపిని! నేనా సంజీవిని?

పేక : ఎంతకష్టం?

సంజీ: నా కష్టం, నా నష్టం నాకొదిలేయండి—

పేక : (అతని మాటకి అడ్డం పడ్డాడు) నేను కవిని సంజీవీ! మహాకవిని! నీ కష్టం, నీ నష్టం నాక్కావాలి. నేను నీ ఆప్తుడ్ని. నీలాటి చాలా మంది అభాగ్యులకు నేను బంధువుని. మీ బంటుని.

సంజీ : (ఆనందించేడు) అందుకే మిమ్మల్ని వెతుక్కుంటూ యిక్కడికి వచ్చేను. తల్లిని పోగొట్టుకున్న దుఃఖాన్ని సైతం వదిలేసి మీకు నా కథ మనవిచేయాలని యిక్కడికి వచ్చేను సార్! ప్రపంచాన్ని మరామ్మత్తు చేస్తున్న మహాకవి దర్శనం చేసుకుని, నా కంటితో చూచి—నా చెవితో విన్న దారుణాలను మీకు తప్పనిసరిగా విన్నవించుకోవాలనే వచ్చేను. ఆ లోపాల్ని మీలాటి మహాకవులే సరిచేసి పుణ్యం కట్టుకోవాలి.

పేక : నామీద నీకున్న అభిమానానికి చాలా సంతోషిస్తున్నాను. నువ్వు నాకందిస్తున్న బాధ్యతా భారాన్ని తప్పకుండా మోస్తాను. చెప్పు...

సంజీ: పేదలరాజ్యం రాబోతుందని మనమంతా సంతోషిస్తున్నామా? ఆ పేదలరాజ్యంలో సైతం గూండాలుంటారని నేను విన్నదీ చూసిందీ చెబుతాను.

పేక : ఈ కవితా వ్యాసంగంలో నా ఇరవైఏళ్ల అనుభవం పేదలకే అంకితం చేసేను. పేదలే నా ప్రాణమని ఎలుగెత్తి చాటేను. పేదల సమస్యలెన్నింటినో నేను తెలుసుకుని వాళ్లల్లో నేనూ ఒకడినై వాళ్ల బాధల్ని నేనూ పంచుకున్నాను. పేదల కథని నువ్వెక్కడ్నుంచి ప్రారంభించి ఎక్కడ ముగించినా నేను అర్థంచేసుకోగలను చెప్పు.

సంజీ : ముందీ ప్రశ్నకి సమాధానం చెప్పండి సార్! మిమ్మల్నెవరైనా ఇంతకుముందు మోసం చేసేరా? మీరు మోసపోయేముందు మిమ్మల్నెవరైనా హెచ్చరించేరా?

పేక : (నవ్వేడు) నేనంత తేలిగ్గా మోసపోయే మనిషినికాను. కవినేగాని వెర్రివెంగళాయిని కాను.

సంజీ : ఇప్పుడిక్కడ మీరు మోసపోతున్నారని, మిమ్మల్ని దారుణంగా మోసగించే మనుషులిక్కడున్నారని నేను చెబితే మీరు నమ్మగలరా?

పేక : (అసహ్యంగా అన్నాడు) ఉపోద్ఘాతం మాని చెప్పదలచుకున్నది సూటిగా చెప్పు.

సంజీ : ఇంతలో ఈ యింటికి ఎవ్వరూరారు. నెంపాదిగానే మనవి చేసుకుంటాను. ముందు నా ప్రశ్నకి సమాధానం చెప్పండి.

పేక : చాలా తెలివైనవాడివిలా కనుపిస్తున్నావ్. (చుట్టూచూచి అన్నాడు) నేనేదైనా సీరియస్‌గా ఆలోచించాలనుకున్నా, అంతా విఘ్నే

చెప్పాలనుకున్నా నాకు అమృతం కావాలి. నా సూటుకేసులో నాకొచ్చినవసిన అమృతం వుంది. పట్టుకొచ్చియిస్తావా నీ ప్రశ్నకి సూటిగా సమాధానం చెబుతాను.

సంజీ: అమృతమా?

పేక : అవున్నాయనా! అమృతమే! ఆశ్చర్యంతో కాలయాపన చేయకు. సూటుకేసు తెరు. కనుపిస్తుంది. చెప్పు.

(సంజీవి నెమ్మదిగావెళ్లి సూటుకేసు తెరిచేడు. లోపలున్న 'వస్తువు'ని చూచి ఒక్కడుగు వెనక్కి వేసేడు. పేక పకపకా నవ్వేడు.)

పేక : కనుపించిందిగదా! దాన్ని స్టడీగా తీసుకురా!

సంజీ: (విస్కీ సీసా తీసేడు. సీసాని పేకకి యిచ్చేడు)

పేక : (సీసా మూతతీసి నోట్లోవంచుకున్నాడు) ఈ ముక్క సరుకు పడిపోనేగాని నేను నిజం మాటాడలేను. దీని ఖరీదు నూటపాతిక. పుచ్చుకున్నమీదట నేనంతా నిజమే చెబుతాను. అబద్ధం చెప్పను.

సంజీ: (మనిషి కృంగిపోయేడు) అడిగిన దానికి నిజం చెప్పడానికి నూటపాతిక రూపాయిల ఖర్చా?

పేక : (ఇంకో చుక్క పుచ్చుకున్నాడు) లేకపోతే, నా నోటినుంచి నిజం ఛస్తే చెప్పించలేవు. తాగుడులో మనది పెద్దచెయ్యి సోడాలూ, గీడాలూ అవసరం లేదు. నీట్...కేవలం నీట్ కొట్టేస్తాం! నీట్ కొట్టేసి నీట్‌గా రాసేస్తాం—పేదల బాధలూ, వాళ్ల గాథలూ చెప్పు. నీ ప్రశ్నేమిటి?

సంజీ: (సగం చచ్చిపోతూ అడిగేడు) మిమ్మల్నెవరైనా మోసం చేసేరా?

పేక : (లాపీగా అన్నాడు) చేయలేదు. చేసేటందుకు వాళ్లకా దమ్ములుండొద్దూ? సాధారణంగా మాలాటి మహాకవులని మోసం చేయడం వీళ్లెరికీ చాతకాదు చిరంజీవి! చాతకాదు. (మళ్లా పుచ్చుకున్నాడు మందు) చేస్తేగీస్తే మేమే చేస్తాం మోసం! ప్రజల్ని మోసం చేస్తాం. మాది కవితా వారసత్వం. మా నాన్న జా. క! అంటె, జాతికవి. వారు ఈ దేశానికి స్వాతంత్ర్యం రాకముందు వుండేవారు ఇప్పుడు లేరు. వుండేవుంటే దేశాన్నే కొనేసేవారు. వెర్రిమొహం పెట్టి వినకు. సరిగ్గా విను. స్వాతంత్ర్యం కావాలంటూ వీధులవెంట వీరయోధుల్ని లాఠీకాయల్తో కొట్టిపారేస్తున్న రోజుల్లో - ఆ రోజుల్లో మా పితృదేవులు పూలూ, స్వస్తీ, దేవుడూ వగైరా పదార్థాల గురించి రాసేరు. వీరయోధుల్ని, వాళ్ల వీరగాథల్ని గాలి కొదిలేసేరు. అయితేనేం—వారే జాతికవి! ప్రజలు ఆ బిరుదునిచ్చి మా నాన్నని సత్కరించేరు. అంత ఫూల్స్ ఈ ప్రజలు! వీళ్లెందుకు చేస్తారయ్యా నన్ను మోసం? వీళ్లకాపాటి దమ్ములు గూడానా?

సంజీ. జాతికవి పుత్రులా మీరు?

పేక : అవును. అక్షరాలా నిజం!

సంజీ : మీరు పేదలగురించి రాసి 'పేదలకవి'అనే బిరుదుని పొందేరు.

పేక : వండర్‌ఫుల్! అమృతం పుచ్చుకోకుండానే నిజం మాటాడుతున్నావ్. హేట్సాఫ్!

సంజీ : మీ జన్మలో మీ రెప్పుడైనా పేదరికం రుచి చూసేరా?

పేక : రుచి చూసేటందుకు ఏదేమైనా కొడవలావుటయ్యా! అయినా నాకదేం ఖర్మ. నాన్నిచ్చిన మేడా, నేను కొనుక్కున్న కారూ చూస్తే నువ్వామూ టనిస్సందవు మన స్కాట సేవిటో లేలీడ లే? కేవలం ఈ ద్రవపదార్థానికే ఖర్చు చేస్తున్నాను, నూటపాతిక! గట్టిగా ఊదేస్తే ఒకరోజు ఖర్చు!

సంజీ : ఇంతడబ్బు మీ కెక్కడిది?

పేక : కవిత్వం రాసి సంపాయిస్తున్నాను.

సంజీ : ఎవరిగురించి రాస్తున్నారు కవిత్వం?

పేక : పేదలగురించి! పేదమహాశయుల బాధల గురించి—కన్నీటితో రాస్తున్నాను నాయనా!

సంజీ : హు. కన్నీరు? మీకు కన్నీరుగూడా వుందా?

పేక : అదేం ప్రశ్న? కళ్లుంటే కన్నీరుండదూ?

సంజీ : కష్టాలకీ కన్నీటికీ కాంబినేషనంటారు, నిజమా?

పేక : నిజం. నిజమే!

సంజీ : మీరు కష్టాలెప్పుడైనా అనుభవించేరా?

పేక : అనుభవించేను.

సంజీ : ఎప్పుడు

పేక : ఎప్పుడని అడిగితే ఏమని చెప్పను? చాలా తడవలు అనుభవించేను కష్టాలు! సమయానికి కారుండి, కారుడ్రైవరు లేనప్పుడు. లిఫ్ట్ లేని మేడ ఎక్కినప్పుడూ. ఎయిర్ కండీషన్డ్ గదిలో విద్యుత్ప్రసారం ఆగిపోయి నప్పుడూ. మందుండి చికెన్ లేనప్పుడూ. చికెన్ బిరియానీవుండి మందు లేనప్పుడూ. ఇవన్నీకూడా నాకు కష్టాలే!

సంజీ : ఎన్నెన్ని కష్టాలూ? ఈ తరహా కష్టాల లిస్టు గురించి మీరేమైనా రాసేరా?

పేక : రాయలేదు. రాయను. నా సొంతకష్టాలకి మార్కెట్ వుండదని నాకు బాగా తెలుసు.

సంజీ : మీరాసిన కవిత్వం చదివి మా నారాయణ లాంటి అమాయకులు వాళ్లకున్న ఆస్తి నంతటినీ పేదలకి పంచేస్తేను. దానికి మీరేమంటారు?

పేక : ఏమంటానేమిటి? పిచ్చిప్రశ్న. అలాంటి ఉదంతాలు విని గర్విస్తాను. అంత పవర్ ఫుల్ గా రాసినందుకు నన్ను నేను అభినందించుకుంటాము.

సంజీ : ఎవరెన్ని త్యాగాలు చేస్తున్నా మీరుమాత్రం మీ మేడలూ, కారులూ, మీ వైభవాలూ, మీ ధనాగారాల్లోనే క్షేమంగా వుండాలనుకుంటారు. అవునా?

పేక : అవును. నా కవచాలు క్షేమంగా లేకపోతే నేను క్షేమంగా వుండను. నేను క్షేమంగా లేకపోతె నా కవిత్వం క్షేమంగా వుండదు. నా కవిత్వం క్షేమంగా వుండకపోతే నారాయణలు దేశానికి ఉపయోగపడరు. ఆ రకంగా, దేశానికి ఎంతనష్టమో ఆలోచించు! కనక, మేము మా సిరిసంపదలలో క్షేమంగానే వుండాలి. ఏమంటావ్?

సంజీ : మేడిపళ్లగురించి తెలుసా మీకు?

పేక : తెలుసు. మేడిపండుచూడ మేలిమైవుండు— స్టేట్. ఇప్పుడా పండెందుకు?

సంజీ : రాసే కవీ! నీకో చిన్నసందేశం! దేశంగురించి చస్తున్న మనిషిగురించి రాయకు. పూవు గురించి రాయి. జాలికవి ఓరుస్తుంది. పేదతనమేమిటో అనుభవించికాకుండా, ఊహించి రాయి. పేదలకవివై పోతావు.

పేక : సోదరులారా! అన్నను. మన చిరంజీవి సంజీవి మనకి నిజమే చెప్పేడు. మేము—అసలా కవులం. మహాకవులం. రసపిపాసులం. కార్లున్న కవులం. మేడల్లోవుండే కవులం. ఆనంద సాగరంలో జలకాలాడే ఖరీదైన కవులం. అనేకం అనేకానేకం రాస్తుంటాం. రాసింది చదవండి బ్రదర్స్. చదివింది చెయ్యండి. అంతేగాని నాయనలారా! మేము ఏంచేస్తున్నదీ మీ కనవసరం!

సంజీ : (కోపం వచ్చింది) నాకే గనక అధికారం వుంటే ఆ మాట అనేవాడి డొక్క చీరేస్తాను. ఆచరణ లేని ఆశయం ఎందుకు? తగులెయ్యను. నువ్వు ఆచరించు, ఆ తర్వాత చెప్పు.

పేక : మర్యాదా! మర్యాదా మరిచిపోతున్నావ్?

సంజీ : ఇప్పుడింక మర్యాదా మాట గుర్తుచేయకండి.

[గబగబా ఫోన్‌దగ్గిరికి వెళ్లేతు సంజీవి. డయల్ చేసేడు.]

పేక : ఫోనెవరికి చిట్టిబాబూ? పోలీసులకా? తాగుతున్నానని ఫోన్ చేస్తావా? ప్రొహిబిషన్ ఎత్తేసేరోయ్ కుర్రాడూ! సురాపానం ఎంత మాత్రం నిషేధం కాదిప్పుడు. ఫోన్ పెట్టేయ్! సురాపానం నిషేధమున్న రోజుల్లో గూడా—మేము పూర్తిగా పట్టేసి సభలకు వెళ్లి నిద్దరోతున్నప్పుడు, యస్పైలూ, సీఐలూ, సూపర్నెంటాఫ్‌పోలీసులు వచ్చి మమ్మల్ని చూచి చేతులెత్తి నమస్కరించి వెళ్లేరేగాని మా చేతులకి బేడీలువేయ సాహసించలేదు. ఫోన్ పెట్టేయ్!

సంజీ : (అప్పటికి ఫోన్‌లో అవతలమనిషి దొరికేడు) టౌన్‌హాలా? ఎవరు మాటాడేది? చెన్నన్నగారేనా? నేను సంజీవినండి! మరె! ఉన్నపళంగా కేశవరావుగార్నీ, నారాయణగార్నీ వెంటబెట్టుకురండి!...కారణమా......ఇక్కడ వ్యవహారం కొంపల్లోయింది...అది అంతే...... వెంటనే రండి...(ఫోన్ పెట్టేసేడు)

పేక : ఇప్పుడు వాళ్లంతా ఎందుకు? ఏదో మనవి చేస్తానన్నావు. మనవి చేయరాదూ?

సంజీ : మనని చేయనవసరంలేదింక. నా డ్యూటీ ముగిసేవేళయింది. వెళ్లాలి.

పేక : వెళ్లవలసివస్తే వెళ్లిపో!

సంజీ : వాళ్లు రావాలి!

పేక : వస్తే?

సంజీ : చూస్తారుగా!

పేక : ఏమిటి?

సంజీ : మన కథకి ముగింపు.

పేక : పుచ్చుకున్నవాడిని నేను స్టడీగా మాటాడుతూంటే, ఏమీ పుచ్చుకోకుండానే నువ్వు వంకరగా మాటాడుతావేం?

సంజీ : అదే గమ్మత్తు! ఆశయాల్లో బతికే మనిషి కుదేలైపోతూ, వేషంతో తిరిగే రాస్కెల్స్ వెలిగిపోడంగూడా గమ్మత్తే! దీని అంతేవిటో తేల్చిపారేస్తా విడాళ!

పేక : ఆశయాల్లో బతికే మనిషా? ఎవరు స్వామీ వారు?

సంజీ : నారాయణ!

పేక : అమాయకు డతను. సరె, వప్పుకున్నాం. రాస్కెల్సెవరు?

సంజీ : ఒకడు కేశవరావు. కేశవరావు డిగ్రేట్!

పేక : రాస్కెలా?

సంజీ : నెంబర్ వన్ రాస్కెల్! రెండో రాస్కెలెవరో తెలుసా?

పేక : ఎవరు? నేనా? దానికి నేనొప్పుకోను.

సంజీ : (తుపాకీ తీసుకున్నాడు) వప్పిస్తాను.

పేక : (అదిరిపడ్డాడు) కాలుస్తావా?

సంజీ : నేనందుకే వచ్చే నిక్కడికి.

పేక : నన్ను...నన్ను కాలుస్తావా?

సంజీ : ఏమో! చెప్పలేను.

పేక : సంజీవీ! నాయనా సంజీవీ! నేను మహాకవిని. నన్నొదులు. నేను వెళ్లిపోతాను.

సంజీ : లేవకు. కూచో. లేచి ప్రాణాలు పోగొట్టుకోవద్దు.

పేక : (కూచుంటూ అన్నాడు) కూచుంటే చంపవా?

సంజీ : నేను చెప్పిందిచేస్తే బతుకుతావ్.

పేక : తప్పకుండా చేస్తాను. చెప్పు.

సంజీ : పేపరుకి ఒక స్టేట్‌మెంటివ్వాలి!

పేక : దానికేం భాగ్యం? ఒకటికాకపోతే—లక్ష! లక్ష స్టేట్‌మెంట్లిస్తాను. ఇప్పుడే ఇచ్చేదా?

సంజీ : ఏమనిస్తావ్?

పేక : నువ్వింకా చెప్పలేదుగా!

సంజీ : 'పేదలకవి'అనే బిరుదుకి నువ్వు తగవు.

పేక : అవున్నిజమే! వద్దని రాస్తాను.

సంజీ : నువ్వు పేదవాడివికావు.

పేక : దైవసాక్షిగా కాను. మేడా కార్లూ నాకూ వున్నాయి.

సంజీ : పేదల కష్టాలంటె ఏమిటో విన్నావేగాని నీ కవి తెలివు.

పేక : నిజం బాబూ! కరెక్ట్‌గా కరెక్ట్!

సంజీ : గంజికూడాలేని పేదల ఆకలి బాధేమిటో నీకు బొత్తిగా తెలీదు.

పేక : అసలు గంజంటె ఏమిటోగూడా నాకు తెలీదే! నాకు తెలిసిందల్లా ఒక్కటే – ఈ మందు.

సంజీ : పేదల్ని ఉద్ధరించాలనే కోరికకన్నా, ఏదో ఒకటి రాయాలనిమాత్రమే రాస్తున్న కవివి!

పేక : మరి నా పాయింటూ అదేగా!

సంజీ : నీ కవిత్వానికీ, నీ వ్యక్తిత్వానికీ చాలా దూరం!

పేక : అబ్బ! ఎంతచక్కగా చెప్పేవు. మాటికి నూరు పాళ్లు నిజం!

సంజీ : ఇంత స్పష్టంగారాసి పత్రికలకి పంపు.

పేక : ఇప్పుడే రాసేమంటావా? ఒబ్బే మరేంలేదు— ఏం రాసినా మందులో వున్నప్పుడే రాస్తాను. మనలో మందు లేకపోతే, కలంలో సిరావున్నా ప్రయోజనంలేదు. అది నా సెంటిమెంట్! రాసేనా?

సంజీ : (నవ్వేసేడు] పిచ్చికవీ! నువ్వెంత పిరికివాడివయ్యా?

పేక : అర్థంచేసుకున్నావుగా! అయితే నన్ను చంపవుగదా!

సంజీ : ముందు చావవలసినవాడు మరొకడున్నాడు.

పేక : ఎవరు? కేశవరావా?

సంజీ : వాడిగురించి నీకేం తెలుసో చెప్పు. వింటాను!

పేక : తెలిసేందుకేముంది? వెర్రిబాగులాడు! కవిత్వం రాసి గొప్పనుకుంటున్నాడు?

సంజీ: కవిత్వం వాడు రాసేడా?

పేక : ఏం? లేకపోతే నువ్వు రాసేవా?

సంజీ: నేను కాకపోతే నాలాటి దౌర్భాగ్యుడు మరొకడు. డబ్బు కక్కుర్తి వాడి దగ్గర డబ్బు లేదు. వీడి దగ్గిర బోల్డుంది. వాడు కవిత్వం రాయగలడు. వీడు రాయలేడు. ఒకడికున్నది మరొకడు మార్చుకున్నారు.

పేక : చెప్పేవు కాదేం? అమ్మ దుర్మార్గం! కాల్చి పారేయ్!

సంజీ: ఎవర్ని?

పేక: కేశవరావుని.

సంజీ: కవిత్వం అమ్మిన వాడినేం చేద్దాం?

పేక : అవును. వాడినీ కాల్చేయ్.

సంజీ: రాజ్యం చేయవలసిన నారాయణ 'సైతాన్ చెప్పిన వేదాలకి' బానిసై వెర్రి ఆవేశంతో ఊగిపోతూ, కనుపించే ప్రతి బురఖా రాస్కెల్‌కీ జైకొట్టి—తన శక్తిని వృథా చేసుకుంటున్నాడే, అతన్నేం చేద్దాం?

పేక : కాల్చేయ్. అతన్నీ కాల్చేయ్. లేదూ, ఓరి వెర్రి బాగుల నన్నాసీ, నీకు చెప్పేవాడు నిన్ను మించినవాడని మురిసిపోయి, వాడికి జైకొట్టే పాడలవాటు మానుకోరా! దేశాన్ని వెధవల చేతుల్లో పెట్టకురా! అని బుద్ధి చెబుదాం. అవసరమైతే ఆ తరహా కవిత్వం నేను రాస్తాను. సరేనా?

(చైన్లు, నారాయణా, కేశవరావులు వచ్చేరు)

చైన్లు: ఏమిటిది సంజీవీ! కొంపలైపోయిందని తుపాకీతో నించున్నావ్.

పేక: కాల్చి చూద్దామని ముచ్చట పడుతున్నాడు.

కేశ: ఏం జరిగింది సంజీవీ!

నారా: ఎందుకంత అర్జంటుగా పిలిచేవు?

సంజీ: మీది మీదికి రాకండి. ఎక్కడి వాళు అక్కడే నిలబడండి. కదిలేరా మీ ప్రాణాలు దక్కవు.

పేక: అదీ సంగతి! విన్నారుగా!

చైర్మన్: డీల్ షో పోజా మన్నాను! ఏమిటా జబర్దస్తీ?

నారా: సంజీవీ! ఏమిటీ పిచ్చి?

సంజీ: చెప్పుకవి! మాలో ఎవరు పిచ్చివాళ్లో చెప్పు. నారాయణకి నువ్వెంత ద్రోహం చేసేవో ముఖ్యంగా చెప్పు.

పేక : మీలో నారాయణే పిచ్చివాడు. పరమ పిచ్చి వాడు. బాబూ, నారాయణా నా కవిత్వం చదివి నీ ఆస్తిని అందరికీ పంచి యిచ్చేస్తావట. మన్నించు. ఇంత దారుణం జరుగుతుందని నేనూహించలేదు. మనకంటికి కనుపించే దాని గురించి రాయడం కవుల డ్యూటీ. నా ఖర్మం కాలి నాకు పేదరికం కనుపించింది. రాసేను. ప్రజలు అది చదివి నాకు 'పేదకవి' అని బిరుదిచ్చేరు. ఆ బిరుదు నిలబెట్టుకునేందుకు యింకా పేదరికం గురించే రాస్తున్నాను. ఆ తరహా కవిత్వంతో డబ్బు చేసుకుంటు న్నాను. అంతేగాని నేను పేదనుకాను. పేద తనంలో నాకు ఏ మాత్రమూ అనుభవం లేదు. నేను రాసింది చదివి నువ్వు పాడై నందుకు మన సంజీవిబాబు మండిపడు తున్నాడు.

నారా : కావచ్చు. మీ రెవరైనా కావచ్చు. ముఖ్యంగా మీరు మహాకవులు! మీరు చెబుతారు. మీరు చెప్పింది మేము చేస్తాం.

సంజీ: పాడుబుద్ధి! ఈ జన్మకి నువ్వు మారవు నారాయణా! మహాకవుల్ని మహాకవులనే పిలు స్తున్నావా నువ్వు? అలా పిలుస్తే బాధే లేదు. పేదలకవని, జాతికవని బిరుదులిస్తు న్నావ్. ఆ బిరుదులిచ్చి మహాకవుల్ని పాడు చేస్తున్నావ్. అది తప్పంటున్నాను. దిద్దుకో మంటున్నాను.

కేశ : (కోపం వచ్చేసింది) ఏమిటీ సిద్ధాంతం? పెద్దా చిన్నా లేకుండా నీ పాతాలేవిటిక్కడ?

సంజీ: అసలు కథ నీతోనే ప్రారంభమవుతుంది కేశవరావ్!

కేశ : యూ...(ముందుకి రాబోయేడు)

సంజీ : ఆగక్కడ! అడుగుముందుకు వేసేవా నీ ప్రాణాలు దక్కవు.

నారా: సంజీవీ!

పేక : విప్లవం. ప్రక్షాళన. నన్ను కడిగేసేడు. నాకు కనువిప్పు కలిగించేడు. థేంక్యూ సంజీవీ! నేనూ నీ పక్షం వున్నాను. రెండు, ఈ మినిస్టర్ కేశవరావు, ఎవడో రాసిన కావ్యాన్నికొని, ఆ కావ్య రచయితగా చలామణి అవుతూ మా కవిత కులానికే తలవంపు అచ్చేడు. కడిగేయ్. ప్రొసీడ్.

కేశ : స్టాప్ ది నాన్‌సెన్స్!

సంజీ : అరవకు. నీకా హక్కులేదు.

నారా: ఆత్మావలోకనం—

చైర్మన్: మీరు రాయలేదా సార్? అయితే ఎవరా అజ్ఞాత కవి?

సంజీ: పిచ్చికుంకలు! దొంగ కవిత్వానికే తెల్ల మొహం వేసే మీకు, ఈ కేశవరావు లోపల బతుకుతూన్న 'కుట్ర' చెబుతే తన్నుకు చచ్చేలా వున్నారు.

పేక : నాక్కూడా చెప్పవుకాదు?

సంజీ: చెబుతున్నాను. అంతా వినండి. అడుగు ముందుకు వేసినా నా మాటకి అడ్డంపడినా ఫలితాన్ని అనుభవిస్తావ్ కేశవరావ్! జాగ్రత్త! వీడు, ఈ కేశవరావు అవబడే ఛేర్మన్ బావ మరిది, ఒక సంఘద్రోహి! ఛేర్మన్‌కి వీడికీ లావా దేవీలు చాలా వున్నాయి. చాటుగా అవి సాగు తూనే వున్నాయి. ధనికప్రభుత్వంమీద మనందరం నీళ్లు పోస్తున్నామని తెలిసి ఆ ఛేర్మన్—ఈ ఏజెంట్‌ని మన మధ్యకి పంపేడు— పేదవాడివేషంలో! అనాడు ఛేర్మన్ ఈ కేశవ

రావుని చంపడానికి వచ్చిన్నాడు—నే నిక్కడే వున్నాను.

కేశ : అబద్ధం. నువ్వు లేవు. చైన్నులతో పారి పోయేవు.

సంజీ : కానీ, నేను చైన్నులతో బజారున పడలేదు. నీ కంటవాత్సల్యానికి కుక్కనై, విశ్వాసంతో విన్ను రక్షించే నిమిత్తం—అదిగో ఆ గదిలో దాక్కున్నాను. నిన్ను చంపడానికివచ్చిన షేర్మన్ నీతో చేయికలిపి నీ వేషానికి హెచ్చరికలు చేసి నప్పుడు నా మతిపోయింది! నా కాలికింద నేల సైతం గడగడా వణికిపోయింది. పిచ్చి కపీ! విన్నిక్కడికి పిలిపించిన ఏర్పాటు షేర్మన్‌ది. నిన్ను గుడ్డిగా విశ్వసించే నీ బంటు ఈ పిచ్చినారాయణని నీ రాకవల్ల మురిపించి, తద్వారా అతని చేతుల్తో అతని కళ్లనే పొడిపించి, ఈ కేశవరావుని సింహాసనం ఎక్కించాలని షేర్మన్ పథకం! ఇంతకుట్రని కళ్లారా చూచి నేను వణికిపోయేను. ఏంచేయాలో తోచనిస్థితిలో ఇంటికి వెళ్లేను. నా భవిష్యత్తుని అందంగా ఊహించుకుంటున్న రోగిష్టితల్లికి నన్నిక్కడ ఈ దోపిడిదొంగ వాడుకుంటున్న వైనంచెప్పి, ఆ తల్లిగుండె పగులగొట్టేను. అమ్మా! నేను వెళ్లిన ఇంటో పేనొక చిలకనే! సంఘద్రోహుల ఆశ్రయంలో పెరుగుతూన్న నిర్భాగ్యుడ్నేఅని చెప్పేను. ఆ పాలిపోయిన మొహంలో, ఆ కళ్లల్లో గొప్ప బాధనే చూసేను. అంతే, మర్నాటికి అమ్మ లేదు. మా అమ్మ చచ్చిపోయింది నారాయణా! అమ్మ చచ్చిపోయింది.

నారా : సంజీవీ!

చైన్ను : ఎంత దారుణం జరిగిపోయింది!

పేక : అమ్మ పోయిందన్నావేగాని, ఆ వెనుక యింత కథ వున్నట్టు నాకు చెప్పలేదు.

సంజీ : చెప్పు కపీ! ఇప్పుడు చెప్పు! ముందుగా నే నెవర్ని కాల్చాలి?

[నారాయణా, చైన్నూ, కపీ సంజీవి ప్రయత్నానికి అడ్డుపడే ధోరణిలో ముందుకు వచ్చేరు.]

నారా : ఆగు సంజీవీ! కాల్చకు. ఎవర్నీ కాల్చకు. కాల్చిన నేరానికి నువ్వు మాకు దూరమవ్వడానికి వీల్లేదు.

చైన్ను : చెప్పవలసిన రహస్యం చెప్పేవు. చేయవలసిందేమిటో మనవాళ్లంతా ఆలోచించి చేస్తారు. తొందరపడకు.

పేక : నాయనా! నా సరికొత్త కవిత్వానికి నువ్వు కథానాయకుడివి! నాతో వచ్చెయ్.

సంజీ : నాకెవ్వరూ అడ్డురాకండి. అడ్డువచ్చి మీ ప్రాణాల్ని పోగొట్టుకోకండి. ఎవరెన్ని చెప్పినా ఈ కేశవుడ్ని వదిలిపెట్టను. ఈ కేశవుడ్ని చంపి నేనూ ఛస్తాను. వీడు లోకకంటకుడు. మనం కలలు కనే రాజ్యానికి ద్రోహంచేసిన మహాపాపి! వీడ్ని చంపాలి! (గురిచూసేడు—కాల్చడానికి)

కేశ : (గజగజ వణికిపోయేడు) చంపకు. నన్ను చంపకు. నిజంగా నేను మహాపాపినే! కాని, సంజీవీ.. బావగారి చేతిలో నేనొక బొమ్మని. నన్ను చంపి ప్రయోజనంలేదు.

సంజీ : ప్రాణభీతి! చచ్చిపోతావనే బెంగ. విలువైన బ్రతుకు క్షణంలో మట్టిపాలవుతుందనే ఆక్రందన! బతికి పదిమంది నోళ్లు కొట్టేందుకు వెనుకాడని ద్రోహికి చావంటె భయం!

కేశ : సంజీవీ! నాకు పిల్లలున్నారు నాయనా! వాళ్ల కోసరమైనా నన్ను బతకనివ్వు. ఈ పాపిష్టి రాజకీయాలకు దూరంగా బతుకుతానని ప్రమాణంచేసి చెబుతున్నాను. నన్ను వదులు. పుణ్యంకట్టుకో! (రివ్వునవచ్చి సంజీవి పాదాల్ని తాకేడు) నన్ను చంపకు సంజీవీ! చంపకు.

సంజీ : (నవ్వేసేడు—బలహీనంగా) ఛీ! లేచి నిలబడు. ఈ పిరికితనాన్ని వదిలి మీ బావమీద తిరుగుబాటుచేయి. (తుపాకీని కిందపారేసేడు). మీ

రాజకీయాలు తగులబడిపోనూ! నాచేత కాల్పించే స్థితికి తీసుకొచ్చేరుగదరా! పో... బతికిపో..... కాల్చడమంటూ నా అభిమతమైతే నేనెందర్ని కాల్చి నా కలల రాజ్యాన్ని స్థాపించుకోను! కాల్చడ మొక్కటే మార్గమైతే ప్రాణత్యాగం చేయడమే మేలు! నారాయణా, నన్ను నమ్మండి! నేను మనుష్యుల్ని కాల్చే మనిషిని కానయ్యా! ఇంత రాక్షసుడూ, హింసకుడూ ప్రాణభీతివల్ల ఎంత అల్పుడవుతాడో మీకు చెప్పాలనే ఉద్దేశంతో వీడిని భయపెట్టేను. అంతేగాని, మనుష్యుల్ని కాల్చి రాజ్యం స్థాపించడం నా లక్ష్యం కానే కాదు. ఆ స్థితి అంచులవరకూ మనల్ని ఈ దొంగలే తీసుకొస్తున్నారు. వీళ్లకి తగిన శాస్తి ఈ కాల్చడంద్వారా జరగదేమో ... (అందర్నీ చూస్తూ అన్నారట.) సెలవు. వస్తాను. వెళ్లొస్తాను. ఎక్కడో దూరంగా, కనుపించీ కనుపించకుండా మనతో దోబూచులాడుతున్న కలలరాజ్యాన్ని వెతకడానికి వెళ్లి- ఆ రాజ్యంతో మళ్లీ తిరిగి వస్తాను. సెలవు.

(సంజీవి వెళ్లిపోయేడు. మిగతా వాళ్లు బొమ్మల్లా నిలబడి వున్నారు. ప్రయోక్త ముగింపు చెప్పేడు.)

ప్రయోక్త: సంజీవి వెళ్లేడు. మళ్లా అతనెప్పుడు వస్తాడోగూడా తెలీదు. అసలు తిరిగి రాకపోయినా ఆశ్చర్యపడక్కర్లేదు. అతను కలలు కనే రాజ్యం అతనికి దగ్గర్లో మాత్రం లేదు. దూరంగా వుంది. ఎంతో దూరంగా వుంది. అది—

ఎంతెంతదూరం?

ఎంతెంతదూరం?

మిమ్మల్ని మీరు ప్రశ్నించుకోండి. ఆ దూరం దగ్గిరవ్వాలంటె ఎందరు మహాకవులు, ఎందరు నారాయణలు, మరెంతమంది కేశవరావులు మార్పు చెందాలోగూడా ఆలోచించండి. ఇదే మా ప్రశ్న— సురక్షితమైన ప్రభుత్వం ఎంత దూరంలో వుంది?

ఎంతెంతదూరం?

(తెర పడిపోయింది)

---



# శ్రీ తిరుపతి వేంకటేశ్వర కవుల విజయ యాత్రలు

## శ్రీ నోరి నరసింహశాస్త్రి

'జయంతి తే సుకృతినో
రససిద్ధాః కవీశ్వరాః'

### 1

### శ్రీ చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రి

జననము : ప్రమోదూత శ్రావణ శు. 12 సోమవారము రాత్రి;యూనాము; 1870; స్వగ్రామము: కడియము; తండ్రి: కామయ్య; తల్లి: చంద్రమ్మ; నిర్యాణము : విరోధి మహాశివరాత్రి, బుధవారము 5—2—50. బెజవాడలో.

ఆరామద్రావిడులు : కృష్ణయజుశ్శాఖ.

తల్లిదండ్రులు పెట్టిన పేరు: వేంకటాచలం.

### శ్రీ దివాకర్ల తిరుపతిశాస్త్రి

జననము : ప్రజోత్పత్తి ఫాల్గుణ మాసము. (20—3—1872)

తండ్రి : వెంకటావధాని ఘనపాఠి, తల్లి: శేషమ్మ.

నిర్యాణము : రౌద్రి కార్తిక బ. 12 మంగళవారము (7—12—1920). వెలనాటివారు. కృష్ణ యజుశ్శాఖ.

గోత్రము : హరిత.

స్వగ్రామము : ఎండగండి.

ఇద్దరకి ప్రధాన గురువు: చర్ల బ్రహ్మయ్య శాస్త్రి. స్వగ్రామము: కడెద్దు: తర్వాత ధవళేశ్వరము.

### 2

కవులు పండితులు దేశాటనము చేయుట లోకమంతటా—హోమరునాటినుండి అనూచానముగా వస్తున్న ఆచారమే. ఏకచ్ఛత్రాధిపత్యము నెలకొనని కాలములలో, దేశములలో ఇది విస్తారముగా సాగుతుంది. బ్రిటిషు వారి పరిపాలనలో భరత ఖండము ఏకచ్ఛత్రముక్రింద ఉన్నా, పాలకులకు సంస్కృతాంధ్రములందు అభిమానము లేదు. కాని ఆ కాలంలో సంస్కృతాంధ్రాలను అభిమానించే స్వదేశ సంస్థానాలు కొన్ని వందలుండేవి. సంపన్న గృహస్థులు పట్టణాలు ప్రజలూ కూడా కొంత ఆదరించేవారు. కవులు పండితులూ ఆ సంస్థానాలను, సంపన్నులను, పట్టణవాసులను రాజాస్థానాలుగా భావించి సంచారముచేసి సమ్మానాలు పొందేవారు.

తిరుపతి వెంకటేశ్వరులకు సమకాలికులు, వారికి పూర్వులు, తరువాతివారు ఐన కవులు పండితులు సంచారము చేసినవారున్నారుగాని వారి యంతగా విస్తారయాత్రలు చేసినవారుగాని అన్ని వివాదములలో పాల్గొని నెగ్గినవారుగాని, అంత సర్వతోముఖ సమ్మానములు పొందినవారుగాని, మరి యొకరు లేరనుట అతిశయోక్తి కాదు.

పూర్వాంధ్ర కవులలో శ్రీనాథ కవిసార్వభౌముడు మాత్రము ఆంధ్రదేశమంతటా సంచారము చేసినట్లు కొంత ఆధారాలు ఉన్నవి. ఆయన మొదట కొండవీటిలో 16 సం.లు విద్యాధికారి పదవిలో

ఉండి పండితుల కిచ్చిన శాసనాలలో కానవస్తున్నాడు. కొంతకాలము రాజమహేంద్రవరరాజులవద్ద ఆస్థానకవి. ఒకమారు విద్యానగరయాత్రచేసి గౌడడిండిమ భట్టును ఉద్భటశాస్త్ర (అలంకారశాస్త్ర) వివాదములో జయించి, ఇతర కవీశ్వరులను కించపరచు చున్న కంచుఢక్కను పగులగొట్టించి కవిసార్వభౌముడుగా దీనారటంకాలతో అభిషేకము పొందినాడు. రాజకొండ వెళ్లి సర్వజ్ఞ సింగభూపాలునిచే సమ్మానము పొందినాడు. అతడు కంచి, పలనాడు, మొరసనాడు, రేనాడు, ఇత్యాది భాగములు దర్శించినాడు. ఒక్కవిద్యానగరయాత్ర తప్ప తక్కిన యాత్రలు,విజయయాత్ర లనలేము; విద్యాప్రదర్శనయాత్ర అనుటయు సమంజసముగా తోచదు. ఆయన దీర్ఘజీవితకాలములో ఆంధ్రదేశములో ఏర్పడిన అస్థిరరాజ్య పరిస్థితులూ, ఆయన హృదయములోగల అశాంత ధర్మమూ ఆయన యాత్రలకు ప్రధాన కారణములై ఉండును.

ప్రసిద్ధాంధ్రులలో జగన్నాథ పండితరాయలు గోదావరీతీరమునుండి ఢిల్లీవరకు యాత్ర సాగించి 'దిల్లీవల్లభపాణిపల్లవతలే నీతం నవీనం వయః' అని చెప్పుకొన్నట్లు అక్కడ స్థిరపడినవాడు. ఆయనయును వ్యాకరణములో, అలంకారశాస్త్రములో, శిష్టాచార వ్యవహారములలో ఆనాటి పండితులతో వివాదములు పెట్టుకొని 'అప్పయ్య దీక్షిత దవానల దగ్ధపూర్వం సాహిత్య మంకురయతే సరసైః ప్రబంధైః' అని ఆసేతుహిమాచలము విద్వత్పూజ్యులైన అప్పయ్య దీక్షితులవారిని అధిక్షేపించిన సాహసికుడు.

ఈ యిద్దరిని శ్రీ తిరుపతి వెంకటేశ్వరులు తమ యాదర్శమూర్తులుగా పెట్టుకొని దేశసంచారము చేసినట్లు తోస్తుంది. వారిద్దరుకాక, వారికి కొంచెము పూర్వులయ్యు సమకాలికులైన శ్రీమాన్ మాడభూషి వెంకటాచార్యులుగారి శతావధానములును, వారిని నిస్సందేహముగా ప్రభావితులను చేసినవి.

ఈ ముగ్గురును విద్వత్ప్రకాండులు, కవీశ్వరులు. శ్రీనాథునకు, పండితరాయలకునేకాక, మాడభూషివారికినిఉన్న పాండిత్యస్థాయి తిరుపతి వెంకటేశ్వరులకు లేకుండుగాక! శ్రీనాథునకున్న కవిత్వస్థాయికూడా ఈ జంటకవులకు లేకుండుగాక!

—ఐననేమి? శ్రీనాథునికంటెను, జగన్నాథునకంటెను, వేంకటాచార్యులకంటెను విస్తారముగా విజయయాత్రలుచేసి ఆంధ్రదేశమునంతటినీ తమ కవితావేశముతో ఉర్రూత లూగించినవారు. వారికున్న శిష్యప్రశిష్యసంతతి లెక్కవేసినవారులేరుగాని వేల సంఖ్యలో ఉంటుంది. అట్టిది మరియొకరికి 'నభూతో న భవిష్యతి.'

వారు యాత్రలుచేయని సంస్థానములేదు, పట్టణములేదు. వారి యాత్ర లెన్నో చిన్నపల్లెటూళ్ళకును ప్రాకినవి. విజయనగరములో ఆనందగజపతి మొదట దర్శనమీయకపోగా వారు చెప్పిన ఈ పద్యమునుబట్టి, వారి యాత్రావిస్తృతియేకాక, వారి దర్పమును విశదమగును.

'అటు గద్వా లిటు చెన్నపట్టణము మ
ధ్యం గల్గు దేశమ్మునన్
జటులస్ఫూర్తి శతావధానములు మె
చ్చం జేసియున్నట్టి మా
కిట రాజీయకయున్న దర్శనము నిం
కెవ్వారి కీ రా జొసం
గుట చెప్పంగదవయ్య, పాలితబుధా,
కోదండరామాభిధా!'

వారు తమ శక్తిసామర్థ్యముల నీ విధముగ గద్వాలలో ఉద్ఘాటించినారు.

'శతఘంటకవనమ్ము సల్పు సంగతి యన్న
గరతలామలకంబు గాదె మాకు,
అష్టావధాన కష్టావలంబన మన్న
నంబి కొండయు దండనంబు మాకు
ఆశుధారాకవిత్వాడంబరం బన్న
నల్లేరుపై బండి నడక మాకు
సత్కావ్య నిర్మాణ చాకచక్యం బన్న
షడ్రసోపేత భోజనము మాకు

వ్యర్థమగువాద మొనరింప వచ్చువారి
దంట మణగించుటే పోషకంబు మాకు
దశరథేయ కవిసమవాయగేయ
పండిత విధేయ, రామభూపాలరాయ!'

ఈ జంటకవులు తాము పొందిన గౌరవములను ఆత్మకూరులో సరస్వతీదేవి కిట్లు నివేదించుకొనిరి.

'ఏనుగు నెక్కినాము, ధరణీంద్రులు
మ్రొక్కగ నెక్కినాము, స
న్మానము లందినాము, బహుమానములన్
గ్రహించినార, మె
వ్వానిని లెక్కపెట్ట కనివారణ
దిగ్విజయం బొనర్చి, ప్ర
జ్ఞా నిధులంచు పేరు గొనినారము
నీ వలనన్ సరస్వతీ!!

ఈ జంటకవుల కెన్నో బిరుదము లున్నవి. వానిలో 'శింకసేంద్ర ఘటా పంచానన' బిరుదము వారు స్వయముగా పెట్టుకొన్నది. ఇద్దరును జన్మాంతము శిష్టాచారము పాటించినవారే. సభలలో పవిత్రములగు ధోవతి యుత్తరీయములే గాని శిష్టు లపవిత్రములుగా భావించు చొక్కాలు తొడిగి ఎరుగరు. జనను వైదికులైన వీరు వైదికాచార విరుద్ధముగా కత్తెర మీసములు పెట్టుకొనిరి. ఆత్మకూరులోని పండితులు అశాస్త్రీయమైన మీసములు తీసివేయ రాదాయని సూచింపగా కవులిచ్చిన జవాబిది.

'దోసమటంచు నెరింగియును
దుందుడుకొప్పగ బెంచినార మీ
మీసము రెండు బాసలకు
మేమె కవీంద్రుల మంచు దెల్పగా,
రోసము గల్గెనే, కవివ
రుల్ మము గెల్వుడు, గెల్చిరేని యా
మీసము దీసి మీ పద స
మీసములం దలుంచి మ్రొక్కమే!'

ఈ విధముగా పౌరుషముగా మాట్లాడు వారికి ఎందరో శత్రువులు ప్రాప్తించుట సహజము. 'అగ్రే డిండిమతాండవం' అని డిండిమము మ్రోగించుకొనుచు ఇతర కవీశ్వరుల నవమానించిన గౌడ డిండిమ భట్టారకుని బహుకాలమునకు శ్రీనాథభట్టారకుడు ఢీకొని డిండిమము పగులగొట్టింప గలిగినాడు. తిరుపతి వెంకటేశ్వరుల మీసములలో 'ఆంధ్ర మీసము'నైనను తీయింతుమని ప్రగల్భములు పలికినవారున్నారుగాని తీయించగలిగిన మొనగాళ్లు లేకపోయిరి.

ఈ కవిద్వయము పండితులను, పామరులను, సంపన్నులను, పేదలను సమానముగా నాదరించిరి. [illegible]లైన ఏకొద్దిమందియో తప్ప, వారిని వారి జీవితకాలములో అగ్గించనివారులేరు. ఆంధ్రులేకాక తమిళులు ఆంగ్లేయులు వారికి నివాళు లర్పించిరి.

పండిత ప్రపంచములో వారి కానాడు పట్టిన గౌరవమెట్టిదో తెలుపుటకు మా పితృపాదులగు శ్రీ నోరి హనుమచ్ఛాస్త్రిగారి వాక్యము లెక్కువ యుక్తములని తోచినందున అవి ఉదాహరిస్తున్నాము. తిరుపతి వెంకటేశ్వరులే 'పంతపరము నాటకము లెల్ల శ్రీ నోరి హనుమద్బుధుని కెవ్వరగు సాటి' అని ప్రస్తుతించిన సంస్కృతాంధ్ర పండితులు వారు. వారు మా స్వగ్రామమైన బ్రాహ్మణ కోడూరులో జరిగిన శతావధానపు సందర్భములో తిరుపతి వెంకటేశ్వరులమీద చెప్పిన సీసపద్యములో ఎత్తుగీతి యిట్లున్నది:

'పుడమి వీరికి సరియగు పురుషు లెవరు
వరుడు నారాయణుండును నరమునిప్ర
వరున తిరుపతి వేంకటేశ్వరులె యగుచు
జగతి జన్మించినారలు సత్యమిదియు!'

వారు వెంకటశాస్త్రిగారికంటె 12 సం॥లు పెద్ద అని మనము గుర్తుంచుకొనవలెను.

ఈ తిరుపతి వేంకటేశ్వరులను నరనారాయణావతారములుగా వర్ణించుట సంప్రదాయవిదులకు ఎంతైన ప్రమోదావహమైనది. వారిద్దరికి ఎక్కడికి వెళ్లినను జయము సమకూడుచుండెడిది.

'యత్ర యోగేశ్వరః కృష్ణో
యత్ర పార్థో ధనుర్ధరః
తత్ర శ్రీ ర్విజయో భూతి
ర్ధ్రువా నీతి ర్మతి ర్మమ'

అని కదా గీతలోని ఉపసంహార వాక్యము!

**3**

పూర్వకాలము మనదేశములో ఏదైనా శాస్త్రములో నూతన సిద్ధాంతము ప్రతిపాదించే గ్రంథము వ్రాసినవారు, దేశాటనముచేసి సత్పభాంతరవనసీమ లందు ఆ గ్రంథము వినిపించెడివారు. పండితుల నిశిత పరీక్షకు నిలిచినప్పుడే గ్రంథానికి ప్రచారము వచ్చేది. అందుచేత నవి విజయయాత్ర లనవచ్చును.

కాని కావ్యవిషయములో ఆ విధంగా విజయము సాధించటము సాధ్యపడదు. నూతన కావ్యము సభలో వినిపించినప్పుడు దానిలోని గుణదోషాలు - అర్థములో, శబ్దములో, ఔచిత్యములో, రసాదులలో—పండితులు పరామర్శిస్తారు. దాని మంచి చెడులు విచారిస్తారు. పండితులు తృప్తిపడినంత మాత్రముచేత అది కవికి విజయమనరాదు. కావ్య జగత్తులో జయానికి సరియైన ప్రమాణము లేదు.

అందువల్ల కవితావిజయానికి తిరుపతి కవులు నూతన ప్రక్రియ చేపట్టినారు. అది అవధాన ప్రక్రియ—అష్టావధానము, శతావధానము! దానికి ఆశుకవిత్వము జోడించినారు. రెండు విధాల అవధానములలో పృచ్ఛకులు అవధానుల యవధానమును భంగించుటకు యత్నింతురు. భంగము కలిగింప లేనిచో అవధానులు జయించినట్లేకదా! అదిగాక అవధాన పద్యాలలో దోష విచారణ రవచ్చును. దోష నిరూపణ చేసినచో అవధాని ఓడినట్లు, దోషములు లేవని నిరూపించినచో అవధానులు జయించినట్లగును. ఇందుకుతోడు 'మాకంటె సుమ్ముగా ఎవరు అవధానము చేయగలరు?' అను సవాలుకూడ మధ్యమధ్య వినిపించుచుండెను.

అసలీ అవధానాల పుట్టుపూర్వోత్తరాలు, స్వరూప స్వభావాలూ నిర్దుష్టముగా విచారణచేసి ప్రదర్శించినవారు కనబడరు. వేదాధ్యయనము చేసిన వారిని అవధాను లనుట బహుకాలమునుండి పరిపాటి. కవుల అవధానములగూర్చి శ్రీమాన్ ఈయుణ్ణి వెంకట వీరరాఘవాచార్యులుగారు 'సంస్కృతములో కొందరు శతావధానులు, ఆశుకవులు'అను వ్యాసములో (భారతి సంపు. 27, సం. 3) కొంత సూచించినారుగాని సమగ్రముగాలేదు. నూరు విషయములందు ఒక్కసారి ఏకాగ్రత నిలుపుట శతావధానము, ఎనిమిదింటిమీద నుండుట అష్టావధానము—అని మూలభావమై యుండును. ఈ భావము మనస్సులో పెట్టుకొనియే, ఈ వ్యాసకర్త తన 'కవి సార్వభౌముడు'లో శ్రీనాథునిచేత వేదవేదాంగశాస్త్రాదులు నూరింటిమీద ఏకాగ్రత నిలిపి దేవరాయల సభలో అపూర్వాద్భుత శతావధానము చేసినట్లు కల్పించినాడు. అట్టిది శ్రీనాథభట్టువంటి వేద శాస్త్ర విద్వద్వర్యునికేకాని సాధ్యపడదు. తత్తుల్యమైన అవధాన ప్రదర్శనముతోనే అవధానములు ప్రారంభించి నానాటికి రూపాంతరములు పొంది యుండుననుటకు సందేహములేదు. నూరు రాగి చెంబులలో నీళ్లుపోసి వేరేగదిలో పెట్టి, వాటిని సంఖ్య చెప్పి కర్రతో కొట్టి వినిపింపగా, శబ్దభేదమునుబట్టి ఆ నూరింటిని తర్వాత శ్రీమాన్ మాడభూషి వెంకటాచార్యులు గుర్తింపగలిగిరట!

రామరాజభూషణుడు తాను, 'ఏకైకదినప్రబంధ ఘటనాసద్యశ్శత గ్రంథకల్పను'నని, 'శతలేఖిని పద్య సంధాన ధౌరేయుడ'నని, 'ఘటికాశత గ్రంథధుర్యుడ'ననీ, 'అష్టప్రబంధబంధాభిజ్ఞుడ'ననీ, 'వ్యస్తాక్షరీధుర్యుడ' ననీ చెప్పికొనెనుగాని, వాని స్వరూపమెట్టిదో తెలియవచ్చుట లేదు. నేటి భావములనుబట్టి ఆకాలములోగూడ నట్లే యుండెనని భావించుట యుక్తము కాదు.

19 వ శతాబ్దములో ముఖ్యముగా దేవుల పల్లి సోదరకవులూ, శ్రీమాన్ మాడభూషి కవి వర్యుడు అవధానముల నొకదారిలోనికి తెచ్చినట్లు తోస్తుంది. వారి యడుగు జాడలలో నడచి తిరు

పతి కవులు అవధానములకు రాచబాట ఏర్పరచినారు. ఐనా ఇప్పటికిని అష్టావధాన విషయములో, ఏ అవధానియైనను ముందుగా తన యిచ్చవచ్చిన అవధాన విషయము లేమిటింటిని నిర్ణయించుట చూచుచున్నాము. అందుచే మార్పులున్నవి. కాని శతావధానము మాత్రము తిరుపతి కవులు పెట్టిన ఒరవడిలోనే నేటికిని నిరాఘాటముగా సాగుచున్నది.

ఏ అవధానములోనైన ప్రధానమైనది ధారణతోకూడిన అవధానత. అది లేనిచో ఎంత [illegible]ను ఆపూర్వటి అవధానానికి శోభను కూర్చవు, సద్యస్స్ఫూర్తి, కల్పనాపటిమ, పాండిత్యం, చమత్కార వైభవము. తిరుపతి కవులకు ముందును తర్వాతను అవధానాలు చేసినవారూ చేస్తున్నవారూ ఉన్నారు. కాని వారితో సాటిగా చేసినవారు మరొక్కరు కానరారనుట నిస్సందేహము. వారు అవధాన పద్యాలు చెబుతూనే, మధ్య మధ్య ఎన్నో చమత్కార ప్రసంగాలు, శాస్త్రప్రశంసలూ, లోకాభిరామాయణాలూ, ఆశుకవిత్వ ప్రదర్శనము, అవధానముతో సంబంధములేని సమస్యా పూరణాలూ, దత్తపదులూ చేసేవారు. ఈ విధంగా సభారంజనము చేసేది తరుచుగా వెంకటశాస్త్రిగారే. వారి అవధానాలలోని చమత్కృతులను గూర్చిన కథలెన్నో వ్యాప్తిలో ఉన్నవి. ఒక్కటి మాత్రము ఉదాహరిస్తాము.

పృచ్ఛకు డొకడు— వేమవరాగ్రహారములోనని తోస్తుంది — చింతకాయపచ్చడిమీద పద్యము చెప్పుడనగా వెంకటశాస్త్రి పాట చెప్పెను. అప్పుడతడు చింతాకుమీద పద్యము చెప్పుడనెను. అధ్యక్షులు 'మంచివిషయమేదైన అడుగు'మని హెచ్చరింపగా, నతడు 'చీకుముల్లుమీద సీసము చెప్పుదురా?' యనెనట. వెంటనే వెంకటశాస్త్రిగారు ప్రారంభించి,

'నన్ను గాల్చినగాని నీ బుద్ధి మానవే, ఛీ!–'

అనిచెప్పి ఆపిరట. ఆ పృచ్ఛకుడు తెల్లవోయి తన్నే

తిట్టుచున్నారనుకొని 'నన్నట్లా తిడతారెందుకండీ?' యని యడిగెను. తిరుపతిశాస్త్రిగా రందుకొని 'నిన్ను తిట్టుట కాదోయి. చీకుముల్లుమీద పద్యమే' అనుచు, 'ఏమనందునే చీకుముల్లా!' అని సీసపాదము పూరించిరట. సభలంతా సంతోషంతో గొల్లుమన్నది.

ఇందులో మొదట కొంతమోటుదనముతో కూడినదైనా, చమత్కారపర్యవసానమైన సద్యస్స్ఫూర్తి ప్రకట మగుచున్నది. వెంకటశాస్త్రిగారి పద్యపాదభాగమును తిరుపతిశాస్త్రిగారు వెంటనే ఉత్తరీంగా పూరించుటలో విశేషమున్నది. పృచ్ఛకునికిగూడ తుదకు సంతోషమే కలిగియుండవలెను. 'చీకుముల్లు'మీది ఈ సీసపద్యము ఆంధ్రభాషలో శాశ్వతముగా నిలువదగిన ఉత్తమచాటువులలో నొకటి. ఈ పద్యము అన్యాపదేశముగా ఎవరినో ఉద్దేశించి చెప్పినదేమోయని స్ఫురించుచున్నదికాని ఆ రహస్య మెవ్వరును మా దృష్టికి వచ్చినంతవరకు బయలు పెట్టలేదు.

ఇటువంటి చమత్కారసంఘటనలు వందలుగా దేశమంతటా పెద్దలు నేటికీ చెప్పుకుంటారు. అవే వారి అవధానాలు పండిత పామర జనరంజకంగా ఉండడానికి ప్రధాన హేతువులు.

వీరిద్దరిలో మొదట అవధానము చేసినది శ్రీ వెంకటశాస్త్రి. అది అష్టావధానము. 'జాతక చర్య'లో దాని వివర మిట్లున్నది.

అప్పటికి శ్రీ వెంకటకవి చదువుకై ఎందరెందరు గురువులనో ఆశ్రయించి తిరి తిరిగి శ్రీ చర్ల బ్రహ్మయ్యశాస్త్రిని ఆశ్రయించినాడు. అప్పటికి వారివద్ద కౌముది చదువుచున్న శ్రీ తిరుపతితో పరిచయమైనది. కాని కాలు నిలుకడ లేని శ్రీ వెంకటశాస్త్రికి విద్యాగ్రహణమునకై కాశికి పోవలె ననే ఉబలాటము కలిగినది. గురువులతో మాయ మాటలుచెప్పి ఒక మిత్రునితో కాశికి బయలుదేరినాడు. డబ్బులేదు.

నిడమర్రుచేరి అక్కడి ఉద్యోగుల సభలో శతఘంటావధానము, అష్టావధానము చేయగలనని శ్రీ వెంకటకవి ప్రగల్భముగా పద్యములు చెప్పెను. అప్పటి కాయనకు 20 వ ఏడు.

'కూత' ఘనముగా ఉన్నది చూతమని సభ చేసి అష్టావధానము చేయించిరి. అవధానము పూర్తి చేసి, 'అయ్యా, నేనెప్పుడూ అవధానము చేయలేదు. ఊరక అడిగిన ధనమివ్వరు గదా అని ప్రగల్భములు పలికితిని. లోపములున్న క్షమింపు'డని విన్నవించెను.

వెంటనే సభ్యులందరు 'కోపములేమీ లేవు' ఇది మీ ప్రాకృత పుణ్య ఫలము!' అని దీవించిరి. సభాకారకులైన శ్రీ రామదాసు 'చంద్రునకొక నూలు పోగు' అని పళ్లెములో రు. 30/—లు పోసి సమర్పించి నమస్కరించెను. ఆ సభాసదుల ఆశీర్వచనమే శ్రీ వెంకటశాస్త్రికి దిగ్విజయము ప్రసాదించినది. ఆ నాడే శ్రీ శాస్త్రిగారి పూర్వ పుణ్యఫలము ప్రారబ్ధమైనది!

రెండవ అవధానము గుండుగొల్లులో. శ్రీ శాస్త్రిగారు కాశిలో ఎక్కువకాల ముండలేదు. గురువుల యాదేశము ననుసరించి స్వదేశము వచ్చిరి.

కాని కాశీ సమారాధనకు గంగపూజకు డబ్బులేదు. శ్రీ శాస్త్రి కోనసీమలో ముమ్మిడివరము, ఐనాపురము, కేశనకుర్రులో అవధానములుచేసి యశము ధనము ఆర్జించి గంగాపూజ నిర్వర్తించెను.

ఆ పిమ్మట శ్రీ వెంకటశాస్త్రి బ్రహ్మ గురువులను చేరి నిలుకడగా శ్రీ తిరుపతిశాస్త్రితో కలసి విద్యాభ్యాస మారంభించెను. వారిద్దరికిని మొదట విద్యాస్పర్ధ ఉండేది. ఇతర శిష్యులు కొందరీయనను కొందరాయనను బలపరచేవారు. ఆ స్పర్ధే వారి మైత్రికి బీజమైనది. అప్పటికి శ్రీ తిరుపతి సంస్కృత రచనమేకాని ఆంధ్రపద్యరచన యెరుగడు. శ్రీ వెంకటశాస్త్రి సాహచర్యమువలన ఆయన ఆంధ్ర

కవిత్వములోనికి దిగెను. అప్పటినుండియే జంట కవిత్వకృషి ఆరంభమైనది. అప్పటినుండియే 'ఒక్కరు రచియించి రేయును గాదగు దిర్పతి వెంకటేయమై' అను ఖ్యాతి కల్గినది. ఆ మాట శ్రీ వెంకటకవి జీవితాంతమువరకును (శ్రీ తిరుపతి తర్వాత 30 ఏండ్లు జీవించెను) నిలుపుకొనెను.

❧

ఈ సందర్భములో ఈ జంటకవుల స్వభావ తారతమ్యము వివరించు టవసరము.

శ్రీ తిరుపతిశాస్త్రి కొంత సంపన్న వంశములో జన్మించెను. వారి పెద్దలు వేదవిదులు. తండ్రి ఘనపాఠియేకాక సాహిత్యముకూడ కలవాడు. శ్రీ శాస్త్రి తండ్రిగారివద్దనే కావ్యారంభము చేసిరి. తర్వాత సిలుకడగా కోనసీమలో గురువులయొద్ద ఇతర కావ్యములు, చంపువులు, భాణములు, నాటకములు, తర్కసంగ్రహము న్యాయబోధినితో చదివిరి. ఇంతలో బ్రహ్మయశాస్త్రిగారు కాశినుండి వచ్చినారని విని వారిని చేరి కౌముది ఆరంభించెను.

ఈ సందర్భములో శ్రీ తిరుపతిశాస్త్రి మేధాతిశయమునుగూర్చి కొంత చెప్పవలసి యున్నది. ఆయన అప్పుడు ప్రారంభించినది కౌముదియే. ఐనా సంస్కృత వాక్యములు చక్కగా నన్వయించగల శక్తి అలవడినది. దానికితోడు అఖండమైన జ్ఞాపకశక్తి ఉండేది. అందువల్ల కౌముది పూర్తిచేసిన విద్యార్థులకు కౌముదిపై వ్యాఖ్యానగ్రంథములు గురువులు పాఠము చెప్పుచుండగా విని ఆ వ్యాఖ్యానపాఠములు తన పై విద్యార్థులకే చింతన చెప్పేవారట. అందువలన బ్రహ్మగురుల కాయనయందు వాత్సల్యాతిశయము కలుగుటలో ఆశ్చర్యము లేదు. తాను విస్పష్టముగా చింతన చేయవలసిన పని లేకుండగనే కంఠస్థముగా ఉండేది తిరుపతిశాస్త్రిగారు కౌముదిలో కారకము పూర్తియగుచున్న రోజులలో శ్రీ వెంకటశాస్త్రి సహపాఠిగా బ్రహ్మగురులయొద్ద చేరెను.

శ్రీ వెంకటశాస్త్రిగారు బ్రహ్మగురులవద్దకు రెండవసారివచ్చి కుదురుకునేవరకూ ఒకచోట కాలు నిలువక, ఒకచోట నని విద్యాభ్యాసము చేయక, ఒక చదువనికాక, రకరకాలుగా కొంత ఆకతాయిగా తిరిగెను. ఇందుకు కొంతవరకు ఆయన బాల్యములో తండ్రి ఆర్థికస్థితి అంత బాగుండకపోవుట ఒక కారణము. కాని మూలకారణము ఆయన అశాంతచిత్తమే. బడికి సరిగాపోలేదు. కాలుగాని మనస్సుగాని ఒకచోట నిలిచేదికాదు. తాతగారి గ్రంథ సంచయమునుండి ఆంధ్రగ్రంథాలు స్వయముగా పఠించినాడు సంస్కృత భాషాధ్యయనమునకై ఎందరెందరు గురువుల నాశ్రయించెనో చెప్పలేము. ఆంధ్రకవిత్వము చిన్నతనములోనే అభ్యస్తమైనది. పద్యకవిత్వమేకాక పదకవిత్వమును అభ్యసించెను. హరికథలు, వీథినాటకములు వ్రాసెను. పురాణప్రవచనములు చేసెను. కొంచెము వేదము, కొంచెము సంగీతము, కొంచెము మృదంగ వాదనము, కొంచెము ఇంగ్లీషు—కొంచెము కుస్తీ కూడా అభ్యాసము చేసెను. ఈ చిల్లరవిద్యలలో తిట్టుకవిత్వము కూడా ఒకటి. ఈ తిట్టుకవిత్వముతో ఒకమారు జెయిలు ప్రవేశించే ప్రమాదము వరకూవచ్చి తప్పినది. అక్షధూర్తులతో సహవాస మొనర్చెను. కొంతకాలము చదువుకంటె చదరంగమును ఎక్కువగా అభ్యసించెను. ఆయన చిన్నచిన్న చదువులకే ఎందరో గురువుల' నాశ్రయించెను. మనస్సు కెలతో కష్టమనిపించినా, మూడు మాసములు మాధుకరము కూడ చేసెను. మొదటనాడు కళ్లనీళ్ల పర్యవసానమైనది మాధుకరాన్నమును నిట్లు వర్ణించిరి:

'ఒకపొర నన్నము మరి యిం
కొకపొర సూపమ్ము నిక నొకపొర కూరల్
చికిలికిగా బోసెను'

డల్చి ఆ యన్నము తిని చదువు సాగించెను.

అన్నిటికి దోడు కంటిజబ్బు. ఆ కన్ను పోయి నచో పోవుగక, ఒంటికంటి శుక్రాచార్యులవలె కవి వాడుగాక యని చదువు వదలలేదు.

కొన్నిరాత్రులు రెండుక్రోసుల దూరములో ఉన్న పిల్లంకకుపోయి లఘుకౌముదియు, కొన్నిరాత్రులు

క్రోసెడుదూరములోనున్న పల్లెపాలెము వెళ్లి భారవి పాఠమువేసియు తెల్లవారుసరికి ఇంటికి వచ్చుచుండెను. ఈ విధంగా చదువుకు ఎక్కడ ఏచిన్న అవకాశము చిక్కినా, వదలక క్షణశః కణశః విద్యాసంగ్రహము కావించెను. ఇంతమందివద్ద ఇంత ముక్కముక్కలుగా చదువుకున్నందున సామాన్యులకైతే చదువంటేదికాదు. కాని వారికి విస్తారమైన ధారణ ఉన్నందున, చదివిన చదువు గట్టిగా నిలుచుటేగాక, హృదయమునకు విస్తృతినిగూర్చి లోకానుభవమును ఎక్కువచేసింది. ఆయన చిన్నప్పటినుంచి గట్టిపట్టుదల ఉన్నవాడు.

నూతన యౌవనములో ఆయన కొక అనుభవము కలిగినది. అప్పుడు 17 సం.లు. యానావు వెంకటేశ్వరునిపై శతకముచెప్పి వినిపింపగా కొందరు అందులోని ఒప్పులుగూడ తప్పులని ఆక్షేపించి సంస్కృతిసమాసగతసంధినిగూర్చి ప్రశ్నించిరి. అప్పటి కాయనకు ఆంధ్రవ్యాకరణముతప్ప రానందున ఒప్పని ఎరిగియు సదుత్తరము చెప్పలేకపోయెను. అది అవమానము కలిగినట్లు భావించెను. వ్యాకరణ శాస్త్రము సాధించవలెనను పట్టుదలలో కాశికి వెళ్ల నిశ్చయించి, కంటివైద్యమునకు వెళ్లుచుంటినని ఇంటిలో చెప్పి, ఒక మిత్రునితో కాశికి బయలుదేరెను. విశాఖపట్టణమువరకు వెళ్లిరి. అక్కడ ఏదు నూతుల వీధిలో మధ్యాహ్నభోజనము చేసిరి. 'ఆ అన్నసుఖము, మాషాపూపంబు, దుర్గంధమయమునోయి'లో హడలిపోయి మిత్రుడు వెనుదిరిగిరాగా, తప్పనిసరియై తానును తిరిగి వచ్చెను.

బ్రహ్మగురువివద్ద చేరువరకు ఆయనకు సుఖభోజనము, నిలుకడగా చదువు, కుదురులేదు. కాని కాశిలో వ్యాకరణాధ్యయనము చేయవలెననే వ్యామోహము వదలలేదు బ్రహ్మగురునివద్ద చేరిన కొలది కాలముననే కాలునిలువక, గురులతో మాయమాటలుచెప్పి, కాశికి బయలుదేరెను. మొదటి అష్టావధానాదులుచేసి ధనము కూర్చుకొని కాశికి నిజముగా ఈ మారువెళ్లి నాల్గు నెలలుండెను. కాని తల్లిదండ్రుల గొడవవలన బ్రహ్మగురువులు ఉత్తరము వ్రాయగా దానిని మన్నించి తిరిగివచ్చి స్థిరముగా బ్రహ్మగురునియొద్ద చదువుకు కుదురుకొనెను.

ఈ విధముగా శ్రీ తిరుపతి నిశ్చలమైన పర్వతాగ్రమువంటివాడైతే, శ్రీ వెంకటేశ్వరులు మహాప్రభంజనమువంటివాడు. శ్రీ తిరుపతి ఎక్కువ మాటకారి కాదుగాని, ఎప్పుడో ఒకసారి ఆయనకు కోపము కలిగితే సింహగర్జనమువలె ఎవరాపినా ఆగక నిరాఘాటంగా విజృంభించేవాడట. కాని శ్రీ వెంకటశాస్త్రి నోరు ఒక్కక్షణము ఊరుకొనేది కాదు. ఎన్నో అపూర్వాద్భుత విషయాలు, చమత్కారాలూ, మధ్య మధ్య ఎత్తిపొడుపులూ, వర్ణించేవారు. శ్రీ తిరుపతి పద్యపఠనము బాగుండేది కాదు. శ్రీ వెంకటశాస్త్రి పద్యపఠనములో ఒక కొత్త బాణి—ఈనాడు శ్రీ విశ్వనాథవలె—ఆంధ్రభాషలో ప్రచారములోనికి తెచ్చినారు. ముఖ్యముగా శ్రీరాగములోగాని మోహనరాగములోగాని చదివేవారు. అప్పుడాయన ముఖములో చిత్రమైన విరుపు ఉండేది. శతాధికంగా జను లారోజులలో ఆయన బాణీలో, ముఖం విరుపుతోసహా—పద్యాలు చదవడం నాపాటి! శ్రీ తిరుపతిశాస్త్రి దృఢకాయుడు, ఆరోగ్యశాలి. శ్రీ వెంకటశాస్త్రి పీలగా, ఎప్పుడూ జబ్బులతో బాధపడేవాడు.

వారిద్దరిలో ఇంత వైవిధ్యమున్నా, చిత్రముగా ఇద్దరూ గాఢమిత్రులైనారు. కవితావాక్కుకూడా కలిసిపోయినది. సంస్కృతప్రౌఢమైన భాగాలు శ్రీ తిరుపతిశాస్త్రివనీ, ఆంధ్రప్రచురమైనవి శ్రీ వెంకటశాస్త్రివనీ లోకములో ప్రవాదము వ్యాపించినదికాని అది వాస్తవముకాదని శ్రీ వెంకటశాస్త్రి గారే నిరూపించినారు. మా ఇతర వృద్ధమిత్రులు దానినే స్వయముగా ఎరిగి బలపరచినారు.

ఈ కవిద్వయమునకు మధ్యమధ్య పొరపులు రాకపోలేదు. ఒకమారు శ్రీ వెంకటశాస్త్రి తూర్పు దేశమునకు సభలకు వెళ్లుచు శ్రీ తిరుపతికి రమ్మని కబురంపెను. అప్పుడాయన శ్రీ పోలవరము ఆస్థాన

ములో ఉన్నందున వెంటనే రాలేక సభనాటికి తంతి పంపితే వత్తునని ఉత్తరమంపెను. శ్రీ వెంకట శాస్త్రికి ఎందుకో కోపము వచ్చెను. 'నీవు లేనిది నేను అవధానము నిర్వహింపలేనని తలచినప్పుడు అట్లే కబురంపుదునులె' అనుకొని ఒక్కడే వెళ్లి ఉనకాపల్లి, శ్రీకాకుళము, ఉర్లాములలో అవధానములు పూర్తి చేసెను. ఆ తర్వాత ఇద్దరు వేరుగావెళ్లి గద్వాలలో కలసిరి.

ఇది శ్రీ వెంకటశాస్త్రి స్వీయచరిత్ర అన దగిన జాతకచర్యలో వ్రాసిన వృత్తాంతము. ఒకసారి మాజపేట కుకూడ ఒంటరిగా వెళ్లినట్లు తోచును. కాని ఇటువంటి పొరపులు ప్రియులమధ్య ప్రణయ కలహములవలె ప్రేమభావమును వృద్ధిచేయునవేకాని భంగకారులు కావు.

దివాకరాస్తమయముర శ్రీ వెంకటశాస్త్రి ఇట్లు విలపించినారు.

'ఏబది దాటె నా కతని
కేబది కింక నెలల్ గొరంత నా
ల్గాబుధమాన్య డిందనుక
నాగక సల్పె శతావధాన, మే
నో బహుకాలమై యొకట
నుండియు నాతని చేతియూత బ్ర
జ్ఞా బహుశావధానప్ర బ
సంగము లీడ్చుచునుంటి నెట్టులో

'ఏ సల మాజపేటి సభ
కేగితి నిన్నిగ ద్రవి యన్న కో
పానన కాదె యొంటరిగ
బాపురిన్ గనబోయి లిప్పుడో
ధీనిధి, తిప్పరత్, యచటి
ధీరులతో గలహమ్ము గల్గిన
ప్డేనియు నేను నీస్మృతికి
నెక్కకపోనుజామీ సుమిత్రమా!'

శ్రీ తిరుపతిశాస్త్రి శ్రీ వెంకటశాస్త్రికంటె పంవత్సరము ఏడుమాసములు చిన్నవాడైనందున నేమి, ఆంధ్రకవిత్వము చెప్పుటకు దారి చూపి నందుననేమి ఆయనను కొంత గురుభావముతో అన్నసువలె, చూచెడువాడు. దానికి వారుచెప్పిన ఈ పద్యమే సాక్షి!

'వితతాత్మీయ శతావధాన కవితా
విద్యాపయోరాశి సం
భృత శిష్యాంబుద వాఙ్మయామృతరస
ప్రీతాఖిలాంధ్రక్ష్మమా
ధృత రజ్య ప్రదసికావతంస కృత వం
దిస్తోత్రమాలా విభూ
షితు మా వేంకటశాస్త్రి నే బొగడెదన్
శిష్యస్వరూపమ్మునన్.'

వారిద్దరికి పరస్పర మున్న ప్రమాణబుద్ధి ఈ పద్యమలో గోచరించును.

'అభినవ రామలింగ బిరు
దాంకుడ నాకవనమ్మునందు నీ
యభవపు గండ్లు తప్పు లిడ
నర్హులె? కాదని తప్పు దిద్ద మా
యుభయులలోన నొక్కడు ను
రొక్కనికిం దగుగాక ఈర్ష్యచే
యభము శుభమ్మునం దెలియ
కార్చెడి దేబెలు మాకు లెక్కయే!

## 5

తిరుపతి వేంకటేశ్వరుల దిగ్విజయములకు నాంది పలికినది కాకినాడలో. అది వారి మొదటి శతావధానమేకాక సంపూర్ణ శతావధానము కూడను. శ్రీ వెంకటశాస్త్రికి 20 సం.లు; శ్రీ తిరుపతికి 19 వ ఏట. బాలసరస్వతులవలె నున్నవారిని సభ్యులు అభిమానించుచునే అడుగడుగున చిక్కులుపెట్టి గడ్డుపరీక్షలు చేసిరి. కవులన్నిటిలో నెగ్గిరి. ఒక పండితుడు దోషము లారోపింపగా పురపండితు లాయనపై మండిపడిరి. ఆ శతావధానములో ఎన్నో విశిష్టవిషయము లున్నవి కావున దాని వివరములు ప్రధానముగా 'జాతకచర్య' నాధారముచేసికొని విపుల ముగా వర్ణించుచున్నాము.

వారప్పుడు బ్రహ్మగురునియొద్ద వ్యాకరణము అధ్యయనము చేయుచుండిరి. ఇద్దరును కలసి మొదటి సారి అష్టావధానము చేయుటకు కాకినాడకు బయలు దేరిరి.

అప్పటికి శ్రీ తిరుపతికి సంస్కృత కవనమే కాని ఆంధ్రపద్యరచన బాగారాదు. దారిలో శాస్త్రి తిరుపతికి ఆ రహస్యాలు బోధించగా వేదవిదుల ఇంటి బిడ్డగనుక వెంటనే ధారణ చేసెను.

వారిచేత శ్రీ దురిసేటి శేషగిరిరావు అష్టావధానము చేయించి గౌరవించెను. ఆది శ్రీ మశాస్త్రి వలన విని శ్రీ బాదము వెంకటరత్నము కవులను పిలిపించి, 'అష్టావధానము కష్టముకాదు, మీరు శతావధానము చేయగలరా?' అని అడిగి దాని వివరములు తెలిపెను. జంటకవులు అహంకరింపలేదు. ఆలోచించి జవాబు చెప్పుదుమని వ్యవధి అర్థించిరి.

వారిద్దరు ఏకాంతముగా ఒక కొబ్బరితోట చేరుకొనిరి. అక్కడ నూరు కొబ్బరిచెట్లను పృచ్ఛకులుగా భావించుకొని చెట్లకు శతావధానము చేసిరి. దానితో తమ కా శక్తి కలదని నిర్ధారణ చేసికొని వచ్చి సభలో శ్రీ వెంకటరత్నముతో 'శతమునకేకాదు, సహస్రమునకైనను చెప్పగలము'అని చెప్పిరి తర్వాత సంపూర్ణ శతావధానసభ ఏర్పాటైనది.

మొదటిరోజు సాయంకాలమునకు మొదటి పాదమైనది. అప్పుడు సభ్యులు, 'ఈ రోజు వదలినచో ఇద్దరు ఆలోచించుకొందురు గనుక కొన్నిపద్యములైనా ఈ రోజే పూర్తిచేయగలరా? ఒక వరుస లేకుండ పూరింపగలరా 'అని యడిగిరి. కవులట్లే చేయుదుమనిరి. ఒక వరుసలేదు. పంక్తిలో మొదట కూర్చున్నవారులేరు. అంకెల ప్రకారము వా రడిగి నట్లెల్ల పూరించిరి. అట్లు నిర్వహించగలుగుట బుద్ధిబలమో దైవబలమో చెప్పలేమని శ్రీ వెంకట శాస్త్రిగారే జాతకచర్యలో అబ్బురము ప్రకటించిరి. ఇంకేమున్నది! సభఅంతా 'ఆహా, ఆహా!'అని అగ్గింపులతో మారుమ్రోగినది. కవులకు కొందరు మ్రొక్కువారు, నరనారాయణులే ఈ రూపమున అవతరించిరని ప్రశంసించువారునైరి. అట్లారంభించినది జయప్రదముగా కొనసాగుట కష్యాతర ముండరాదు. ఐనా పానకములో పుడక రాకమానదు. అది అవధానము పూర్తికానున్న 7 వ నాడు వచ్చినది. అది తెచ్చినది శ్రీ వెంపరాల వెంకటశాస్త్రి.

శ్రీ వెంపరాల శాస్త్రి సభకు తాము రాక తన శిష్యులను 53, 54 స్థానములలో కూర్చుండబెట్టిరి. ఒకరు భూపుత్రి వివాహము ఉపజాతిలోను, ఒకరు కాకినాడ ద్విజవర్ణనము వంశస్థలోను అడిగిరి. 7 వ నాడు తండ్రియే స కువచ్చి అధ్యక్షులైన వెంకటరత్నముగారితో హేళనగా కవులు చెప్పినది ఉపజాతి కాదనియు, వర్ణ్యము, తప్పినదనియు రెండు దోషము లుద్ఘాటించిరి. వారు కవులను పిలిచి 'మీ పద్యములో తప్పు లున్నవట, ఏమందురు?'అని అడిగిరి. కవులు వినయముగా 'అవధానములో ఎంతవారికైనను తప్పులు రావచ్చును. ఐనా ఆ తప్పులు ఏవో సెలవీయండి' అని అడిగిరి.

అప్పుడు శ్రీ వెంపరాల శాస్త్రి కుమార సంభవము మొదటి శ్లోకము చదివి, 'ఉపజాతిలో ఉపేంద్రవజ్ర ఇంద్రవజ్ర సాంకర్యము సమముగా ఉండవలె. మీ పద్యములో నట్లులేదు గనుక తప్పు' అనిరి.

వెంటనే కవులు రఘువంశము రెండవ సర్గలోని మొదటి శ్లోకము చదివి 'రెండూ ఉపజాతులే' అనుచు అనన్తరోదీరిత లక్ష్మభాజౌ పాదౌ యదీయా ఉపజాతయస్తాః' అని మల్లినాథసూరి వ్యాఖ్యానపఙ్క్తి నుదాహరించిరి. దానితో శాస్త్రి నిరుత్తరులై రెండవ దోష మెత్తుకొనబోయెను. 'ముందు ఇందులో మీకు ఓటమియును ఒప్పుకోండి' అని సభ్యులు కేకలువేసి చప్పట్లు కొట్టిరి. ఆయన రెండవ దోషమున్నదన్న పద్యమిది.

'ఈ నా పుత్రి వొసగెద నమూనాకృతి
భాసమాన యోగి భార్యగ ని
ద్దాని దగనేలు కొమ్మని పీవికి
నర్థించు మేట తెల్లముగాగన్'

ఈ పద్యము సీతపెండ్లికేకాక ఎవరి పెండ్లికైనను అన్వయించును గనుక వర్ణ్యము తప్పినది అని శ్రీ శాస్త్రి వాదము.

కవు లప్పుడా పద్యమునకు సీతా వివాహమునకే అన్వయించున ట్లర్థము చెప్పగా, విని సంతోషించి సభలోని పండితులైన నరసింహశాస్త్రి, రామశాస్త్రిగారలు ఇట్లాక్షేపణలు చేయరాదని శ్రీ వెంకటరామ శాస్త్రికి చెప్పి సర్దివేయ జూచిరి. ఆయన వినక 'ఇది క్లిష్టాన్వయము, దీనిని బుధు లొప్పుదురా.' అనుచు ఖండనము ఎదిరించెను

అప్పుడు రామశాస్త్రి మండిపడి 'అవధాన పద్యములో క్లిష్టతాదోష మెన్నుచున్నావు. నీ వెప్పుడైనా పద్యముచెప్పి ఎరుగుదువా?' అని అడుగగా ఆయన తా నెప్పుడో చెప్పిన పద్యము చదివెను. అందులో 'వర్షిష్యద్వృద్ధిం' అని ఉన్నది.

అది విని వెంటనే రామశాస్త్రి 'వర్షిష్య ద్వృద్ధిం, అన్నపదము శబ్దశాస్త్ర విరుద్ధము. మా బోంట్లము చెవులు మూసికొనవలెను' అనిరి. నరసింహశాస్త్రి ఇత్యాది పండితులును రామశాస్త్రినే సమర్థించిరి. దానిలో సభ్యులు 'వహ్వా, వహ్వా' అని కవులను ప్రశంసించుచు చప్పట్లు కొట్టిరి.

అంతట అవధానపూర్తి సభ జరిగినది. ఒకరు పద్యములు తలక్రిందులుగా అప్పజెప్పుమనిరి. ఒకరు వ్యాకరణము మీరారే చెప్పుడని శ్రీ వెంకట శాస్త్రిని, ఇంకొకరు శ్రీ తిరుపతిని అడిగిరి. ఈ విధముగా ఆ మహాసభలోని సభ్యులలో ఎవరికేమి కష్టమని స్ఫురించెనో, ఆ సద్వంతులెల్ల నడిగిరి, అందరికి కవులు సమ్మగా సమాధానములు చెప్పిరి. సభ జరిగిన పాఠశాలా భవనము పాలసముద్రమునవలె ఆనందముతో పొంగినది. అద్భుతమని అందరు ప్రశంసించిరి.

కాకినాడ పౌరులు నాలుగు మాటపదార్లు జోడు శాలువలు రెండు చాపులు సమర్పించి, అత్తరు తాంబూలము లిచ్చి మ్రొక్కిరి. తాము పుట్టి బుద్ధి ఎరిగిన తర్వాత ఇట్టి కవీశ్వరులను చూడలేదని బహువిధముల నగ్గించుచు పుర్రప్రము ఖులు ఉపన్యాసములు చేసిరి. కవులను హారాదులతో నలంకరించి అశ్వశకటముపై నెక్కించి మేళతాళములతో మారేగించిరి. అది 1891 సం.ము; అప్పటికి మోటారులు లేవని నేటి పాఠకులు గుర్తించుకొనవలెను.

ఇంత ఘనసమ్మానముపొంది మరికొన్ని అవధానములుచేసి బ్రహ్మగురుని యొద్దకువచ్చి కవులు మ్రొక్కగా గురువు లానందముతో నాశీర్వదించిరి.

శ్రీ తిరుపతి వెంకటేశ్వరులకు కాకినాడలో నంత గౌరవము జరిగినది. కాని అప్పటికి నాలుగైదేళ్ల క్రిందట ఆ కాకినాడకే వెంకటశాస్త్రి మేఘ సందేశము అధ్యయనము చేయుటకు పోగా, వారములు కుదరక కాటవరమను పల్లెకు చేరవలసిన వాడయెను. కాలము కావించు చమత్కార మీ విధముగా నుండును!

కాకినాడ శతావధానమైన తర్వాత కోనసీమ అగ్రహారములలో ఎన్నో అవధానములు చేసిరి. అమలాపురములో అష్టావధాన శతావధానములు కాకినాడలో నంతగా వైభవముగా జరిగినవి. ఆ పిమ్మట వ్యాకరణ మహాభాష్యాధ్యయన మారంభమైనది.

ద్రవ్యార్జనకై ఏలూరు వెళ్లి అవధానముచేసి బందరు వెళ్లిరి. బందరులో వారికి అమితధనలాభముతోపాటు గౌరవాదులును చేకూరినవి. విందులు, సభలు, గానములు, నాటకములు పాటిలేకుండ పోయినవి. అక్కడ అష్టావధానము వ్యస్తాక్షరిలో రెండు భాషల పదము లిచ్చిరి. అక్కడ పిడ్డివి. ఎడ్డి అను హూణుడు ముగ్ధుడై ఆ సంవత్సరము డిసెంబరులో అడయారులో జరుగు థియొసాఫికల్ కన్వెన్షను సభకు రమ్మని యాహ్వానించెను.

అది 1893 డిసెంబరు. ఆ సభకు అనిబెసెంటమ్మ, అనేకదేశములనుండి ప్రతినిధులు వచ్చిరి. వారి సమక్షములో కవులు చేసిన అష్టావధానమునకు అందరు ముగ్ధులైరి. బెసెంటమ్మ మాటపదార్లిచ్చి అభినందనపత్రికకూడ నిచ్చినది. చెన్నపట్టణపౌరులుకూడ నెంతో సమ్మానించిరి.

నెల్లూరులో అష్టావధానము విశేషనియమములతో జరిగినది. పద్యము అక్షరము ఒక్కటొక్కటే చెప్పవలెను. అవధానపూర్తికి ఆనందించి

'బాలసరస్వతి' బిరుదమిచ్చి వీరులతో ఘనముగా సమ్మానించిరి.

పిఠాపురము, బెజవాడ, విజయనగరము, హైదరాబాదు, గుంటూరు ఇత్యాది పట్టణములం దంతటను అవధానములు, సభలు జరిగెను. గుంటూరు సభలో, 1911 సం.లో ఆగస్టుమాసమని తోచును, శ్రీ కొప్పరపుకవుల అభిమానులు లేవదీసిన కుర్చీ తగాదాతో, అప్పటికే కుములుచున్న అగ్గివలెనున్న వైదికనియోగి స్పర్ధలు మంటలుగా ప్రజ్వరిల్లినవి. ఏది ఎట్లున్నను, దానితో అటు కొప్పరపువారికిని, ఇటు తిరుపతి వెంకటేశ్వరులకును సభలు, సమ్మానములు అశ్రుతపూర్వముగా సాగినవి. పట్టణములలోనేగాక పల్లెలలోగూడ శ్రీ తిరుపతి వెంకటేశ్వరులు సభలు అవధానములు చేసిరి.

ఒక్కవిశేషము మాత్రమున్నది. శ్రీ తిరుపతి వెంకటేశ్వరు లెన్నడును నియోగులను దూషింపలేదు. అందువల్లనే వారియందు కేవల శాఖాభిమానదోష దూషితులుకాని నియోగులందరు గౌరవాభిమానములు చూపుచుండిరి. శ్రీ తిరుపతిశాస్త్రిని ఆస్థానకవిగా నుంచుకొని అసమానాదరాభిమానములు ప్రదర్శించిన పోలవరము జమీందారుగారు నియోగి ప్రభువులు. వారి శిష్యులలో అగ్రగణ్యులై, శ్రీ వెంకటశాస్త్రిగారికి ఆమరణము జరిగిన మహాసమ్మానములకు ఆధ్వర్యము వహించిన శ్రీ పింగళి లక్ష్మీకాంతము, శ్రీ కాటూరి వెంకటేశ్వరరావులు నియోగులే యని గమనింపవలెను.

కవుల తగాదాల పిమ్మట పల్లెటూళ్లలో జరిగిన అవధానములు సమ్మానములలోనెల్ల అగ్రగణ్యమైనది వేమవరాగ్రహార శతావధానము. దాని వైభవము మహానగరముల సభలను మించిపోయినది. కవులను బ్రహ్మరథముపట్టి ఊరేగించిరి. కంకణ ప్రదానాదులతో గౌరవించిరి. ఆ సమయములో జరిగిన అన్నప్రదానము తిరుపతి వెంకటేశ్వరులకే ఆశ్చర్యమునిచ్చినది.

అశ్వమేధంబొ రాజసూయంబొ సత్ర
యాగమో వాగ్లసవధాన మలవరించిరి

అని ప్రశంసించిరి. అప్పటికే తిరుపతి వెంకటేశ్వరులకు వయస్సు మీరుచున్నది. కావున నవధానారంభములో శ్రీ వెంకటశాస్త్రి కాత్యాయనీదేవి నిట్లు ప్రార్థించెను.

'గిరగిర గిర్రగిర్ర గిర
గిర్గిరగిర్గిర గిర్రుగిర్రుగా
దిరిగెడి శీర్ష, మేగతిని దేవి,
వధాన మొనర్ప వేర్తునం
చరయక నీ కటాక్షమది
యాదరు వుండుట జేసి సాహస
స్ఫురణకు బూనినాడ

గ్రస హింపిరివో భరియింపు మింపుగన్.'

ఆ యగ్రహారములో జరిగిన మర్యాదలకు ఆనందపరవశులై వెళ్లుచు, దారిలో శ్రీ వెంకటశాస్త్రి చెప్పిన పద్యములలో నొకటి :

'ఎక్కించితివిగదా యేగుచో మేనాల
పర్వతస్సుమవృష్టి సంకులముగ
బట్టించితివిగదా బ్రహ్మరథముగూడ
స్వస్తివాచన పురస్సరము గాగ
గర్పించితివిగదా గాఢోత్సవమ్ముల
వారాంగనా కదంబముల తోడ
దార్పించితివిగదా తలలపై బాద ర
జంబు నా బాలవృద్ధంబుగాగ
నుదురభిమానగ్రహావేశధూమధూపి
తాప్రయోజక గర్తపురాంతర స్థి
తాత్మ పద్ధతి పక్షానుయాయి సుజన
సంకలిత నిత్యమూర్తు, ఆననపు జర్ర !'

---

# కంజజతత్త్వభంజనము

శ్రీ నిడుదవోలు వెంకటరావు

ఈనాడు మన ప్రాచీనాంధ్ర సాహిత్యాన్ని కేవలమూ సారస్వత విమర్శక దృష్టితోడనే పరిశీలించుచున్నాము. ఈ పద్ధతి పాశ్చాత్య విమర్శన పథకాన్ని అనుసరించినది. మత సంప్రదాయములు ఆధ్యాత్మికత ప్రాధాన్యం వహించని ఆ విమర్శన మూలంగా మనము మన సాహిత్యంతో పైపై మెఱుగులు మాత్రమే చూడగలుగుదుముగాని అందలి గంభీరమైన—అంతరార్థాన్ని ఏ మాత్రమూ అవగాహన చేసికోలేము. తెలుగున మత, సాహిత్యాలు రెండు అవినాభావ సంబంధము గలవి.

ఆంధ్రవాఙ్మయంలో 'శివకవి యుగము' అన్నది వీరశైవమత ప్రాధాన్యములైన రచనల మూలముననే ప్రత్యేకత వహించినదనీ, అది మతసంప్రదాయసిద్ధమైనదనీ విమర్శకులకు తెలిసిన విషయమే ఆనాడు శివకవుల కృతులు వస్తుతః శైవమతప్రచారకములైనను, లోకోత్తరమైన కావ్యకళ వానియందుండుట చేత మతప్రాధాన్యములేని యీనాడు, సాహిత్యమునందవి యొక విశిష్టస్థానమాక్రమించినవి. కాబట్టి శివకవి కృతులయందు మతము సాహిత్యము రెండును క్షీరనీర న్యాయమున సమ్మేళనము పొందినవని మనము గ్రహింపవలెను.

ఈ సమ్మేళనమువలన ఆ కృతుల విమర్శనమును మనము కేవలమూ సాహిత్య దృష్టితోడనేకాక మతసాంప్రదాయిక దృష్టితోడను పరిశీలించి చేయవలసిన యావశ్యకత యున్నది. అట్లయినగాని ఆయా కవుల కవితా తత్త్వము మనకర్థముకాదు.

శివకవులలో పాల్కురికి సోమనాథుని బసవపురాణ పండితారాధ్య చరిత్రల విషయమున వివాదము లేదుగాని నన్నెచోడని కుమార సంభవ విషయమున నింతవఱకు విమర్శనలు సాహిత్య దృష్టితోనే సాగినవి గాని మతసాంప్రదాయిక దృష్టితో జరుగనే లేదు.

కుమార సంభవ కావ్య విశిష్టతను గ్రహించుటకు మత సంప్రదాయ దృష్టికూడ యావశ్యకమని నిరూపించుటకై నేను 1969 ఏప్రియలు భారతిలో 'నన్నెచోడకవి శైవ సంప్రదాయము' అన్న వ్యాసము ప్రకటించాను.

ఇంతేకాదు. ఇంతవఱకూ సాహిత్యదృష్టితోనూ, చారిత్రక దృష్టితోనూ, పరిశీలితమై, అరవైయేండ్లనుండి, ఆంధ్రసాహిత్యప్రపంచంలో సంచలనం కలిగిస్తూన్న నన్నెచోడకవి కాలనిర్ణయ వివాదానికి, ఈ మత సంప్రదాయదృష్టి పరిష్కారమార్గము సూచించినదన్న భావనతోనుకూడా దీనిని లోకమునకు వెల్లడించాను.

నన్నెచోడని కాలనిర్ణయ విషయంలో, ఇదివఱకెవ్వరూ చూపని, ఒక క్రొత్త అంశాన్ని తెలియపరచడమువల్ల, ఈ వ్యాసము సారస్వత విమర్శకులకు ముఖ్యముగా నన్నెచోడనిగూర్చి పరిశ్రమ చేసిన విద్వాంసులను తప్పక ఆకర్షిస్తుందని, దీనిపై తమ అభిప్రాయాలను వ్యక్తపరుస్తారని ఆశించాను. అట్టిదేమీ ఇంతవరకు రాలేదు సరికదా, అందుకు వ్యతిరిక్తంగా 1969 నవంబరు 'భారతి'లో శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారి 'నన్ను గుఱించిన నిడుదవోలువారి చెనకు' అన్నవ్యాసం వచ్చినది.

వ్యాసముయొక్క శీర్షిక ఏలాగున్నప్పటికీ— వ్యాసంలో నేను పైని సూచించిన నన్నెచోడని కాలనిర్ణయ పరిష్కారము సంగతిగాని—మత సంప్రదాయ దృష్టి ప్రమేయముగాని కలికంలోకైనా కానరాలేదు. ఆపైని నేను 'యథాస్థానములనుగూడ పరిశీలింపక విమర్శ' చేయుదునని, వెనుకముందులు చూడనని

'నా పరిశ్రమ విమర్శ వినోదము మాత్రమే' అని కేవలమూ వ్యక్తిగతమైన లవహేళనలతో ఆ వ్యాసము సాగినది.

నా నలభైయేడేండ్ల 'భారతి' పరిచయములో నిట్టి వ్యాసము వచ్చుట కిది రెండవది. క్రీ. శ. 1964 జూలై భారతిలో వేదము వెంకటరాయ శాస్త్రిగారు వారి 'నన్నెచోడుని కవిత్వమును'గూర్చిన నా విమర్శపై విమర్శ ప్రకటించారు. అప్పుడు భారతి పత్రికాధిపతులు దానికి ప్రతివిమర్శ వ్రాయవలెనని కోరినను అనేక నూతన విషయాలు, లోకమునకు వెల్లడించవలసి యున్నప్పుడిట్టి చర్చల మూలమున అంతరాయము కలుగునని విన్నవించాను. సహృదయత్వంతో వారంగీకరించారు.

అనంత కృష్ణశర్మగారి వ్యాసము నా సాహిత్య గౌరవమునకు! పరిశ్రమకు భంగము కలిగించు చుండుటచేత దానికి ప్రత్యుత్తరము వ్రాయవలసిన స్థితి తప్పనిసరిగా ఏర్పడినది.

సందర్భాన్ని పురస్కరించుకొని, వ్యక్తిగతంగా నా విషయాలు కొన్ని యిందులో ప్రసక్తము గాక తప్పలేదు. ఏమి చేయను?

## కాశ్మీరుడు-ఆత్మేశుడు

ఈ పాఠమునుగూర్చి అనంతకృష్ణశర్మ గారిట్లు వ్రాసినారు.

'......నిడుదవోలువారు 'వ్రాతప్రతిలో కాశ్మీరుడను పాఠము లేదు అచట నున్నది ఆత్మేశుడనునది (భా. పు. 57) అని వ్రాసినారు. వారే వావిళ్ళవారి రెండవ ముద్రణములో 'పాఠభేదములు' అనుశీర్షిక క్రింద 'గౌరి-కశ్మీరు గౌరికాత్మేశు' అను వివరణ చూసినారు. కాని అది వ్రాతప్రతిలోని పాఠముగా సూచించలేదు......ఇంక వావిళ్ళవారు చెప్పు కొన్న సాంతప్రాతప్రతిలో ఏమున్నా, ఏమిలేకున్నా ఈ ఆత్మేశు పాఠము మాత్రము లేదని నిశ్చయముగా చెప్పవచ్చును. వారి రెండు ముద్రణములలో 'కాశ్మీరు' అనునదే కానవచ్చుచున్నది గనుక. అందువల్ల 'ఆత్మేశు' అనునది నిడుదవోలువారికి తోచిన పాఠమే గాని చూచినది గాదనుట నిశ్చయము' (భార. పుటలు 70—71). ఈ సందర్భమున వారు పేర్కొన్న ముద్రణములనుగూర్చి తెలియజేయుట యావశ్యకముగాన తెలుపుచున్నను.

## వావిళ్ల ముద్రణములు

పై వాక్యములనుబట్టి నేను వ్రాతప్రతిలో 'ఆత్మేశు'డను పాఠము చూడకుండగనే 'తోచినది' వ్రాసి ప్రకటించినానని గదా వారి యభిప్రాయము. ఇదియెంత అసంబద్ధము—అప్రామాణికమో మొదట వివరించుచున్నాను.

క్రీ. శ. 1944 జూలై నెలలో నేను మద్రాసు వచ్చినది మొదలు శ్రీ వావిళ్ల వేంకటేశ్వర శాస్త్రులవారు క్రీ. శ. 1955 లో కీర్తిశేషులగు వరకు వావిళ్ల సంస్థతో నాకుగల పరిచయము, అందత్యోగినదే—ప్రాచీన నవీన గ్రంథప్రకటనకు ప్రోత్సహించుట, గ్రంథములకు పీఠికలు వ్రాయుటయే నా పని—ఈ విషయమును కీ. శే. శ్రీ శ్రీవాత్సవ యిప్పటి కెనిమిదియేండ్లక్రిందట[1] నన్నుగూర్చి వ్రాయుచు నిట్లు తెలిపినారు.

'నన్నెచోడుని కుమారసంభవం మొదలు నవీనకవి గురుజాడ అప్పారాయకవి ముత్యాల సరముల వరకు అసంఖ్యాకమైన కావ్యములను వావిళ్లవారి చేత ప్రకటింపజేసియున్నారు'.

గ్రంథములు ప్రకటింపజేయుటయేగాక కొన్నింటికి పీఠికలు వ్రాసియున్నాను. సాధారణముగా ప్రాచీన గ్రంథమేదియైనా వారు పూర్తిగ ముద్రించి పీఠికకొఱకు మాత్రమే అచ్చుప్రతిని పంపెడువారు. నేను పీఠిక వ్రాసి యిచ్చిన తరువాత దానితో ముద్రించెడివారు. నా సంబంధ మా వావిళ్ల ముద్రణలతో అంతవఱకే—కాని - గ్రంథమూలములోని విషయములకుగాని గ్రంథాంతమున చేర్చెడు పాఠ

1. ఆంధ్రప్రభ—ప్లవ సంవత్సరాది పత్రిక. 'ప్లవ సంవత్సర సమ్మానితులైన కళాకారులు'.

భేదాది వివరములకుగాని నాకెంత మాత్రమూ సంబంధము లేదు. ఈ సంగతి ఆ సన్నివేశంలో సంబంధమున్న అప్పటి పండితుల కందఱకు తెలిసినదే. ఇంతకూ, వావిళ్లవారి నా కుమారసంభవ పీఠికలో—'పాఠభేద విమర్శనము' అని శీర్షికగాని, పాఠభేదముల ప్రస్తావనగాని లేదే! పీఠిక వ్రాసినవాడను కాబట్టి పాఠభేదములను నేనే సమకూర్చినాడనన్న అపోహతో అనంతకృష్ణశర్మగారు వ్రాసినారు—అంతే.

వారింతటితో వాగక తిరిగి 73 వ పుటలో నిట్లు వ్రాసినారు.

'1953 లో వావిళ్లవారు వెలయించిన రెండవ ముద్రణమునగూడ కోరాడవారి పరిష్కరణము నుపయోగించుకొన్నట్లు తోపదు. దానికి విపులమైన పీఠిక, దాని అనుబంధము పాఠభేదములను చేకూర్చిన విదుషీవారుగాని కోరాడవారిని స్మరించనైనను లేదు. అది ప్రామాణిక పరిశోధన పద్ధతిగాదని వ్రాయనక్కరలేదు.'

ముందు వ్రాసినట్లు, పాఠభేదములను నేను చేకూర్చనపుడు—ఆ యనుబంధముతో నాకు సంబంధమే లేనప్పుడు కోరాడవారిని నేను స్మరింపవలసిన యావశ్యకతయేమో నాకు బోధపడుటలేదు. ఈ సందర్భమున కోరాడవారిని స్మరింపవలసినవారు గ్రంథ ప్రకటన కర్తలైన వావిళ్లవారుగాని నేనుకాదు. వావిళ్లవారు ప్రచురణ కర్తలేగాని పరిశోధకులు కారుగదా!

## మద్రాసు విశ్వవిద్యాలయ ముద్రణము

అనంతకృష్ణశర్మగారు— పై ముద్రణమును ప్రశంసించుచు నిట్లు రెండు తడవలు వ్రాసియున్నారు.

'...మానవల్లివారి మొదటి ప్రచురణమునందును, దానిని ఎంతో పరిష్కరించి మదరాసు విశ్వవిద్యాలయముద్వారా శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారు ప్రకటించిన ప్రతియందును ఆ పాఠ మట్లే యున్నది' (పుట 70)

'ఇప్పటికి శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారి పరిష్కరణమే మూలప్రతిని పరిశీలించి ప్రామాణికముగా చేసినది.' (పుట 73)

మద్రాసు విశ్వవిద్యాలయ ముద్రణ ముఖపత్రమున స్పష్టముగా

సంపాదకులు
కోరాడ రామకృష్ణయ్య ఎమ్. ఏ.
(కీ. శే.) శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రి
తెలుగుశాఖ
ప్రాచ్యపరిశోధన సంస్థ
మద్రాసు విశ్వవిద్యాలయము
మద్రాసు
1948

అని—శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రులుగారి పేరును కలిసి యుండగా—ఒక్క రామకృష్ణయ్యగారే 'దానిని ఎంతో పరిష్కరించి' ప్రకటించిరని అనంతకృష్ణశర్మగారెట్లు వ్రాసిరో దురూహ్యముగా నున్నది. ఇక విశ్వవిద్యాలయ ముద్రణ మెంత ప్రామాణికమో, ఈ క్రింది విషయమునుబట్టి తెలియగలదు.

ఈ వ్యాసమునందేగాక — ఇప్పటికి ఇరువదేండ్ల క్రిందట తే 13-4-1950 దిని మదరాసు ఆకాశవాణి కేంద్రముద్వారా, నా తెలుగు కవుల చరిత్రను సమీక్షించుచు శర్మగారు చేసిన ప్రసంగమున కూడ నేను కోరాడవారిని కృతజ్ఞతతో స్మరింపలేదని ప్రకటించినారు. అనగా—కోరాడవారికి నాకుగల పరిచయముగాని – అథవా—మదరాసు విశ్వవిద్యాలయమున నా యునికిగాని శర్మగారెఱుగరన్నమాట! ఆ విషయము కొంచెము వారికి జ్ఞప్తిచేసినట్లయినే—వారి వ్రాతలెంత నిరాధారములో లోకమునకు తెలియగలదు.

నేను క్రీ. శ. 1941—43 ప్రాంతములలో శ్రీ పిఠాపురము మహారాజావారి ఆదరణమున పిఠాపురములో శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటు కార్యస్థానమున పండితుడనుగా నుండేవాడను. నిఘంటు కార్యస్థానమున తంజావూరిలోని కుమారసంభవ వ్రాతప్రతి ననుసరించి ప్రామాణికమైన వ్రాతప్రతి యుండెడిది. అది కీ. శే. కొత్తపల్లి సూర్యారావుగారు స్వయముగా తంజావూరు వెళ్లి వ్రాసినది. కుమారసంభవమునుగూర్చి ప్రథమముగా పరిశోధన గావించిన కీర్తిశేషులు వడకుదిటి వీరరాజాగారి పరిశ్రమకు ఈ ప్రతియే మూలము.

కోరాడవారు లక్ష్మీపతిశాస్త్రిగారి యనంతరము కుమారసంభవము ముద్రణ ప్రారంభించినారని తెలిసి, వారికి జూలై 1943 లో—కుమారసంభవ పరిష్కరణము చాలా బాధ్యత గలదని—అందుచే పాఠ నిర్ణయ విషయమున జాగరూకత వహింపవలెనని నాకుగల పరిచయమును పురస్కరించుకొని వ్రాసితిని. దానికి వారు తే 10—8—1943 దిని యిట్లు జవాబు వ్రాసినారు.

'Now that the University has already committed itself to its printing, I am thinking of getting on with it some how or other and see the end of it As you say it is a heavy responsibility and I feel it too. I wrote to you for help and since I did not get a reply from you I have been thinking of other sources from which help may be forthcoming.

Any way I wish we discuss this point in detail. Will it be possible for you to get leave and come over here? Does the Parishat possess a copy of కుమా. సం. Mr. Surya Rao seems to have made a copy at Tanjore. How did you arrive at your readings and how could you say any thing about Mr. Sastry's readings. If you can come here we can talk over this I shall send trainages if you find it convenient."

దీనికి నేను మదరాసు రాజాలనని వ్రాసితిని. అంతేకాక పాఠనిర్ణయమునుగూర్చి సహాయము చేయుటకు వీలుకాదని తెలిపితిని. అప్పుడు వారు కీ. శే. ప్రభాకరశాస్త్రులవారిని కోరినారు. వారంగీకరించినారు.

విశ్వవిద్యాలయ ప్రచురణమున తంజావూరి నుండి పాఠములను సంగ్రహించి గ్రంథము వచ్చువేయుటకు ప్రతి తయారుచేసినది లక్ష్మీపతిశాస్త్రిగారేయని రామకృష్ణయ్యగారే విస్పష్టముగా నీ క్రింది విధమున నాంగ్లపీఠికలో తెలిపినారు.

"Mr. S. Lakshmipati Sastry who noted down the readings of the manuscript at Tanjore, prepared the text of the edition and started the work. It is unfortunate that he passed away in the year 1943 when the text was only half printed" (P VI)

తెలుగు పీఠికలో—

'తంజావూరినుండి యీ గ్రంథము ప్రతి యొకటి వ్రాయించి యూనివర్సిటీవారు తెప్పించినారు దానినిబట్టి యిచ్చట జూనియర్ లెక్చరర్గా నుండిన శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రిగారు గ్రంథమును పరిశీలించి యొక విమర్శనము ముందు ప్రకటించి తరువాత గ్రంథపరిష్కరణమునకు ముద్రణమునకు బూనుకొనినారు. కాని దైవవశముచే ముద్రణము పూర్తిగాక పూర్వమే వారు గతించుట తటస్థించినది. వారు గతించునప్పటి కేడాశ్వాసములుమాత్రమే ముద్రితములైనవి. తక్కిన యాశ్వాసములకు పాఠ నిర్ణయము కావలసియుండెను. (P.LIX)

సంపూర్ణమైన వ్యాఖ్య వ్రాయవలయునని తలంచిరికాని గ్రంథ ముద్రణము పూర్తికావచ్చిన సమయమునకు వ్రాయవచ్చునని కాబోలు వారు దానిని సిద్ధము చేసియుండలేదు. కావున మిగిలిన యెనిమిదాశ్వాసముల ముద్రణమును నేను సాగించవలసివచ్చినది.' (P.lix).

పై యాంధ్రాంగ్లపీఠికా వాక్యములు పరస్పర విరుద్ధములు. ఆంగ్లపీఠికలో—లక్ష్మీపతిశాస్త్రిగారు తంజావూరి పాఠములను గ్రంథమున చేర్చి—గ్రంథమంతటిని ముద్రణకు సిద్ధముచేసినారనియుండగా, తెలుగున ఆ విషయమేలేదు. అపైగా 'తక్కిన యెనిమిదాశ్వాసములకు పాఠ నిర్ణయము కావలసియుండెను'—అని యెట్లు వారు వ్రాసిరో అవగాహన యగుటలేదు.

విశ్వవిద్యాలయ నిబంధనల ననుసరించి వ్రాత ప్రతి గ్రంథమంతయు సంపూర్ణముగా పీఠికా వివరణాదులతోనున్నగాని గ్రంథముద్రణకే వారనుమతింపరు. పీఠికాదులు లేకపోయినను, గ్రంథమంతయు పూర్తిగా నుండినగాని వారంగీకరింపరు.

ఇట్టి సందర్భములో గ్రంథపరిష్కరణ, పాఠభేద నిర్ణయముచేసి ప్రామాణికము గావించినది కోరాడవారేయని అనంతకృష్ణశర్మగారెట్లు నిర్ణయించిరో, అంతకంటె అవగాహన యగుటలేదు. మూలగ్రంథమేగాని పీఠికాదులు చదువుట వారికి పరిపాటికాదు కాబోలు!

తే 10—8-1943 దిని రైలుఖర్చులు భరించి, నన్ను చెన్నపురికి రమ్మన్న కోరాడవారికి, నేను తే 5—7-1944 దిని మదరాసు విశ్వవిద్యాలయమున, తెలుగుశాఖలో సహోపన్యాసకుడనుగా నియుక్తుడనై ప్రవేశించిననాటినుండి అభిప్రాయము మారినది.

నేను ప్రవేశించునాటికి — కుమారసంభవము 8 వ ఆశ్వాసము ముద్రణ ప్రారంభమైనది. ప్రభాకరశాస్త్రులుగారు తిరుపతినుండి పాఠములు సరిచేసి ప్రూఫులు పంపుచుండెడివారు. వానిని మేము చదువుచుండెడివారము. నేనంతకుముందే దీనినిగూర్చి పరిశ్రమ చేసినవాడనగుటచే—'పాఠమిట్లుండవలెను. ప్రభాకరశాస్త్రిగారి పరిష్కరణ పాఠము సరియైనది' అని చెప్పుచుండేవాడను. 'ఇప్పుడు చర్చ చేయుట కవకాశములేదు. గ్రంథముద్రణము పూర్తికావలెను. నేను చూచెదను' అనేవారు. తక్కిన నాల్గాశ్వాసములు ముద్రితమై గ్రంథము పూర్తియగునప్పటికి నాల్గేండ్లు పట్టినది. ఈ నాల్గేండ్ల కాలములో నెన్నడు దీనినిగూర్చి చర్చించువారేకారు. ఇక పీఠిక, పాఠభేదములు, లఘువ్యాఖ్య, మూలకథ, వీనినిగూర్చి నాకేమియును తెలియనే తెలియదు. గ్రంథమంతయు పూర్తియైన తరువాత అధికారరీత్యా నాకొకప్రతి అందినపుడే దానిని చూచుట తటస్థించినది.

పార్వతీ పరమేశ్వరుల గజరూప క్రీడచే గణపతి జన్మించినాడని కుమార సంభవముననున్న విషయమునకు ప్రమాణముగా శైవాగమములలో నొకటియగు సుప్రభేదాగమమునుండి పంక్తులు నేను క్రీ.శ. 1939 లోనే ప్రకటింపగా, ఆ విషయమే పీఠికయందు సూచితము కాలేదు. ఇదొక్కటే కాదు. ఆ వ్యాసమందున్న పాఠభేదాది విషయములు, ముద్రాలంకారముమున్నగు రచనావిశేషములు ప్రథమముగా నేను తెలిపినవి పీఠికలో లేనేలేవు. ఇంతేకాదు పీఠిక చివర వారి వాక్యము లివి.

'ఈ గ్రంథభాగముద్రణము సందర్భమున ప్రూఫులు సరిచూచు విషయమున నాకెంతో తోడ్పడిన శ్రీ నిడుదవోలు వెంకటరావుగారి కెంతయు కృతజ్ఞుడను.'

ప్రూఫులు సరిచూచు సందర్భమున నన్నును ప్రభాకరశాస్త్రులవారివలె విశ్వవిద్యాలయమునకు సంబంధములేని వ్యక్తిగా రామకృష్ణయ్యగారు వ్రాయుట యెట్టిదో పాఠకు లూహింతురుగాక! అనగా నేను తెలుగుశాఖలో నప్పటికి నాల్గేండ్లకుపైగా సహోపన్యాసకుడనుగానున్న సంగతి వారు తెలుపుట కిష్టగించలేదు. కుమార సంభవ ప్రసక్తి వచ్చినదిగావున ఇంత తెలిపినందులకు పాఠకలోకమును మన్నింపగోరుచున్నాను.

## ఆత్మేశుడు

### వ్రాతప్రతిపాఠము (7—65)

"అందువల్ల 'ఆత్మేశు' అనునది నిడుదవోలు వారికి తోచిన పాఠమేగాని చూచినది గాదనుట నిశ్చయము" అని శర్మగారు పైని వ్రాయుటయేగాక, దీనినిగూర్చి యింకా యిట్లు ఈసడించినారు.

'ఈ ఆత్మేశుడను పాఠము నూహించుటకు ని. వే. గారి కాధారమైనది ఇదే పదమును నన్నెచోడుడు ఇంకొకచోటను ప్రయోగించియుండుట (9—48). ఇట్టిది వారు పట్టిపెల్లగించి పైకెత్తిన నన్నెచోడని కవితా మూలతత్త్వము!' (పుట 71).

కీర్తిశేషులుమానవల్లి, వేటూరి వారలతర్వాత-తాళపత్రగ్రంథములలో అవగా వ్రాతప్రతులలో నాకు

గల పరిచయమును అథవా, మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారముతోడను, తంజావూరు సరస్వతీ మహలు లిఖితపుస్తకభాండాగారముతోడను నాకుగల సంబంధమును ఒక్క అనంతకృష్ణశర్మగారు తప్ప తక్కిన యావదాంధ్రలోక మెఱుగును. అట్టి సందర్భములో నేను, వ్రాతప్రతిలో నట్లున్నదని వ్రాయుట అంధపర్మన న్యాయమగును. అప్పటికే వ్రాతప్రతిలో– కా'శ్మీ'ర, 'ఆత్మేశ' పదములలో—శ్మ, త్మ—యిట్లుగా వర్ణక్రమముండునో తెలుపుటకై— 'ఆత్మేశ'అను పదము నన్నెచోడుడు నేనొకచో ప్రయోగించినట్లు (9-48) చూపితిని.

వ్రాతప్రతులలోని వర్ణక్రమపాటిని గ్రహించక పోవుటనరేకనా, శర్మగారు నేనొకే పదము నన్నెచోడుని రెండుమాఱులు ప్రయోగించెనని చూపినవు డతని కవితాతత్త్వమును పట్టిపెల్లగించితినన్నారు. అనగా—ఒక కవి పలుమారు ప్రయోగించిన శబ్దములనుబట్టి– అతని కవితాతత్త్వము అవగాహనము చేసికోలేమన్నమాట. దీనిలోని సత్యాసత్యములను కవితా విమర్శన కళాకోవిదులైనవారు నిర్ణయించవలసినది.

నేనుదాహరణకై 'ఆత్మేశు'డు అను పాఠము నకు మఱియొక ప్రయోగము చూపితిని. పాపము! శర్మగారు కుమారసంభవమునందీ రెండుచోట్లనే యది యున్నదనుకొన్నారు. తక్కినచోట్లను దీనికి సంబంధించిన పదములున్నవి.

ఆత్మేశ్వరి—2—3.
ఆత్మేశు—5—61.
ఆత్మేశ్వరు—11-58.

ఇన్నిచోట్ల స్పష్టముగా 'త్మ' వ్రాతలలో నున్నది, 7-65 లో కా'త్మే' అనునది కొంత అస్పష్టముగా నుండుటచే–కవిగారు కాశ్మీరుడని దిద్ది ప్రకటించినారు. 9—56 లో 'కాశ్మీరవారి'అని కాశ్మీరశబ్ద మున్నది. అక్కడ స్పష్టముగా 'శ్మీ' ఉన్నది. 'ఆత్మేశ'పదము 7—65 లో కాక తక్కిన యన్నిస్థలములలోను వ్రాతలలో నొకేరీతిగా నుండుట చేత ప్రామాణికములైన పుస్తకలలో 'ఆత్మేశ' పాఠమే యున్నది. ఇట్టి పరిస్థితిలో 'ఆత్మేశు'డను పాఠము నాకు 'తోచినదా' లేక 'చూచినదో' ప్రాజ్ఞలోకము నిర్ణయింపగలదు.

కుంభజుడు—కంజజుడు

కుమార సంభవము (12—226) లో

'మ.........................కుం
భజతత్త్వజ్ఞుడు ప్రాజ్ఞ డింభవన పద్మకుందుడు ముకుందుడు' అన్నపాదము గలదు. ఇందు కుంభజతత్త్వజ్ఞుడు–అను పదమునకు 'కంజజతత్త్వజ్ఞుడు' అను సవరణ పాఠమును అకాడమీ ముద్రణము శ్రీ అనంతకృష్ణశర్మగారి సూచనగా నిచ్చినది. దానిపై నా వ్యాసమున—'కంజజ తత్త్వజ్ఞుడు' అన్నచో ముద్రిత పాఠమనుసరించి యతి తప్పినది'—అని విమర్శించితిని. దానిపై శర్మగారి వ్యాసమున వ్రాతప్రతిపాఠము ననుసరించి తాము కుంభజ అను దానిని 'కంజజ'గా సవరించితిమని, అది చూచుకొనకుండగనే, నా విమర్శన యున్నదని యేమేమో వ్రాసి 'కుంభజ' పాఠమునకు ననుకూలముగా 'భవసాగర కుంభజుడ'న్న కృతిపతి విశేషణము (4—112) నేను చూపగా—దానిని 'పృష్ఠతాడనాత్ దంతభంగః' అని అవహేళన చేసినారు. ఆపై కంజజ అను తమ సవరణపాఠము నిట్లు సమర్థించినారు.

'కంజజ' అనగా చతుర్ముఖ బ్రహ్మ. అతని తత్త్వము వేదాంతమునందలి పరమార్థము. దాని నెఱిగినవాడు జంగమమల్లికార్జునుడు ఇది నా సవరణయం దుద్దేశించిన యర్థము.' (పుట. 73.)

ఈ సందర్భమున శర్మగారి వ్రాతయంతయు ఖండనీయమే. వ్రాతప్రతిలో నేమున్నదో నేను చూచుట మాట యటుండనిచ్చి వారుకూడ చూడలేదనుట స్పష్టము. 'వ్రాతప్రతిలో ఈశ్వర పదాశకుండు అని యున్నదట' అని వ్రాయుటయే యిందుకు నిదర్శనము. ఇది యూనివర్సిటీ ప్రతి మాత్రమే

వారుమూలప్రతి వ్రాసినది. 'కవిగారు దానిని 'అసక్తుడు'గా సవరించుట సమంజసమే' అన్నారు శర్మగారు. అసలు వ్రాతప్రతిలో — 'సదాసక్తుండు' అను పాఠమూ లేదు; కవిగారు సవరింపనూ లేదు. తంజావూరి ప్రతిలోను, దాని ననుసరించి వ్రాయబడిన పూర్వోక్త ప్రతులలోను స్పష్టముగా 'సదాస' అని 'స' యే యున్నది. ఉన్నప్రకారము కవిగారు ముద్రించినారు యతిభంగముగా. అంతే.

ఇక 'ఆపదము యూనివర్సిటీ ప్రతిలో ఈశు పద సద్భక్తుండు అని ప్రకటితమై యతి భంగము తొలగించుకొన్నది. ఈ సవరింపు శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారే చేసినవారేమో కాని ఆ విషయము వారు సూచింపలేదు' అని తరువాతి వాక్యము — ఈశుపదసద్భక్తుడు అన్నపాఠము రామకృష్ణయ్యగారి సవరింపుకాదు. లక్ష్మీపతి శాస్త్రిగారి సవరింపు పాఠముగాదు. అది నిఘంటుకార్యస్థానమున వ్రాత ప్రతిలో నున్నది. ఈ ప్రతివ్రాసిన క్రొత్తపల్లి వారు—'కుంభజతత్త్వజ్ఞుడు ప్రాజ్ఞాదీశ్వర పదాసక్తుండు,' అను యతిభంగపాదమును గమనించి వ్రాతలో 'కుంభజ'అని 'భ' మొదట యతిస్థానమున స్పష్టముగానుండుటచూచి 'సక్తుండు'అను పదములో 'స'కు, 'క్తుండు' అనుదానికి మధ్య కొంచెమెడముండుట పరిశీలించి, 'సద్భక్తుండు' అని పాఠము వ్రాసినారు. 'సద్భక్తుండు' అనునపుడు ముందుగల 'ఈశ్వరపదాస'— అనుదానిని గణభంగము కాకుండ 'ఈశుపద'అని మార్చినారు.

లక్ష్మీపతిశాస్త్రిగారీ పాఠమును నిఘంటు కార్యాలయప్రతినుండియే గ్రహించి, విశ్వవిద్యాలయ ప్రతిలో చేర్చినారు. ఇదియొక్కటియే కాదు. లక్ష్మీపతి శాస్త్రిగారెన్నో పాఠములను నీ ప్రతినుండి గ్రహించినారు. వారు మదరాసు విశ్వవిద్యాలయమునకు వెళ్ళక పూర్వము సూర్యారాయాంధ్ర నిఘంటు కార్యస్థానమున వ్యవహర్త—అనగా మేనేజరుగా నుండేవారన్న మాట మనము మఱువరాదు.

'మూలప్రతిపాఠమును ఈశుపద సద్భక్తుండు' అని పాడుపుగా దిద్దుటన్న 'కుంభజ'అను పాదాది శబ్దమును—'కంజజ' అని కురుచగా సవరించుట మేలని నేను సూచించినదని శర్మగారు వ్రాతప్రతి పాఠానుకూలముగ—'భ' 'జ'గా దిద్దినారు సరే. అప్పుడు స్పష్టముగా వ్రాతప్రతిలో—కుం—అని యుండంగా కం—అని దిద్దుటకు కారణమేమి? 'కుంజజ'యంటే అర్థముకాదుగనుక. అందుచేత 'కంజజ' అని దిద్ది అర్థము సరిపెట్టినారు. అంతే! ఆ యర్థము గ్రంథ తత్త్వముతో నతికినదా లేదాఅని వారు గమనించి నట్లు లేదు.

## కంజజ తత్త్వ భంజనము

1. ఆరాధ్యశైవ సంప్రదాయము ననుసరించి కంజజుడైన చతుర్ముఖ బ్రహ్మకుగాని, బ్రహ్మప్రతిపాదిత వేదాంతమునకుగాని ఆదు స్థానమే లేదు. బ్రహ్మ, విష్ణువు, మహేంద్రుడు మొదలగు దేవతలు శివునికి నిత్యము సేవించి నమస్కరించు భక్తులు. కుమారసంభవ గ్రంథాదియందేయున్న 'శ్రీ వాణీంద్రాముకేంద్రార్చిత మకుటమణిశ్రేణి ధామాంఘ్రిపద్మజీవోద్యద్భక్తసరుండు'అన్న విశేషణమును చూచియు నిట్లు శర్మగారు వ్రాయుట వింత! ఆపైని—శివుని నమస్కార పూర్వకముగ సేవించు బ్రహ్మతత్త్వము నెరిగినవాడు జంగము మల్లికార్జును డనుట అంతకంటె వింత' కుమార సంభవ కృతిపతి జంగము మల్లికార్జునునకు, శ్రీశైల మల్లికార్జునునకు అభేదాధ్యవసాయముగనా. అప్పుడు సేవితుడైన శివుడు సేవించు బ్రహ్మ తత్త్వము నెఱుగవలెనని యర్థమా? గ్రంథము మొదలనేకాక మఱి రెండుచోట్ల వాణీంద్రాముకేంద్రార్చితా (1-72), హరివాణీంద్రామరేంద్రాసురగణఫణీంద్రా...(8-3) వాణీంద్రాచ్యుతేంద్ర గణేతతనుయశుం (8-46)లని యున్న వానికి సమన్వయ మెట్లో వారే తెలియజేయుదురుగాక.

2. బ్రహ్మ శివుని దక్షిణాంగమున జనించిన వాడు. శివప్రసాదమువలన సృష్టికర్తయైనాడు. ఈక్రింది కుమార సంభవమున నవతారిక 5 వ పద్యము చూడుడు.

ఉ. అమితరజోగుణ స్ఫురణ
నావహమై పరమేశు దక్షిణాం
గమున జనించి భక్తిఁ జిర
కాలము సద్విధిగొల్చి తత్ప్రసా
దమున నజాండభాండముని
తత్వ మువేదకళాగమాది వి
శ్వము సృజియించి పొల్చు నజు
వాగ్విభు సంస్తుతిచేసి సమ్మతిన్
అవతారికలోనేగాక — దక్షాధ్వరధ్వంసమున —
బ్రహ్మ విష్ణువు లిట్లనిరి.
ఏమాదిమూర్తి దక్షిణ
వామాంగములందు పుట్టి వారక జననో
ద్దామ పరిపాలనాది మ
హామహిమలు వొందఁగంటి మా శివుకరుణన్'
(కు. సం. 2—40)

3. ఆరాధ్య శైవమున బ్రహ్మకు స్థానము లేదు. కావుననే నన్నెచోడకవి కాళిదాస మూలమున ద్వితీయ సర్గలో 4. వ శ్లోకము మొదలు 15 వ శ్లోకము వరకుగల పదకొండు శ్లోకములలో నున్న బ్రహ్మస్తవమును పూర్తిగా పరిహరించి—'నానావిధిస్తుతిరవంబు లురియ' (4-8) అని యొక్క వాక్యముతో ముగించినాడు.

4. మన్మథ దహనానంతరమున రతి యగ్ని ప్రవేశముసేయ సమకట్టునపు డాకాశవాణి చెప్పినట్లు కాళిదాస మూలమున నీ క్రింది శ్లోకము గలదు.

'అభిలాష ముదీరితేంద్రియః
స్వసుతాయా మకరో త్ప్రజాపతిః
అథ తేన నిగృహ్య విక్రియా
మభిశప్తః ఫలమేత దన్వభూత్' (4. 41)

'ఇందు బ్రహ్మ తన్నింద్రియ వశునిచేసినందులకు కోపించి మన్మథునికి శాపమిచ్చెను. ఆ శాప ఫలముగా నేడు మన్మథుడు దగ్ధమయ్యెను' అను మూల భావమును పూర్తిగా నన్నెచోడుడు విడిచి పెట్టినాడు. ప్రథమముగా బ్రహ్మకు శాపము నిచ్చు శక్తి యున్నదని యారాధ్య శైవు లంగీకరింపరు గాన నాత డీ శ్లోకము పూర్తిగ విడుచుటకు కారణమైనది.

5. పార్వతీ పరమేశ్వర వివాహము పూర్తి కాగానే మన్మథుని పునర్జీవితుని చేయుటకు సమయమని దేవతలు శివు నారాధించిరి. అప్పుడు బ్రహ్మయు విష్ణువును శివుని పాదముల తలపైదాల్చినట్లు నన్నెచోడకవి యిట్లు తెలిపినాడు.

క. తనువుల ముత్యులకావలి
దనరఁగ శివుపాదయుగము తల విడికొని యా
వనజభవాచ్యుతు లొప్పిరి
కనుగొన చెందమ్మివిరులకాములపోలెన్.
(9—40)

ఇట్లు కథా సందర్భములందేగాక గ్రంథాది నుండి యంతమువఱకు బ్రహ్మ శివునికి భక్తుడైనట్లే యారాధ్యశైవసంప్రదాయానుసారముగా వర్ణింపబడియున్నది.

నన్నెచోడకవి గ్రంథముననేగాక యారాధ్య శైవ సాంప్రదాయిక గ్రంథములలో పై విషయమే ప్రతిపాదితమైనది.

6. పండితారాధ్యుని శివతత్త్వసారమున తొలి పద్యముననే

'శ్రీపతి వాక్పతి ముఖ్యామ
హాపురుషులు నెరగనోప రతివాఙ్మనస
వ్యాపారమైన నీ నిజ
రూపం బిట్టిదని నే నిరూపింతు శివా.'

అని యుండుటయేగాక గ్రంథమునందంతటను నీ విషయము ప్రతిపాదితమైనది.

'హరి సరసిజభవు లాదిగఁ
బరగుమునీంద్రులకు నెఱుఁగ భరమగు నీ ని
ర్భర భూరిమహిమ........... 6 ప.

'సరసిజభవ సరసిరుహో
దరులకు నటమీది మూడు దా నధికము.' 15 ప.

30 నుండి 66 వ పద్యమువఱకును అద్వైతమతఖండన మిందు గలదు.

> 'వనజావన వనజోదర
> వనజాదుల కెఱుగరాని శాశ్వత మహిముఁడు.'
> 451 ప.

7. పండితారాధ్య చరిత్రలో పాల్కురికి సోమనాథు డీ విషయమును మరీ విపులముగా దెలిపియున్నాడు.

మల్లికార్జున పండితుడు వెలనాటిచోడని సభలో బౌద్ధజైనచార్వాకాదిమతములతోపాటు — వేదాంతమతమును ఖండించియున్నాడు. ఇది 140 పంక్తులలో నున్నది.[2] అందే బ్రహ్మపంచముఖాసిర్భావము- శివుడు బ్రహ్మపంచశిరములలో నొక శిరమును ఖండించి చతుర్ముఖునిగా చేయుట (విరించి పంచమ శిరఃఖండనము) మున్నగు కథనమంతయు గలదు.[3] ఇందీ విషయము శ్రుతిస్మృతి పురాణేతిహాస ప్రమాణములతో నిర్ధారణ చేయబడియున్నది. విస్తరభీతిచే వివరింపలేదు.

## శ్రీపతి పండితుడు-బ్రహ్మవాద ఖండన

8. వీని యన్నింటికన్న మించినది శ్రీపతి పండితుని బ్రహ్మవాద ఖండన. పండితారాధ్యచరిత్రావతారికలో నిట్లు గలదు.

> 'కడునరిఁ యుత్పత్తికర్తవా బ్రహ్మ
> పడి బ్రహ్మ మను బ్రహ్మవాదుల ద్రుంచి
> హరభక్తి యుత్పత్తి కధిపతి వాగ
> జరగె దా దొల్లి శ్రీపతి పండితయ్య'

పండిత త్రయములో ప్రథముడైన శ్రీపతి పండితుడు సృష్టికర్త బ్రహ్మకాదు—శివుడేయని శివ మాహాత్మ్యమును ప్రతిష్ఠించిన మహనీయుడు. ఇతని కథ యిది.

శ్రీపతి పండితు డారాధ్య సంప్రదాయ ప్రవర్తకుడై విజయవాడలో శైవమత ప్రచారము చేయుచుండెను. ఒకనాడు కృష్ణానదిలో స్నానముచేసి వచ్చుచుండగా శివభక్తుడైన గొడగరి (గోదారి) శ్రీపతి పండితుని శివపూజకు[4] నాహ్వానించెను. ఆతడు గోదారివానియింట భోజనము చేసినందున బ్రాహ్మణు లందఱును నాతనిని వెలివేసిరి.

శ్రీపతి పండితుడును, శివుని మహత్త్వమును శివభక్తుల యాధిక్యమును నిరూపించుటకు బ్రాహ్మణులకేగాక, తక్కినవారికి ముఖ్యమగు అగ్నిహోత్రము నంతను సేకరించి తన యుత్తరీయము కొంగున దానిని కట్టి దానిని యింద్రకీల పర్వతమున నున్న శమీవృక్షమునకు (జమ్మిచెట్టు) వ్రేలడగట్టెను.[5]

విజయవాడలో అగ్నికరవైపోయనది. ప్రజలంతా తల్లడిల్లిపోయిరి. అగ్నిహోత్రములేక ఆహారము లభ్యముకాదు కాబట్టి బ్రాహ్మణులు, తక్కిన సమస్త వర్ణములవారు శ్రీపతి పండితుని శరణువొచ్చినారు. ఆతడు కరుణించి, ఏడు దినములైన వెనుక అగ్నిని విడిచిపెట్టినాడు. దానితో విజయవాడలోని ప్రజలెల్లరును శ్రీపతి పండితునికి శిష్యులై శైవమత

---

2. పండితారాధ్య చరిత్ర—వాదప్రకరణము. పుట 553 — 560.

3. ,, ,, 610 — 618.

4. ఆరాధ్యుల పరిభాషలో 'శివపూజకు' అనగా భోజనమునకు అని యర్థము.

5. ఈనాటికిని విజయవాడలో మల్లేశ్వరాలయంలో చెక్కుచెదరకుండాయున్న 11వ శతాబ్ది నాటి శిలాశాసనములో నీ విషయము నిలిచియున్నది.

> 'తతః శ్రీసంపతారాధ్యనామ్నా భక్తోత్తమేనచ
> శివభక్త ఏవ నూనం దేవర్షిభ్యోధిక ఇతి
> చీనాంబరేగ్నిం సంస్థాప్య :మీకోమలశాఖయా
> బద్ధే మల్లేశ్వరః ప్రీతః ప్రత్యక్షస్సమజాయత.'

మును స్వీకరించిరి. 6 దీనితో బ్రహ్మతత్త్వము, బ్రహ్మవాదము పూర్తిగ వరాస్తములైనవి.

పై యుపపత్తులచేత నన్నెచోడని కుమార సంభవమున — 'కంజజ' అని పాఠము కానబడుట కేమాత్రమూ ఆస్కారములేదని తెలియవలెను. శర్మగారి పాఠమున 'యతి' తప్పినదిఅని నేనెందులకు వ్రాసితినో ఇపుడు వారి కవగతమైనదనుకొందును. అయితే అప్పటి పాఠమేమి? అని ప్రశ్నింపవచ్చును. దానికి సమాధాన మిదిగో: వ్రాతలో—

కుం—'భజతత్త్వజ్ఞుఁడు ప్రాజ్ఞాఢీశ్వర పదా సక్తుఁడు' అనికదా యున్నది. అందుచేతనే యతి తప్పినదన్న వాదుకవచ్చినది. 'ఈశపద సక్తుఁడు' అన్న సవరణలో వ్రాతప్రతిలో స్పష్టముగా నున్న యక్షరములను మార్పుచేయవలసివచ్చినది. అనగా, కుం—'భజతత్త్వజ్ఞుఁడు ప్రాజ్ఞాఢీశ్వర ప పదా సక్తుఁడు' అను దానికి—భజతత్త్వజ్ఞుఁడు 'ప్రాజ్ఞాఢీశపద సక్తుఁడు—అని సవరణ పాఠము. ఇందు ఈశ్వర —'ఈశ'గా మారినది. పదా—'పద'గా మారినది—కాని పాఠమిది:

'కుంభజతత్త్వజ్ఞుఁడు ప్రాజ్ఞాఢీశ్వర సదా భక్తుఁడు' అనునది.

వ్రాతప్రతిలో 'ప' స్పష్టముగా నున్నది. ఇది వ్రాయసకాని పొరపాటు—'స'కు, 'ప' వ్రాసినాడు. ఈ 'ప' 'భ'కు బదులు వ్రాసినాడు. ఇదివరలో వారును—భక్తుఁడనియే యూహించిరిగాని 'సత్' చేర్చిరి. ఈ చిన్నమార్పువలన అట్టి చేర్పులు మార్పులు లేకుండ పాఠము సరిపోయినది.

'సదా' శబ్దముతో చేర్చి నన్నెచోడుడు కుమార సంభవమున సమాసములను వాడియున్నాడు.

'హృదయాహ్లాదము తోడఁబాయక సదానైక ప్రకారంబులన్.' (1-101)

'శరానందుండు.. సదానంద కందళిత హృదయారవిందుండగుచు' (4—8)

'సదామహేశ్వర తత్త్వవిష్కృతబుద్ధులు' (6—62)

...'తారకాంబర సదానందాత్మ దిక్కాలముల్' (12-224)

కాబట్టి 'ఈశ్వరసదాభక్తుఁడు' అనునదియే పాఠము. శర్మగారి తక్కిన పాఠవిమర్శన తరువాత.

## నన్నెచోడకవి ఆరాధ్యశైవము

ఈ వ్యాసమున నేను ప్రతిపాదించిన పై సిద్ధాంతమును పురస్కరించుకొని శర్మగారు రెండుమూడు చోట్ల 'వెనకి'వారు.

(1) 'నన్నెచోడునిది మల్లికార్జున పండితారాధ్యులు ప్రపంచించిన ఆరాధ్య వీరశైవమేయని సిద్ధాంతము చేసికొన్న నిడుదవోలువారు.' (పుట 70)

(2) 'ని. వే.గారి శైవ సిద్ధాంతవాదమునకిది తోడుపడినది.' (పుట 72)

(3) 'అతనిది సవైదికమైన వీరశైవ సంప్రదాయమని నిర్ణయించు ని. వేగారికిది.' (పుట 73)

వస్సుగూర్చియేగాక నన్నెచోడని కవితాతత్త్వమును గూర్చి యిట్లు సందేహించినారు.

---

6. ఈ శ్రీపతి పండితుని వంశమువారే కైలాసవాసి కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు. శ్రీపతి పండితునినుండి శ్రీ నాగేశ్వరరావుగారివరకు అవిచ్ఛిన్నముగా వచ్చుచున్న వంశవృక్షమును ఆంధ్రపత్రిక—నందన (1952) ఉగాదిసంచికలో మల్లికార్జున స్తవోదాహరణము, అను వ్యాసమున నిచ్చియున్నాను. బహుపురుషాంతముల వఱకు శ్రీపతి పండితుని వంశీయులు విజయవాడ వాస్తవ్యులే. నాగేశ్వరరావుగారు బందరు తాలూకా ఎలకుఱ్ఱు వాస్తవ్యులైనను విజయవాడయందు 'దుర్గా కళామందిరము' నిర్మించి, తమ పూర్వుల విజయవాడ నివాసమును స్థిరపఱిచినారు.

'నన్నెచోడని కవితామూలతత్త్వము శైవశాఖా భేదమైన ప్రతితంత్రమైనచో'' అని 71 పుటలో నున్నది.

పై వాక్యములు నన్నేకాదు, కుమార సంభవ ప్రథమ ద్వితీయభాగముద్రణలో (పీఠిక—1914) 6 పుటలు శైవశాఖాభేదములనుగూర్చి చర్చించిన సంపాదకీయులు మానవల్లివారిని తాకుచున్నవన్న సంగతి శ్రీ శర్మగారి కవగాహన కాలేనందులకు చింతిల్లుచున్నాను.

ప్రామాణికమైన గ్రంథస్థ విషయములతో సోపపత్తికముగా నన్నెచోడకవి కుమారసంభవమున ప్రతిపాదించినది ఆరాధ్యశైవమతమేనని నేను సిద్ధాంతముచేసి లోకమునకు వెల్లడించినాను.

అప్పుడు నేను ప్రతిపాదించిన సిద్ధాంతమును ఖండించి నన్నెచోడకవి శైవసంప్రదాయ మిది యని నిరూపించుట సరియైన పద్ధతి. లేదా ''నన్నెచోడకవి కవితామూలతత్త్వము శైవమత సంప్రదాయమునకు సంబంధించినదికాదు: ఆ కవితా మూలతత్త్వమిది'' అనియైనను వారు తెలుపవలసియుండెను. ప్రస్తుత వ్యాసమున నీ రెండు విషయములు కానరాలేదు. అట్లు ప్రకటింపనంతవరకును, శర్మగారి వ్యాసము 'అధికప్రసంగము', 'పన్యాకోపలిందని', 'పనిలేని పని' అని భావించుట జరుగునని యిందు మూలముగా తెలియజేయుచున్నాను.



**లేఖలు:**

# "అభినవ లీలావతి"

ఆర్యా!

ఇది లీలావతిని సంక్షిప్తపరచిన ఆంధ్రానువాదము. ఇందు పరికర్మాష్టకము, భిన్నజాతిచతుష్టయము, భిన్నపరికర్మాష్టకము, శూన్యపరికర్మాష్టకము, వ్యస్తవిధి, ఇష్టకర్మభేదములు, సంక్రమణసూత్రములు, వర్గకర్మస్వరూపము, త్రైరాశిక విధానము, భాండప్రతిభాండవిధానము, అను పది భాగములున్నవి.

పరికర్మాష్టకమున సంకలన, వ్యవకలన, వర్గ, వర్గమూల, గుణక, భాగ, ఘన, ఘనమూలము అను నెనిమిది రీతుల వివరములు ఉదాహరణము లున్నవి. భిన్నజాతి చతుష్టయమున భాగానుబంధ, స్వాంశానుబంధ, భాగాపహ, స్వాంశాపహములను నాలుగు విధములున్నవి. భిన్నపరికర్మాష్టకమున సంకలన, వ్యవకలన, గుణక, భాగాహార, వర్గ, వర్గమూల, ఘన, ఘనమూల, నికటవర్గమూల, నికటఘనమూలములను దశవిధ వివరములు ఉదాహరణములున్నవి.

ఇష్టకర్మభేదములందు దృశ్యజాతి, విశ్లేష జాతి, శ్లేషవిశ్లేషయుక్తి, క్రయవిక్రయ, భరతప్రశ్న లనునవి వివరింపబడినవి. సంక్రమణవిభాగమున ఆరుదెలుగుల సంక్రమణగుణకభేదములు, పదేను సంక్రమణభేదములు, వర్గకర్మభేదమున మూలజాతి విషయములు, త్రైరాశికవిభాగమున త్రైరాశిక గుణక భాగాహార సూత్రములు భాండప్రతిభాండభాగమున వస్తుసంహతివినిమయము వివరింపబడినవి.

గ్రంథమున యెడనెడ నుద్దేశవివరములు భాస్కరాచార్యుని యుదాహరణములు, ఒకచోట బోపదేవుని యుదాహరణము నున్నవి. శైలి ధారాళముగ నున్నది. అనువాదవిషయము మరియు శైలి దెలియుటకై రెండు పద్యములను మూలముతోసహా నుదాహరించుచున్నాను.

శ్లో॥ అయే బాలే! లీలావతి మతిమతి బ్రూహి సహితాన్
ద్విపంచ ద్వాత్రింశత్రినవతి శతాష్టాదశ దశ
శతోపేతా నేతానయుత వియుతాం స్వాపి వద మే
యది వ్యక్తే యుక్తివ్యవకలన మార్గేసి కుశలా!

మ॥ చెలికాడా! యతిభేదముల్ మనముతో
చింతించితేనిన్ దగన్
తెలియంబల్కుము రెండునై దురదముల్
దిక్కుల్ త్రినందాతులున్
గలయన్ సామజచంద్రులన్ గలుగునా
గాటంపు రాశిన్ త్వరన్
వెలిగాజేసి సుపూర్ణపూర్ణదిశలన్
విస్తారితాంకంబులన్.

శ్లో॥ బాలే బాలకురంగలోలనయనే
లీలావతి ప్రోచ్యతామ్
పంచత్ర్యేకమితా దివాకరగుణా
అంకాః కతిస్యుర్యది
రూపస్థాన విభాగఖండగుణనే
కల్యాసి కల్యాణిని
చ్ఛిన్నాస్తేన గుణేన తేన గుణితా
జాతాః కతిస్యుర్వదా!

మ॥ హితుడా! ఖండగుణాది భేదములు నీ
విచ్చన్ దెరంబేని సం
యుతమౌ పాయక రామచంద్రు లిను లా
హుకోణాలం బెంచి యా
తతసంఖ్యారాశిని రాశిహారకముచే
తన్ భక్తలబ్ధంబు నీ
వతివేగంబున దెల్పు సూత్రమహిత
వ్యాఖ్యానభేదంబులన్.

రచనయందు సామాన్య జాత్యుపజాతులేగాక వృత్తి, యుత్సాహ, దండకములుగూడ నుపయోగింపబడినవి. అనువాద స్వాతంత్ర్యమును, ఉపయోగించిన వృత్త వైవిధ్యమునుబట్టి చూడ దీనిపై పావులూరి గణితప్రభావము గనిపించును. ఇది గ్రంథ స్వరూపము.

దీని ప్రతి నాకొక మిత్రుడిచ్చినాడు. అది రద్దికాగితములచే కుట్టబడినది. గ్రంథము లోపలి పుటలందుగాని పై పొరటలందుగాని ఎక్కడ దానిని వ్రాసికొనిన వారి పేరుగాని రచయితపేరుగాని లేక అది దేనినిజూచి వ్రాసికొనిరో ఆ వివరముగాని వ్రాయబడలేదు. పైపుటయందుమాత్రము 'ఇందు లీలావతి గణితమునం దుండబడే దశవిధగణితములు......... అమనంతవర కక్షరములు గనిపించుచున్నవి. తక్కిన భాగమున సిరా వాలికి అక్షరములు పూర్తిగా మాసిపోయినవి. ఈ ప్రతిని పరిశీలించినపిమ్మట వివరములకై ఆంధ్రవాఙ్మయసూచిక పరిశీలింప అందు తడకమళ్ల కృష్ణారావుగారి పేర పద్యరూపమగు అభినవలీలావతియను గణితశాస్త్ర మొకటున్నది.

తడకమళ్ల నల్లగొండ జిల్లాయందలి గ్రామము. ఈ గ్రంథకర్త అచటివాడై యుండవచ్చును. లభించిన గ్రంథమునుబట్టి కవి వివరములేవి తెలిసికొనుటకు వీలులేకున్నది. అతని గురువుమాత్రము నారాయణస్వామియని తెలియుచున్నది. నాకు లభించిన ప్రతియందు గ్రంథపాతమేదియులేదుగాని అంతమున గద్యమేదియు లేకపోవుటవలన గ్రంథమేమైన యింక కొంత నుండునేమోనని యనుమానించుచున్నాను

నేడు మనకు రాష్ట్రముతోబాటు బోధనా భాషయు తెలుగగు సమయమాసన్నమైనది గనుక ఇట్టి శాస్త్రగ్రంథము లెందున్నను సంపాదించి వానిని చక్కగా పరిష్కరించి ప్రచురించుభారము సాహిత్య అకాడమీవంటి సంస్థలపై నెంతేని యున్నది

కపిలవాయి లింగమూర్తి

## కాప్యభిఖ్యా తయో రాసీత్

ఆర్యా!

ఉపమాచక్రవర్తియు కవికులగురువు నైన కాళిదాసుని అలంకార వైభవమును శ్రీ ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రిగారు అక్టోబరు భారతిలో చక్కగా వివరించినారు. వారికి నా హృదయ పూర్వక అభివందనములు.

రఘువంశమునందలి ప్రథమసర్గలోని 46వ శ్లోకమైన 'కాఽప్యభిఖ్యా తయో రాసీత్' అనుదానిలోని ఉపమానమును వివరించుచూ జ్యోతిశ్శాస్త్ర పరముగా కావ్యార్థ సూచకమైన ఒక విశేషము గలదని చెప్పినారు. అప్పట్టున 'శుక్రుడు సంతాన కారకుడనియు, అతని గృహమైన తులారాశిలోనున్న చిత్రా చంద్రులతో ఆ రాజదంపతులను పోల్చుటవలన ఆ దంపతుల కగు మనోరథ సాఫల్యమును మహాకవి సూచించి యున్నాడ'నియు అది జ్యోతిషికుల ప్రవచనమనియు సెలవిచ్చియున్నారు.

నాకు తెలిసి యున్నంతవరకు జ్యోతిష శాస్త్రములో శుక్రునకు సంతానకారకత్వమున్నట్లు కన్పడదు. శుక్రుని కారకత్వములు.—

సూ॥ 'కళత్ర కాముక గీత వేశ్యానృత్య మౌక్తికహార రథ తురంగ గోమేధిక కాంచన ధ్వజ పతాక శ్వేతచ్ఛత్రాది కారక శ్శుక్రః'

సంతాన కారకుడు గురుడు.

సూ॥ 'దేవబ్రాహ్మణభక్తి కీర్తి ధన గృహ కాంచన పుణ్య విద్యావాక భూసురాశీర్వాద వ్యాకరణ బంధుపుత్రమిత్రాది కారకో గురుః'

శ్లో॥ పంచమ స్యాధిపతినా
సంబంధో యది విద్యతే
పుత్రకారక జీవస్య
పుత్ర ప్రాబల్య మాదిశేత్॥

మున్నగునవికూడ సంతాన కారకుడు గురుడనియే సూచించును. శుక్రుడు సంతానకారకుడు అని ఎచ్చటనైనను నున్న ఈ వివరణలో మఱియొక సందేహము గోచరించును. చిత్త ద్విపాద నక్షత్రము 'హస్త చిత్తార్థం కన్యా' అనుటనుబట్టి చిత్త 2 పాదములు కన్యలోను మిగిలిన రెండుపాదములు తులలోను గలవు. చిత్రా చంద్రులతో ఆ రాజదంపతులను పోల్చినపుడు తులారాశిలోనున్న వారితో

పొల్చెనని ఏలగ్రొకొనవలెను. కన్యారాశిలోనున్న చిత్రా చంద్రులతోనవి ఏల యన్వయింపరాదు?

రాజదంపతుల మనోరథసాఫల్యము జ్యోతిశ్శాస్త్రము ప్రకారము మఱియొక రీతిగా చెప్ప వచ్చునేమో!

చిత్రా నక్షత్రములో గూడిన పున్నమగల మాసము చైత్రము. దీనియందు మన్మథుడు మకరందముగూడ నుండును. వసంత ఋతువులోనిది. చెట్లు ఆకులు గూడ చిగుర్చును ఈ మాసము వెనుకది ఫల్గుణీ నక్షత్రయుక్తమయిన పున్నమగల మాసము. ఫాల్గుణము. శిశిర ఋతువు లోనిది. ఆకులు మోడువారునది. తపస్సుయందు సాధు వయినది. వ్యాఖ్యానములో 'శిశిరాపగమే చైత్ర్యాం చిత్రా పూర్ణచన్ద్రమసోరివేత్యర్థః' అని యున్నది.

తపస్సు యందు సాధునయిన మాసము తదుపరి వచ్చు చైత్రమును సూచించుటలో ఎదర నందినీ ధేనువును సేవించు తపస్సును, తదుపరి మనోరథ సాఫల్యమును మహాకవి సూచించెనని యన్వయించవచ్చునేమో.

ఎం. శ్రీరామచంద్రమూర్తి.

# ఆముక్తమాల్యద-కర్తృత్వ నిర్ణయము

ఆర్యా!

'జూలై' భారతిలో శ్రీ నోరి నరసింహశాస్త్రి గారు 'ఆముక్తమాల్యద కర్తృత్వ నిర్ణయ' ప్రశంస ఎత్తిరి. ఇది యెంతయు శ్లాఘనీయము. కానీ వారు చూపిన ఉపపత్తులు సమంజసముగా లేవు. ఆముక్తమాల్యద 'నేను వ్రాసినానని' రాయలు చెప్పుచుండగా ఇంకొకరు ఆ విషయము తమ గ్రంథములో ప్రస్తావించ లేదనుట న్యాయముకాదు.

పారిజాతాపహరణము, మనుచరిత్ర మున్నగు గ్రంథములలో రాయల గ్రంథరచనా ప్రస్తావనలేదని శ్రీవారు అభిప్రాయపడుచున్నారు. లేనంతమాత్రాన రాయలు గ్రంథకర్త కాడని యెట్లనగలము?

ఆశ్వాసాంత పద్యములలో 'ఆముక్తమాల్యద'అని 5 సార్లు ఉచ్చరించుట ఆయన కర్తృత్వమునకు సందేహ మాపాదించుచున్నదనుట పొరపాటు. మనుచరిత్ర ఆశ్వాసాంతగద్యలతో 6 సార్లు పెద్దనామాత్యుడు ఇది........... పెద్దనార్య ప్రణీతంబని చెప్పియున్నాడు. ఈతని కర్తృత్వ విషయమునగూడ సందేహమును వెలిబుచ్చి మనుచరిత్రను భట్టుమూర్తి వ్రాసినాడనుట ఎంత హాస్యాస్పదమో, ఆముక్తమాల్యదను పెద్దన వ్రాసెననుట అటువంటిది. 'ఉన్నారి పొన్నారి చిలుత కూతలనాడు' అని చెప్పిన కవిసార్వభౌమునితో మొదలుపెట్టి కవిసమ్రాట్ విశ్వనాథవరకు, 'ఈ గ్రంథము నేను వ్రాసినానని పదేపదే' చెప్పుకొనుట అలవాటయినది.

మనుచరిత్రలోని 'రాయలవంశ వర్ణన' పద్యములే చిన్నమార్పులతో నున్నవని శాస్త్రిగారు వ్రాసేరు. ఉండవచ్చును. తన వంశగౌరవమును తానే చెప్పుకొనుట ఆత్మస్తుతిగా నుండునని భావించిన రాయలు, పెద్దనవ్రాసిన పద్యములనే తన గ్రంథమున చేర్చియుండును అని నా అభిప్రాయము.

మనుచరిత్రలోని పద్యముల కెన్నిటికో అనుకరణములు ఆముక్తలో కలవని అన్నారు. ఇది నిజమైనచో ఆముక్తకు పూర్వమే మనుచరిత్ర వ్రాయబడినదని గట్టిగా చెప్పవచ్చును. ఇక రామస్వామిని 'దాని తల్లిగ నల్లసాని పెదన చెప్పె 'ముదిమదిదప్పి' (ముసలితనములోననుట) ఆముక్తమాల్యద' అన్న అపవాదమునకు అస్కారములేదు. అనుకరించినంత మాత్రమున ఎవరి కర్తృత్వమును కాదవలేము. ప్రతిభయు, తనకు ఆదర్శప్రాయుడు గురుతుల్యుడైన పేరొక కవిని అనుసరించుట ధర్మమేగదా.

తరవాత శాస్త్రిగారు అహోబలపండితుని, అప్పకవి, ప్రౌఢ, వారిళ్ళవారి ప్రసక్తితెచ్చి వారి గ్రంథములలో ఆముక్తమాల్యదను పెద్దనార్యుడు వ్రాసినట్లున్నదని అన్నారు. రాయలు తాను వ్రాసినానని చెప్పినప్పుడు ఇతరుల వ్రాతలకు ప్రాముఖ్యము ఇవ్వరాదు,

# గ్రంథ విమర్శలు

## మధ్యతరగతి మందహాసం :

(కవితా సంపుటి: డా॥ సి. నారాయణరెడ్డి, యమ్. శేషాచలం అండ్ కంపెనీ, మద్రాసు.)

గురజాడ తర్వాత శ్రీశ్రీవద్ద నిలబడిచూస్తే ఆధునికాంధ్ర సాహిత్యంలో బహుతక్కువ మైలు రాళ్ళు కన్పిస్తాయి. ఎంతోమంది ఎంతో విరివిగా రాసినా కాలఝంఝకు ఎదురొడ్డి నిల్వగలవి కొన్ని మేరుపర్వతాలు మాత్రమే! అలాంటివానిలో మన దృష్టికిగిలేది— ఆరుద్ర, నారాయణబాబు, అజంతా, కుందుర్తి, సోమసుందర్, తిలక్, నారాయణరెడ్డి, దాశరథి, రమణారెడ్డి ప్రభృతులు. ఈ గిరిశృంగాలను పరిశీలిస్తే తిలక్, నారాయణరెడ్డి, దాశరథి ఒక కోవకు చెందుతారనిపిస్తుంది. ముఖ్యంగా ఇది వారి కవిత్వాన్ని పరిశీలించినప్పుడు కలిగే అభిప్రాయం. వీరు ముగ్గురూ ముఖ్యంగా మడిగట్టుకోక పోవటం—Free Poets గా రాసుకుపోవటం కన్పిస్తుంది. Free Poet అంటే ఏఒక్కసిద్ధాంతానికి బద్ధుడుకాక, కమిట్‌మెంట్ లేకుండా—ప్రకృతిలో జరిగే ప్రతిచర్యకు ప్రతిచర్యనిస్తూ అంటే అన్నిరసాలు ఒప్పిస్తూ రాసుకుపోయేకవి అని. ఇలా అన్నంత మాత్రాన అభ్యుదయకవిత్వం వీరు రాయలేదనికాదు. ఈ విషయంలో తిలక్ అగ్రగణ్యుడు. కేవలం అభ్యుదయ భావనలే కవిత్వం అన్నంతదూరం పోక – అభ్యుదయ భావననీ వారి కవిత్వంలో ఒకపాయగా గ్రహించినవాళ్ళు. అందుకనే అన్నిరసాలు వీరి కవిత్వంలో ఆకృతిని పొందాయి. తిలక్ వాచ్యంగా దీన్నే సూచించారు. దాశరథికూడా వెలిబుచ్చారీ అభిప్రాయాన్నే–'నేను కవిని, నేను రాస్తున్నది కవిత్వం' అని. నారాయణరెడ్డి ఎక్కడా వాచ్యంగా వ్యక్తీకరించకపోయినా పై అభిప్రాయానికి ఉదాహరణగానే వారి కవిత్వం నడుస్తుంది. చెదురు, మదురుగాఉన్న మాత్రాచ్ఛందస్సుకు ఒక వ్యక్తిత్వం, ఒక పోకడ కల్పించినవారిలో ఎన్నదగిన వ్యక్తి నారాయణరెడ్డిగారు. నాటి 'జలపాతం'వద్దనుండి, నేటి 'మరో హరివిల్లు'వరకు పరిశీలిస్తే నారాయణరెడ్డిగారి కవితాత్మపొందిన మార్పును గుర్తించగలం. 'కర్పూర వసంతరాయలు' రాసిన చేయే 'మధ్యతరగతి మందహాసం' రాసింది. రానురాను కవికి సామాజికస్పృహ పెంపొందుతూవస్తుంది. శ్రీశ్రీ కత్తిపట్టినతర్వాత అభ్యుదయకవిత్వం ఎంతగా రాజ్యంచేసిందంటే, ఆధునిక కవిత్వమంటే అభ్యుదయకవిత్వమే అన్నంతగా. దాని ధాటి అంతగాఉంది అప్పుడు. అలాంటి తరుణంలో కేవలం అభ్యుదయభావననే కవిత్వంగా స్వీకరించక, తదితరాన్నికూడా కవిత్వంలో ఒప్పిస్తూ మధ్యేమార్గంగా నడచినవాళ్ళు ఇరువురు వారు దాశరథి, నారాయణరెడ్డి. ఛందస్సు విషయంలోనూ ఇది కన్పిస్తుంది. ఆ రోజుల్లో దాశరథి పద్యాన్ని వంచి అన్నిరసాలు ఘుమ్మని పలికించారు. నారాయణరెడ్డి మాత్రాచ్ఛందస్సును కావ్యస్థాయికి ఎగదోశారు; దానికొక సొబగు, సౌందర్యం, జవం చేకూర్చారు.

రాను రాను వచన కవిత్వం దానియొక్క విరాట్ స్వరూపం చూపిస్తూ తదితర ప్రక్రియలకన్నింటిని అది దిగమింగుతూ మహోధృతంగా ముందుకు సాగింది. కుందుర్తి అన్నట్లు ఈనాడు కలంపట్టే ప్రతివాడు పద్యంతోకాక వచనగేయం తోనే మొదలెడుతున్నాడు. అలాంటి విస్తృతమైన ఆకృతి వచనగేయం సాధించుకుంది నేడది రాజ్యమేలుతోంది. పోతే, వచనకవిత్వం, అభ్యుదయభావనని ప్రచారం చేసేందుకు పుట్టింది, అభ్యుదయ భావనా వ్యక్తీకరణే వచనకవిత్వం ముఖ్యోద్దేశ్యం అని అనటం మంచిదే. కాని రాయి గ్రుద్దటం అవివేకం. కారణం.

ఉద్భవించేటప్పుడు అలాంటి పరిస్థితుల్లో ఆలా జరిగినా, పోను పోను, ఊటగా బయల్దేరిన ఈ ప్రక్రియాభూరి వేగం, వైశాల్యం, గంభీరత సంతరించుకుంది. అన్ని రసాత్మకమైన భావనలు వ్యక్తం చేసేందుకు సానుకూలమైన ప్రక్రియగా ఈనా డది పరిణమించింది. ఈ మార్పు సహజం. దాన్నెవరూ ఆపలేరు. పేరు మార్చినా వచనగేయపద్ధతి మారదు. ఎవ్వరి చేతుల్లోనైనా అది ఒకటే—పేరు మారినా గులాబి గులాబియే.—మొక్క వృక్షమవటం ఎంత సహజమో ఇదీ అంతే! ఇంత విస్తృతవ్యాప్తి పొందిన ప్రక్రియగా వచనగేయం మారటానికి దానిలోని సౌలభ్యం సులువులు కారణం. మారుతున్న కాలంతోపాటు మనస్తత్వాలతోపాటు ప్రక్రియా స్వరూప స్వభావాదులు మారటం తథ్యం. ఒక్క ఇరవై సంవత్సరాలకింద సంఘంలో జీవించిన మనిషికి ఈనాడు జీవిస్తున్న మనిషికి చాలా తేడా ఉంది. ఆనాటి మనిషితో లేని సంఘర్షణ, వైవిధ్యం నేటి మనిషిలో ఉన్నాయి. దీనికి కారణాలు ఏవైనా కావచ్చు. కవికూడా ఆ మనుషుల్లో ఒకడు కాబట్టే సహజంగా మనిషి మనసుకు, సంఘానికి మధ్య సంఘర్షణ, వ్యక్తిగతవిలువలకు, సామాజికమైన కట్టుబాట్లకు మధ్య జరిగే పోరాటాన్ని చిత్రిస్తాడు, తన కవిత్వంలో—ఇలాంటి ఆలోచనాస్రవంతిని వ్యక్తీకరించేందుకు వచనగేయం సరిపోయినంతగా, ఇమిడినంతగా మరే కవితాప్రక్రియ ఇమడలేదు.

వచనగేయానికి పరుగునేర్పింది శ్రీ కుందుర్తి. కాలంతోపాటు ప్రక్రియ కవితావస్తువూ మార్పు చెందుతూ వచ్చాయి. తదనుగుణంగానే కవులు రాస్తూపోతుంటారు. ఒకప్పుడు మాత్రాచ్ఛందస్సులో శృంగారకావ్యాలు రాసిన నారాయణరెడ్డిగారు ఈనాడు వచనకవిత్వం, రాస్తున్నారంటే, అది సహజసిద్ధమైన మార్పే. ఇలాంటి కాలక్రమగతమైన మార్పును సూచించేందుకు 'మధ్యతరగతి మందహాసం' ఒక ఉదాహరణ! 'కర్పూర వసంతరాయలు' 'నాగార్జునసాగరం' వంటి కావ్యలతికలు తీర్చినచేయే మధ్యతరగతి మానవుని వేదనను, అసంతృప్తిని, నిరాశానిస్పృహల్ని చిత్రించింది. ఈ సమాజంలో కవి ఒక భాగస్వామి! తాను ఆ సామాజికవ్యవస్థలో ఒక్కడుగా పొందిన అనుభూతులు, అనుభవాలు, ముఖ్యంగా మధ్యతరగతిమనిషిగా ఇక్కడ మనముందు ఉంచారు. ఇందులో 40 ఖండిక లున్నాయి. మధ్యస్థంగా బ్రతుకును లాగుతున్న జీవికి జీవితం ఎలా అగుపిస్తుంది—

"ఎంత అందంగా ఉంది జీవితం
ప్రదర్శకులు విసిరిన రాళ్లకు
పగిలిన అద్దాలశాల లాగా
ఉసిగొన్న ఉద్రేకాలకు గురియై
మసియైన మోటారుశకటం లాగ—"

ఈ పరిస్థితి ఎందు కేర్పడింది.

"నిప్పులాంటి నిరుపేద సత్వానికి
ఎప్పుడూ లేనంత తుప్పుపట్టింది?
మంచి తొడుక్కునే పెళ్లిదుస్తుల్ని లాక్కొని
వంచన నడిబజార్లో ఊరేగుతుంది"

కాబట్టే

"మూటకున్న విలువ మాటకు లేదు
తూటాకున్న విలువ పాటకు లేదు
బాకాలకున్న విలువ రేకులకు లేదు
కాకులకున్న విలువ కోకిలకు లేదు"

అందుకే ఇలా ప్రశ్నించుకోవలసివచ్చింది—

'ఎక్కడికి పోతున్నాం మనం' 'ఎక్కవలసిన ఎవరెస్టు శిఖరాలపైకా' దిక్కుమాలిన పాపాల పాతాళకుహరాల్లోకా — మళ్లీ వెనక్కి నడుస్తున్నామా?—మనుషుల్ని మనుషులే తిన్న అమానుష బర్బరయుగంలోకి—'. ఈ అనుమానం, ఈ ప్రశ్న ఈనాటి మన ప్రవర్తన ప్రగతి చూస్తే ఎవరికైనా వస్తుంది — ఎందు కిలా తయారవుతుంది సమాజం? మానవు లిలా దానవుల్లా ఎందుకు ప్రవర్తిస్తున్నారు—??

'చర్చలు పల్లవించే ప్రాంగణంలో
కుర్చీలు విరిగిన చప్పుడు—
చందనచర్చలు పరిమళించే మండపంలో
జంబాలం చిమ్ముకుంటున్నాయిప్పుడు,
జాతి జాతకరేఖలు తీర్చే చక్రంలో
శనీశ్వరుల వింతవింత వికటింపులు
సంఘం జీవనాడి పరీక్షించే ఘట్టంలో
సైతానుతత్వం వెకిలివెకిలి ఇకిలింపులు.'

ఇది సమాధానం. ఇలా సంఘంలో కుళ్ళు ఎక్కడుందో పసిగట్టగల్గిన కవికి, సామాజిక స్పృహ లేదనటం హాస్యాస్పదం. కవిత్వం ఎక్కడ పూర్తిగా వచనంగా దిగజారుతుందో నారాయణరెడ్డిగారికి బాగా తెలుసు. కేవలం రాజకీయాన్ని చిత్రించినా కవిత్వంపాలు ఏమాత్రం తగ్గకుండా రాయగలరు. లోపాలను చూపించటమేకాకుండా ధ్యేయాన్నికూడా సూచించారు. మనం ఎటు నడవాలి—గోల్ ఏది—

పాపాలను ఉతికేసే రేవులోకి
శాపాలను వదిలేసి దీవిలోకి
జీసస్ ప్రేకిన సిలువపందిరిలోకి
బాపూ విడచిన చివర ఊపిరిలోకి'

* * *

పెరిగిపోతున్న ధరల్ని చూసి
పెదవి విరవటం మానుకున్నాను
కడుపేదల్ని కలల్ని త్రాగేసి
కడుపునింపటం నేర్చుకున్నాను.'

ఇదీ మధ్యతరగతి మనిషి అవస్థ. అయినా ఆశ చాలా గొప్పది. 'అదృష్టం దొరక్కపోతుందా' అని అనుకుంటాడు మానవుడు. అందుకే—

'అదృష్టమనేది మత్తకోకిల్లా ఉంటుంది
అది కాలమనే మావిగుబుళ్ళలో దాగుంటుంది
దాని నీలముక్కు పగడాలగుళ్ళు తినేప్పుడో
మానవుని విధురజీవితం మధురితం వినేప్పుడో'

కవిగా తాను ఎరిగి, తెలుసుకుని, నేర్చుకున్నది తనతోటివానికి చెప్పారు. అందుకే—

"కన్నెదుటవున్న సత్యమే
కల్యాణముత్యాలమాల
కలతలు లేని హృదయమే
కమనీయ చంద్రశాల
మనసైన ఇల్లాలి కూజితమే
మత్తకోకిలస్వరం
అనురాగసరళగీతమే
అన్నింటికీ మించిన వరం"

జీవితాన్ని గురించి భ్రమలు గాని, అపోహలు గాని లేకుండా నిజాన్ని గ్రహించి, అనంతమని సేహా అందంగా—ఇప్పటి స్థితిని చమత్కారంతో, హాస్యధోరణిలో—

'పార్టీల కుంచెలు గీస్తున్న
పగటికలల బొమ్మల్ని చూసి
ప్రజల హృదయాలు
ఏడ్వలేక నవ్వుకుంటున్నాయి.'

'బియ్యంతో వియ్యమందే పలుగురాళ్ళు
పాలతో తాదాత్మ్యంచెందే పంపునీళ్ళు
పట్టపగలే గుచ్చుకుంటున్న చీకటిముళ్ళు
పాలకవర్గంలో పరిమళిస్తున్న కుళ్ళు—'

ఈ పరిస్థితులు మెరుగవ్వాలంటే, ప్రభుత్వం ఏదో చేస్తుందని ఊరుకుంటే లాభంలేదు. ప్రతి ఒక్కడూ తన వంతు కర్తవ్యం పూర్తి చేయాలి. చైతన్యమరుత్తుగా కదలాలి. శాశ్వత మైనసిరి అవనికి కట్టాలి. అందుకు తన్నుతాను అర్థంచేసుకోవటం ఎంతైనా ముఖ్యం. అసలిప్పుడు ప్రమాదమంతా తమను తాము చదువుకోలేని మనుషులు ముందు నడవటంమూలానే—అలాంటి వాళ్ళు రాజ్యాలేలటంమూలానే—

'గతంతోపాటు స్వగతం విడిచినవాళ్ళు
మతంతోపాటు అభిమతం విడవనివాళ్ళు

కావాలి అద్భుతప్రభాతితో
చైతన్యతరువు దాక్కొన్న చిన్నారివిత్తులో'

ప్రతివ్యక్తి—

'గోళ్ళు గిల్లుకోవటం మానేసి
కూలంకషంగా ప్రవహించటం నేర్చుకోవాలి
నేలమీద పరచుకోవటం ఆపేసి
నిబారుగా పెరగటం నేర్చుకోవాలి'

'దీపాలు కావాలి' 'అంతరకాంతి రూపాలు కావాలి'. 'నా ముఖం ఇదేనా' అని ప్రతివ్యక్తి ప్రశ్నించుకోవాలి. ఆత్మ పరీక్ష చేసుకోవాలి. 'చిరుదీపం' కంటికొననుండి 'కొవ్వొత్తి' కన్నీటి జలపాతంనుండి 'జిన్నీదు, స్వచ్ఛంద జీవితంనుండి మనం పాఠాలు నేర్చుకోవాలి. జీవితానికి మనం ఎంత అపరిచితుల మౌతున్నామో! బ్రతుకు మనకు అర్థంకాదు. ఎవడికి వాడు అంతుబట్టడు, ఏమిటీ మయసభ—?

'గది తలుపులు మూసుకుని
ఎద తలుపులు తెరుచుకోనిదే'

అగరు వత్తుల సిగల అంచుల్లో చిగురు గుత్తులు, తెల్లని పరిమళాల గరుత్తులు, గుండెల్లో గుబాళించవు అపుడే—

'చెరబడ్డ దినకర బింబం
తెరలుచీల్చి వస్తుంది
నిద్రిస్తున్న యుగచైతన్యం
నిటల నేత్రం తెరుస్తుంది'

'మల్లికాని, మొల్లకానీ
బంతికాని, చేమంతికానీ
చవిఉంటే గుండెల కద్దుకో
చెవిఉంటే వాటి బాసలు విని
చిక్కి పోయిన నీ భాష సరిదిద్దుకో'—
ఇదీ సందేశం

ఇందులో కొన్ని ఖండికల్లో ఈనాటి సామాజిక రాజకీయ వ్యవస్థలపై మంచి మంచి చెణుకులున్నాయి. రాజకీయం చెప్పినా, జీవితాన్ని వ్యాఖ్యానించినా అందాన్ని అక్షరాల్లోకి అనువదించినా 'Sense of Beauty' ని కవిత్వంనుండి దూరం చేయలేదు. కవిత్వం హృదయ సంబంధి అన్నది విస్మరించ లేదు.

'మధ్యతరగతి మందహాసం' 'సన్నజాజిపూల మాలా' 'మత్తకోకిల' 'ఎక్కడికిపోతున్నాం మనం' 'ఒంటిదీపం' 'జీవితం ఓ జీవితం' 'అగరువత్తులు చుక్కలు', చాలా మంచిఖండికలు. ఆత్మగతంగా సాగిన ఖండికలు లేకపోలేదు. వానిలో ఉత్తమమైంది- 'రెండంచులు'. అతిసామాన్యమైన గేయాలు లేకపోలేదిందులో — 'సంక్రాంతిరేఖ' లాంటివి. సంపుటి మొదలుపెడితే పూర్తయ్యేవరకు ఆటంకం లేకుండా చకచకా సాగిపోతుంది. అయితే ఇందులో ఎన్ని ఖండికలు మళ్ళా మనల్ని నిలబెట్టి చదివించగలవు అన్నది సందేహం. రెడ్డిగారిలో లోతు ఎందుకు పెరగలేదో అర్థంకాదు. గేయాలు ఎంత అందంగా తయారయ్యాయి అన్నదే ముఖ్యంకాదు, నిలబెట్టి చదివించేగుణం, తద్వారా ఆలోచనని ప్రేరేపించే తత్వం వచనకవిత్వానికి ముఖ్యలక్షణంగా భాసిస్తుంది. ప్రతిగేయం అందంగా పదహారేళ్ల ఆడపిల్లలా ఉంటుందేతప్ప, ప్రౌఢత గోచరించదు. ఈనాడు వచనకవిత్వం - ఎంతో లోతుతో ఎంతో ఎత్తులకు ఎదిగి గొప్పగా పెరిగిపోయింది. అట్టి పరిస్థితుల్లో ఈ గేయాలు 'వచనకవిత్వం' సరసన ఎలా నిలబడగల్గుతాయి అన్నది ప్రశ్న? వచన

కవిత్వంఅంటే – ఒక పద్ధతి ఉంది: భావవ్యక్తీకరణలోగాని, నడకలోగాని, పదబంధాల్లోగాని, శైలిలోగాని ఒక మంచివచనగేయం రాయటం చాలా కష్టం. అనుకున్నంత సులువుకాదు. ఏఒక్కఅక్షరం తీసివేసినా లోపం కొట్టవచ్చినట్లు కన్పించాలి. అంత పట్టుగా తయారయింది వచనగేయం. ఆ కొలమానంతో కొలిస్తే రెడ్డిగారి గేయాలు ఎంతవరకు నిలబడగలవు? ప్రబంధసాహిత్యాన్ని జీర్ణించుకున్న రెడ్డిగారు వచనగేయాలు రాసేటప్పుడు ఆయా ప్రబంధ పదబంధాలను, అరిగిపోయిన ఆ పాత 'ఇమేజరీని' దూరంగా ఉంచటం చాలా సముచితం. అటు పూర్తి వచనకవిత్వంకాకుండా, ఇటు మాత్రాఛ్ఛందః సంబంధమైన గేయాలుకాకుండా మధ్యేమార్గాలుగా ఈ గేయాలు నిలుస్తాయి. మంచివచనగేయం స్థాయికి రెడ్డిగారి ఈ గేయాలు ఎదగలేదుఅని చెప్పటం సాహసంమాత్రంకాదు. ప్రతిభ వ్యుత్పత్తులు, కళలోని మెళకువలు తెలిసిన రెడ్డిగారు కూర్చుంటే పసందైన పటుత్వంగల వచనగేయం రాయలేరు అనటం హాస్యాస్పదం. కాకుంటే కొత్త డిక్షన్, కొత్త 'ఇమేజరీ'ని సృష్టించుకోవాలి. ఏమైనా రెడ్డిగారి ముద్ర రెడ్డిగారికుంది. పేరులేకుండా వారి కవిత్వంలోంచి రెండు లైన్లు ఎవరికి విన్పించినా 'ఇది నారాయణరెడ్డిగారి'దని ఖచ్చితంగా చెప్పగలరు.

ఈనాడు వచనకవిత్వం రాస్తున్న వాళ్లలో చాలామందిలోలేని మంచిగుణాలు రెడ్డిగారిలో ఉన్నాయి; అవి, ఝుమ్మని భావాన్ని పాఠకునికి అందచేయటం, చక్కగా అన్వయం కుదరటం, 'అయోమయంగాని, తికమకలుగాని లేకపోవటం, అందానికి ప్రాముఖ్యత. వచనకవిత్వం ఎంత సమాజాన్ని ఉద్ధరించటానికి ఉద్దేశింపబడ్డా, మరో ప్రపంచం సృష్టించటం దాని ధ్యేయంఅయినా 'అందం' అనే గుణానికి అది విరోధికాదు అన్న తత్వం నారాయణరెడ్డిగారిది. అదే ఈ గేయాల్లో సర్వత్రా కన్పిస్తుంది. నీరసంగా కవిత్వం రాయటం రెడ్డిగారికి చేతకాదనిపిస్తుంది. ఏమైనా సినారెలాగా సినారే రాయగలరు.

—కె. శివారెడ్డి.

## ఆంధ్ర రసగంగాధరము

(కృతికర్త: శ్రీమాన్ వేదాల తిరువేంగళాచార్యులు, ప్రచురణ:—ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి, కళాభవన్. సైఫాబాదు—హైదరాబాదు—4. మూల్యము: ఆరు రూపాయలు.)

జగన్నాథ పండిత రాయలవారి సంస్కృత రసగంగాధరమునకిది ఆంధ్రానువాదము. ఆలంకారికులలో పండితుని తరువాత అంతటి సర్వతంత్రస్వతంత్రుడు మరి పుట్టలేదు. ఆయన పదునేడవ శతాబ్దమువాడు. మరియు నాంధ్రుడు. ఆకాలమున సర్వభారతమునకును ఒకవిధముగా ఆయనయే సాహిత్య విద్యాప్రభువు. మమ్మటాదులను కాదని కావ్యమును నిర్వచించిన మహాప్రతిభుడు. ధ్వని మతమును తిరిగి స్థాపించి ఇక చెక్కుచెదరకుండ చేసిపోయిన సహృదయ కవిలోకచింతామణి. సాహిత్య విద్యాప్రసంగ సందర్భములయందు విచ్ఛిత్తి విశేషమును ప్రవేశపెట్టిన బుద్ధికుశలుడు. అలంకారములను సూక్ష్మభేదములతో నిర్ణయముచేసిన విద్వాంసుడు. ఒకవిధముగా తనవరకు అభివృద్ధియగుచు వచ్చిన సాహిత్య విద్యాశాస్త్రమును మొత్తము పునర్విచారణచేసి సిద్ధాంతమును నెలకొల్పిన ధీశౌండుడు. కావ్యమున సౌందర్యమును ప్రధానముచేసి దానికి పట్టాభిషేకముచేసిన తాత్త్వికుడు. సాహిత్యవిద్యకు వేదాంత విద్యతో గట్టి సంబంధమును పెట్టిపోయిన విజ్ఞాని. ఈ విధముగా జగన్నాథుని గురించి ఆగకుండ చెప్పుకొని పోవచ్చును.

జగన్నాథుడు ఇంకను వ్రాయవలసిన గ్రంథము కొంత యున్నదన్నట్లుగా ఇప్పుడున్న ఈ రసగంగాధరము స్వరూప స్వభావము లనిపించుచున్నవి. మరి ఆయన వ్రాసినది నశించిపోయి లభించుట లేదో—కాక ఆయన ఇంతవరకే రచించిపోయెనో పోవ మూహించి ప్రయోజనములేదు.

ఈ జగన్నాథుని రసగంగాధరమును సవరస గంగాధరమని పేరుపెట్టి శ్రీ జమ్మలమడక మాధవరామశర్మగారు 1942 వ సంవత్సరమున ప్రథమాననము మాత్రము తెనిగించి ప్రకటించిరి. ఆ పిమ్మట చాలకాలమునకు 1963 వ సంవత్సరమున శ్రీ ధరణికోట వేంకటసుబ్బయ్యగారి రసగంగాధర ప్రథమాననానువాదమును ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీ ప్రచురించినది. మరియు 1969 వ సంవత్సరమున శ్రీమాన్ వేదాల తిరువేంగళాచార్యుల వారి రసగంగాధర ప్రథమాననానువాదమును సాహిత్య అకాడమీయే ప్రచురించినది. ఇప్పుడు శ్రీ మాధవరామశర్మగారి గ్రంథము బజారులో దొరుకదు. అకాడమీ ప్రచురణలు రెండును లభించుచున్నవి. ఈ రెండు ప్రకరణములును ప్రచురింప దగినవే. శ్రీ వేంకటసుబ్బయ్యగారు వరివస్యాఖ్యను పేరుతో స్వంతవ్యాఖ్యానమును విపులమైనదానిని అనువాదమునకు జోడించిరి. శ్రీమాన్ వేదాలవారును తమ శ్రీ శర్వాణీ వ్యాఖ్యను జోడించిరి.

శ్రీమాన్ తిరువేంగళాచార్యులుగారు సంస్కృత మూలమును తెలుగులిపిలో ముద్రించి, దాని తాత్పర్యమును తెనుగున వ్రాసి, విశేషాంశముల సమన్వయమును తాముగా స్వతంత్రించి తమ వ్యాఖ్యానమున విమర్శచేసి చెప్పుచు ఈ ఆంధ్ర రసగంగాధర రచనా ప్రణాళికను సుష్ఠుగా నిర్వహించిరి. అభిమతములుకాని అన్యమతములను ఖండించుపట్ల శ్రీమాన్ ఆచార్యులవారు జగన్నాథు లంతటివారు. రసగంగాధరమును వెక్కిరించుటకు బయలుదేరిన నాగేశభట్టు వాదమును పూర్ణముగా పూర్వపక్షము చేయుటయే తాత్పర్యముగా శ్రీ శర్వాణీ వ్యాఖ్య మొదట మొదట విశ్వరూపమును ప్రదర్శించినది. శ్రీమాన్ ఆచార్యులవారి పండిన శాస్త్రవిద్యావదంగప్రౌఢిలక్షణమీ శ్రీశర్వాణీ ముఖముగా గుబాళించుచున్నది. మరియు నిందు శ్రీమాన్ ఆచార్యులవారు కాశీపండితుడు గంగాధరశాస్త్రి అభిప్రాయములను పూర్వపక్షముచేసి పండితరాయల సిద్ధాంతమును స్థిత స్థాపితము చేసిరి. మూలగ్రంథము గౌరవమును ఈ అనువాదము ఇనుమడింప జేయుచున్నది. ధ్వన్యాలోకము ననువదించుచు ఆచార్యులవారు ప్రదర్శించిన నేర్పు ఇది ఆయనయందే కలది. అంతటి కర్మకుశలునకు రసగంగాధరము నల్లేరుమీద బండి నడక వంటిది. పండితరాయలవారిమీదగల అపూర్వమైన ఆదరాభిమానములతో ఈ అనువాదము సాగినది. అందువల్లనే శ్రీశర్వాణీవ్యాఖ్య అవసరమైనప్పుడు మాత్రమే తను ముందుకువచ్చి ఆ యవసరమును తీర్చి విరమించుకొనును.

ఇప్పటికి వచ్చిన అన్ని రసగంగాధరాంధ్రానువాదములును ప్రథమాననమునకు మాత్రమే పరిమితములైనవి. శ్రీమాన్ తిరువేంగళాచార్యులవారు మిగిలిన గ్రంథమునుగూడ ఇట్లే సరళ సుందరముగా తెనుగున వెలయించెడు బాధ్యతను స్వీకరించినచో ఆయనపట్ల ఇంకను ఆంధ్ర విద్వాంసులు కృతజ్ఞతా భావమును పెంచుకొందురు.

## రాచకొండ చరిత్రము

(రచయిత: శ్రీ తేరాల సత్యనారాయణశర్మ; ప్రతులకు: విజయభారతి నిలయం, నల్లగొండ. మూల్యము: అయిదు రూపాయలు)

ఆంధ్రదేశ చరిత్రలో రాచకొండ వెలమ ప్రభువులు వర్ధిల్లినకాలము గణనీయమైనదే. బేతాళ నాయునితో మొదలుపెట్టినచో పదిపదిహేనుమంది వెలమవీరులు రాచకొండను రాజధాని జేసికొని తెలుగునేలను నూరు నూటపాతిక సంవత్సరములు పాలించిరి. ఈ ప్రభువులు తమకు చేతనైనంతలో విదేశ దండయాత్రల నెదుర్కొని తెలుగురాజ్యమును నెలకొల్పి పాలించిరి. ఈ వెలమప్రభువులకు ఆంధ్ర భాషాసాహిత్యములపట్ల ఎనలేనిప్రీతి. ఆ విధముగా

వారానాటి సంస్కృతీ మర్యాదలను నిలబెట్టిరి. ఈ ప్రభువులుకూడ సింగభూపాలుడు మొదలైనవారు స్వయముగా విద్వాంసులై శాస్త్రగ్రంథములను రచించి కవిపండితులను పోషించిరి. శ్రీనాథ కవి సార్వభౌమునకుకూడ ఈ వంశమురాజులతో సంబంధ మున్నది.

శ్రీ శేషాల సత్యనారాయణశర్మగారు ఈ రాచకొండ వెలమప్రభువులనుగూర్చి మిక్కిలి శ్రమించి పరిశ్రమచేసి తమ పరిశోధన ఫలితముల నీ గ్రంథ రూపమున ప్రకటించిరి. శ్రీ శర్మగారు ఆయా ప్రభువుల కాలనిర్ణయమునుగూర్చి పునర్విచారణచేసి తమ నిర్ణయములను సహేతుకముగా నిరూపించిరి. శ్రీ శర్మగారి సొంత నిర్ణయములలో కొన్ని: (1) రెండవ సింగభూపాలికాలము క్రీ. శ. 1400 లతోసరి. (2) శ్రీనాథుని పర్యటనకాలము క్రీ. శ. 1424 -- 1430 సంవత్సరముల నడుమ. (3) పోతన జీవి కాలము 1405 నుండి 1480 వరకు. అనేకములైన చారిత్రకాధారములను సేక రించి సమన్వయపరచి శ్రీ శర్మగారు గొప్పకృషి చేసినారు.

పశుపతి నాగనాథకవి, గౌరన, అయ్యలార్యుడు, పోతన ఈ మొదలైన తెలుగు కవులను గూర్చియు, విశ్వేశ్వరకవి, అప్పయాచార్యులు మొదలైన గీర్వాణ కవులను గురించియు ఇందు శ్రీ శర్మగారు వివిధాంశ ములను చర్చించివ్రాసిరి. భాగవత కన్య పతిత్వపు రగడ సింగ భూపాలునకు సంబంధించినవి కలవు. దీనిని తొలగించుటకు శ్రీ శర్మగారు యుక్తిచేసిరి. పోతనగారి పద్యములో గల 'కర్ణాటకిరాట కీచకుల' మాటను పట్టుకొని బహుశః అట్టి కీచకులెవరో పోతన్నను బాధించియుండ వచ్చునని చెప్పారు. ఈ విషయము ఇంకను పరిశీలింప దగినదిగనే యున్నది. అప్పటి యవనదంతయ్యాకల మూలము గానే పోతన్నగారి కృతి శిథిలమైపోయి ఉండవచ్చునని గూడ శ్రీ శర్మగారు అభిప్రాయపడుచున్నారు.

శ్రీ శర్మగారు గట్టికృషిచేసి ఈ చారిత్రక పరిశోధన గ్రంథమును ప్రకటించినారు. ఆంధ్రదేశ చరిత్రము నధ్యయనము చేయువారికి పుస్తకము మిక్కిలిగా ఉపయోగపడగలదు. చరిత్ర ప్రజ్ఞగలవారు దీనిని నిశితముగా పరిశీలించిన దీని విలువ ఇంకను అధికము కాగలదు.

## కావ్య స్వరూపమ్

[సంపాదకులు : శ్రీ స్వామీ శివశంకరస్వామి, ఆచార్య : శ్రీ పోత్తుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రి. ప్రచురణ : ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమి, కళా భవనము— సైఫాబాదు — హైదరాబాదు -- 4. మూల్యము : నాల్గు రూపాయలు ]

కావ్య స్వరూప స్వభావ వివేచనమును మన భారతీయాలంకారికు లెట్లొనరించిరో దానిని సంగ్రహముగా జూపించినచో సాహిత్య విద్యార్థులకు సాహిత్య విమర్శకులకు చాల ఉపకారకముగా నుండు నన్న తలంపుతో ఈ గ్రంథము సమకూర్చబడినది. భరతుని నాట్యశాస్త్రమునుండి జగన్నాథుని రసగంగా ధరము వరకు గల ఇరువది యార్గురు ఆలంకారికులు రచించిన శాస్త్రగ్రంథములనుండి కావ్య వివేచనా భాగమును ముఖ్యమైన దాని నెత్తి వ్రాసి దానికి తెనుగున సంగ్రహముగా వచనమును కూర్చి ఈ యిరువురు సంపాదకులను ఈ విధముగా ఈ కావ్య స్వరూప నామక గ్రంథమును సంపాదించి రెటినారు నాట్యశాస్త్రమునకు ముందు కావ్య స్వరూపమును వివేచించిన గ్రంథములు ఋగ్వేదము, ఉపనిషత్తులు రామాయణము, అగ్ని పురాణము— ఈ నాల్గింటినుండి కూడ సంపాదకులు కొంత గ్రంథము నుద్ధరించి దానికి తెలుగు వ్రాసిరి. మరియు ఈ గ్రంథమున కనుబంధముగా శ్రీ జమ్ముల మడక మాధవరామశర్మగారు శ్రీ రాజానక మహిమ భట్టు, విద్యాధరకవి, సింగభూపాలుడు, రూపగోస్వామి —అను వారిని గూర్చియు వారు వచించిన విశేష ములను గూర్చియు సంగ్రహముగా వ్రాసి పెట్టినదియు కలదు.

ఈ సంకలన గ్రంథము నిజముగా బహుళ ప్రయోజనము కలది. భారతీయాలంకార శాస్త్రము సామాన్యునకు ముక్కు దూరునదికాదు. ఆ లక్షణము సగమిది శాస్త్రముగుటలో నున్నది. మిగిలిన సగమును శాస్త్రకర్తలు దాసినట్లు చేసినారు. దీనికి తోడు ఆంధ్రదేశమున సంస్కృత గ్రంథములను చదువుట ఉన్నదిగాని వాటినిగూర్చి తెలుగులోగాని ఆంగ్లములోగాని వ్రాయుట తక్కువ. సంస్కృతము చదివి అర్థము చేసికొనువారికికూడ దేవనాగరిలిపి రాదు అందువలన సంస్కృత సాహిత్యము క్రముగా ఆంధ్రుల కల్లంతదూరమున నుండిపోయినది. ఈ విషయమున ఔత్తరాహులు చాల ముందడుగు వేసినారు. మహారాష్ట్రులు సరేసరి. ఉత్తరదేశమున సంస్కృత పరీక్షలు హిందీభాషలో వ్రాయవచ్చును. ఆంధ్రదేశమున తెలుగులో వ్రాయరాదు. అందువల్లనే ఒక్కడి దేశభాషా పండితులకు చాలమందికి సంస్కృతము రాదనియే చెప్పవలయును. ఏమివచ్చుననగా నాలుగు కావ్యనిర్వచనాలవంటివి వచ్చును. ముఖ్యముగా విశ్వవిద్యాలయములతో తెలుగుభాషా సాహిత్యములలో ఎం. ఏ. పరీక్ష లిచ్చువారికి సంస్కృతము చాల దూరమైపోయినది. అట్టివారి కీ సాహిత్య శాస్త్రవిషయసంగ్రహ మెంతయు ఉపకరింపగలదు. పదిమంది భారతీయాలంకారికుల ఆలోచనా విధానము బోధపడగలదు. సంపాదకులు చక్కనిభాగముల నెన్నిక చేసి సరళసుందరముగా దానిని తెనుగున వచనముగా వ్రాసిరి. దీని నొక పద్ధతిగా గ్రంథమునం[illegible]దంతటను అనుసరించియుండిన బాగుండెడిది. సంపాదకు లట్లు చేయలేదు. ఋగ్వేదము, ఉపనిషత్, వాల్మీకి రామాయణము, నాట్యశాస్త్రము, భామహాలంకారము, రాజశేఖరుని కావ్యమీమాంస—ఈ మొదలైన గ్రంథములనుండి ఉద్ధరించిన భాగముల తాత్పర్య మొక విధముగా వ్రాయబడినది. దండి, ఆనందవర్ధనుడు, విద్యానాథుడు, విశ్వనాథకవిరాజు, అప్పయదీక్షితులు, జగన్నాథ పండితుడు—ఈ మొదలైనవారి కృతుల నుద్ధరించుటేకాని సంపాదకులు తెనుగున వివరణములు వ్రాయలేదు. వట్టి సంస్కృతములో నున్నదాని నున్నట్లే ఎత్తివ్రాసినందువల్ల ఏమి ప్రయోజనము? శంకుకభట్టు, అభినవగుప్తుడు, వీరి వాదముల నూరక తెలుగులో చెప్పి వదలరి అభినవభారతి లోచనవ్యాఖ్యానము నుండియు, అభినవభారతి [illegible] నుండియు నాల్గు పుటలు తరువాత ఎత్తి వ్రాయబడినవిగాని శ్రీ శంకుకుని విషయమున నదియును లేదు.

మిక్కిలి ప్రయోజనకారియైన ఈ గ్రంథమును సంపాదించుటలో సంపాదకు లింతకంటె ఎక్కువ శ్రద్ధ తీసికొనవలసియున్నది. ఇప్పుడు దీని ప్రయోజన మిక నును ఇనుమిక్కిలిగా నున్నదివి అసలు లేనిదానికంటె ఏదో కొంతయుండుట మంచిది కదా! ఆమాత్రము మంచి ఈ సంకలన గ్రంథమునందున్నది.

## మన పండితులు - కవులు - రచయితలు

[రచయిత : శ్రీ కోవెల సంపత్కుమారాచార్య, ప్రచురణ: జనధర్మ ప్రచురణ, ప్రతులకు: జనధర్మ ప్రచురణ: వరంగల్లు, మూల్యము : మూడు రూపాయలు.]

మన పూర్వులంతా పండితులే. పండితులందరా పండితులుగానే ఉండరు. కొంతమంది కవిత్వమును వ్రాయుదురు. వారు కవులు. పండితులు కానివారు, కవిత్వము వ్రాయనివారు రచయితలు. వీరు ప్రధానముగా రచనలను వచనమున కొనసాగించువారు. ఈ విధముగా మూడు విధాలుగా కనిపించే వరంగల్లును, వరంగల్లు చుట్టుపట్ల ప్రదేశాలను ఉంటి పెట్టుకొని ఉన్నవారి జీవిత విశేషాలను సేకరించి వారి సాహిత్య కృషిని గూర్చి పరిచయము చేయుటకు సమకూర్చబడిన గ్రంథ మిది. అలాంటి వాళ్లిందులో పాతికమంది ఉన్నారు. ఈ పాతిక మందిలో పదిహేనుమంది ఇప్పుడు లేరు ఇంతమందిలోను ఈ యిరువదియవ శతాబ్దమును నెరుగకుండపోయిన ప్రాచీను డొక్క పండరీనాథరావుగారే. ఆయన

అధ్యాత్మ రామాయణమును తెనుగున రచించెను. దాని పేరు పండరినాథ రామాయణము. రామకథా కల్పవల్లి అను సంస్కృత కృతి కూడ ఆయున దొకటి కలదు.

శ్రీ సంపత్కుమారాచార్యులవారు ఈ గ్రంథమును చాల శ్రమపడి విషయ సేకరణ చేసినారు. వరంగల్లుజిల్లా అనగా వెనుకటి సరిహద్దులను లెక్కలోనికి తీసికొని అప్పటి ఆ సీమలలో సాహిత్య కృషి చేసినవారి వివరాల నిందు చేర్చినారు. ప్రతి పండితుని, ప్రతి కవిని, ప్రతి రచయితను గూర్చిన వివరములు — కృతులు సంగ్రహముగా ఆయా వ్యక్తుల పరిచయ వ్యాసాలకు ముందు ఈయబడినవి. తా నెవరెవరిని గురించి వ్రాయవలయు నను కొన్నాడో వారందరియందును శ్రీ సంపత్కుమార సానుభూతిని కలిగియుండుట ఈ గ్రంథమును చదివినవారి కవగతమగును. రాగద్వేషముల కతీతుడుగా సత్యాన్వేషణ తత్పరమతియై అందరిని గురించియు శ్రీ సంపత్కుమార విషయ సేకరణ మొనర్చెను. విషయ వివరణము నొనర్చెను. వారి వారి కృతులను స్వయముగా పరిశీలించి వాటి గుణమును ప్రశంసించుటతోపాటు మచ్చున కొకటి రెండు శ్లోకములనో పద్యములనో గూడ ఇచ్చుటచేత పాఠకుల కాయా పండిత కవులతో నయ్యెడు పరిచయము మరియు సంపూర్ణముగా నగుచున్నది. సాహిత్య చరిత్రము నధ్యయనము చేయువారికిట్టి పరిచయ గ్రంథము లెంతయేనియు అవసరము.

—క్షేమేంద్ర.

## ద్వా ద శి

(గ్రంథకర్త: వాకాటి పాండురంగరావు; ప్రచురణ కర్తలు: విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్; ఏలూరు రోడ్డు, విజయవాడ—2. పే. 156. వెల 2—50.)

భారతీయ సాహిత్యంలో కథారచన పాశ్చాత్య సాహిత్యప్రభావ ఫలితమేనని ఒప్పుకొనకతప్పదు. కథలు రాస్తున్నవారిలో వాకాటి పాండురంగారావుగారు లబ్ధప్రతిష్ఠులు. ఈ సంపుటిలో పన్నెండు కథలున్నాయి. అన్నికథలూ వివిధపత్రికలలో ప్రచురితమై, పాఠకులకు సుపరిచితములైనట్టివే. కథకు ఉండవలసిన సమగ్రత, సంక్షిప్తత, వస్తైక్యత లక్షణాలు యీ రచయిత వంటపట్టించుకున్నారు. వస్తుసౌందర్యం కంటే శిల్పచాతుర్యం ప్రస్ఫుటంగా గోచరిస్తున్నది. కథ లన్నిటిలోనూ సున్నితమైన హాస్యంతోబాటు చిక్కనిశైలి మేళవించారు. మొదటి కథలో ఆధునిక యువతుల్ని హేళనచేస్తూ శుద్ధనాటునరుకు సుబ్బి నిజాయితీని చక్కగా చిత్రించారు. 'పాతకథ'లో గుమాస్తా జీవిత చిత్రణ. 'కథావశిష్టుడు'లో పరి కొత్తకథను రాయాలనుకున్న రచయిత పడినపాట్లు, ఎదుర్కొన్న అపాయాన్నిచూచి నిజంగానే తెనుగు సరస్వతి గర్విస్తుంది. 'మనిషిచేసిన దేముడు' కథలో భావానికీ, శిల్పానికీ సమన్వయాన్ని సాధించారు. ఉత్తమకథ. లక్ష్యాన్నిబట్టి కథల్ని మూడురకాలుగా విభజిస్తారు. కథాకవితార్థాలు, నాటకీయాలు, వర్ణనాత్మకాలు. 'బతుకన్నది ఒకవరం' కథలో హత్తుకుపోయే వర్ణనాత్మకమైన శిల్పం వుంది.

కథలన్నీ మనచేత చదివిస్తాయి. కథలకు ఈ గుణం వుంటే రచయిత కృతార్థుడయినట్టుగా భావించవచ్చు. మానవులలోని రకరకాల బలహీనతలను అవహేళనచేస్తున్న ధోరణి కనిపిస్తుంది. విషయ ప్రాధాన్యంకంటే శిల్పవిన్యాసమే ఎక్కువ. శ్రద్ధవహిస్తే మరింత బాగా రాయగలరు. అందరూ చదవవలసిన చక్కనికథల సంపుటి ద్వాదశి.

—శివకుమార్.

## సౌందర్య లహరి

శ్రీ జగద్గురు శంకరాచార్య కృతికి పద్యానుకృతి. రచయిత శ్రీ నారునాగనార్య. పుటలు—ప్యాకెట్ సైజు 36. వెల—ఒక రూపాయి ప్రాప్తిస్థానం. శ్రీ నారునాగనార్య, సి. కె. రాచపల్లె పోస్టు, (వయా) రైల్వే కోడూరు, కడపజిల్లా.

## శ్రీ శ్రీనివాస శతకము

రచయిత—శ్రీ గుడ్లదొన శ్రీనివాసరావు. పుటలు - 32. వెల - 0—50. ప్రాప్తిస్థానం— రచయిత, బి—489, హిల్‌కాలనీ, ఉత్తర విజయపురి, నాగార్జునసాగర్‌ప్రాజెక్టు, గుంటూరుజిల్లా.

## ఋతు సూక్తము

'ఆంధ్ర వాఙ్మయములోగల ఋతువర్ణనములనేర్చి రమణీయములగు పద్యములను సేకరించు, ఏకత్ర నిక్షేపించి, వాని కొక ఏకసూత్రతను కల్పించు వ్యాఖ్యానము వ్రాసంగిన' విమర్శ గ్రంథము. రచయిత—శ్రీ నందుల గోపాలకృష్ణమూర్తి. పుటలు - 186. వెల—1—50. ప్రాప్తిస్థానం—శ్రీమతి నందుల రామలక్ష్మి, శేషగిరిరావువీధి, రామారావుపేట, కాకినాడ.

## తలపుల దుమారము

మౌలానా అబుల్‌కలాం ఆజాద్ అహమద్ నగర్ కోటలో నిర్బంధములో ఉన్నప్పుడు వ్రాసిన ఉరుదూ లేఖలకు తెలుగు అనువాదం. అనువాదకులు శ్రీ దేవులపల్లి రామానుజరావు. పుటలు - 182. వెల 8—00 ప్రాప్తిస్థానం-సాహిత్య అకాడెమీ, రవీంద్రభవన్, న్యూఢిల్లీ—1.

## రస్మీటి గాథ

తుఫాను బాధితుడయిన కవి ప్రత్యక్ష కథాకావ్యం. రచయిత—శ్రీ నాగభైరవ కోటేశ్వరరావు. పుటలు—94. వెల—2.00. ప్రాప్తిస్థానం—శాంతా పబ్లికేషన్సు, బ్రాడీపేట, గుంటూరు.

## భావి పౌరులు

బాలగేయ సంపుటి. రచయిత—శ్రీ కవుల ఆంజనేయశర్మ. చిత్రరచన- శ్రీ ఎం. శంకరరావు 'బాలి'. పుటలు 52. వెల. 1.25. ప్రాప్తిస్థానం—రామాబాలానంద సంఘం ఆఫీసు, కొడుకుల వారి సందు, అనకాపల్లి, విశాఖజిల్లా.

## కబీరు గీతాంజలి

కబీరు హిందీ దోహాగీతాదులకు తెలుగు పద్యానువాదం. అనువాదకులు శ్రీ శివశ్రీ. పుటలు-184. వెల—3—25. ప్రాప్తిస్థానం—శ్రీ శివశ్రీ పబ్లికేషన్స్, 7—35, నడికోట, కడప.

అనువాదం మధురంగాను, మూలానుసారిగాను కొనసాగిందనడానికి ఒక పద్యం—

పియా చాహై ప్రేమరస
రాఖాచాహై మాన,
ఏకమ్యానమే దో ఖడగ
దేఖా సునా న కాన.

గీ. ప్రేమరసమును గ్రోలెడి ప్రీతిగల్గి
యున్న, నభిమానమొప్పు డుండుండరాదు
రెండు కత్తులు నొకయొర నుండబెట్టు
కనుగనలేదు, వీనుల వినగలేదు.

## ఆంధ్ర కవులు

పద్యకావ్యం. నన్నయ, ఎర్రన, తిక్కన, భట్టుమూర్తి, శ్రీనాథుడు, బమ్మెరపోతన, తెనాలి రామలింగకవి, కందుకూరి రుద్రకవి, ముక్కుతిమ్మన, ధూర్జటి పింగళిసూరన్న, చామకూర వేంకటకవి, అల్లసానిపెద్దన, ములుగు పాపయారాధ్యులు, పాల్కురికి సోమనాథుడు, చిన్నయసూరి—ఈ వీరిని ప్రశంసించే పద్యాలున్నాయి. రచయిత శ్రీ ముదిగొండ జ్వాలాపతిలింగశాస్త్రి అయ్యవారు పుటలు— 78. వెల—1-50. ప్రతులకు—సరళా పబ్లికేషన్స్, బోస్‌రోడ్, తెనాలి

## చక్కని ఇంగ్లీషు రాయడమెలా?

ఆంగ్లభాషను నేర్చుకొనడానికి ఉత్సహించే వయోజనులకోసం ఉద్దేశించిన పుస్తకం రచయిత - శ్రీ ఎం. వి. రామరెడ్డి పుటలు—200. వెల—3—50. ప్రాప్తిస్థానం—శ్రీ రాధాకృష్ణ బుక్‌షాప్, మెయిన్‌రోడ్, జగ్గయ్యపేట, కృష్ణాజిల్లా.

## శాంతి దూతః

శ్రీ జవాహర్‌లాల్‌నెహ్రూ జీవిత చరిత్ర చిత్రించే రెండు సర్గల సంస్కృతకావ్యం. రచయిత—శ్రీ ముదిగొండ జ్వాలాపతిలింగశాస్త్రి అయ్యవారు. పుటలు— 40. వెల—1-00. ప్రాప్తిస్థానం రచయిత, ఈమని, తెనాలితాలూకా.

## ఊర్వశి

అచ్చతెనుగుకావ్యం. రచయిత—శ్రీ నారునాగనార్య. పుటలు 48. వెల—1—50. ప్రాప్తిస్థానం శ్రీ నారు నాగనార్య, శ్రీ ఆత్మారామవిహారం, సి. కె. రాచపల్లెపోస్టు, వయా రైల్వేకోడూరు, కడపజిల్లా.

### ఆణిముత్యాలు

సంస్కృత సూక్తుల పద్యానువాదం. అనువాదకులు — శ్రీ గొంపిచర్ల కృష్ణమాచార్యులు. పుటలు 40. వెల—తెలియదు. ప్రాప్తిస్థానం— రచయిత, తెలుగు పండితులు, గవర్నమెంటు జూనియర్ కాలేజి, భీమునిపట్నం.

### ఏకపద్యోపాఖ్యానము సవ్యాఖ్యానము

సాహితీ వ్యంగ్యరచన. రచయిత శ్రీ బోయి భీమన్న. పుటలు 104. వెల 2—00. ప్రాప్తిస్థానం—ప్రతులకు - మేఖలానికేతన్, ఐ. సి. 85, ఇర్రంమంజిల్ కాలనీ, హైదరాబాద్—4.

### శిథిలవిపంచి

ఖండకావ్య సంపుటి. రచయిత-శ్రీ అష్టకాల నరసింహరామశర్మ. పుటలు—60. వెల—రూపాయి. ప్రాప్తిస్థానం - శ్రీ వేంకటేశ్వర బుక్‌డిపో, సిద్దిపేట, మెదకుజిల్లా.

### కులనిర్మూలన

ఆంగ్లమూలం—డాక్టర్ అంబేడ్కర్, అనువాదం - శ్రీ బోయి భీమన్న. పుటలు—196. వెల. 3—00. ప్రాప్తిస్థానం — బాబాసాహెబ్ డాక్టర్ అంబేడ్కర్ మెమోరియల్ సొసైటీ; 10 1—18/3, శ్యాంనగర్, హైదరాబాద్—4.

### వెన్నమనసులు

సామాజిక నాటకం. రచయిత—శ్రీ తుమ్మల సోమేశ్వరరావు. పుటలు—140. వెల—3—00. ప్రాప్తిస్థానం - శ్రీ శ్రీనివాస పబ్లికేషన్స్, అనకాపల్లి, విశాఖజిల్లా

---

Printed and Published For Nageswara Rao Estates (Private) Ltd., by S. Nageswara Rao at the Andhra Patrika Press, 6 & 7 Thambu chetty Street, Madras-1, Editor : S. Sambhu Prasad.

Bharati November 7 th 1970 Regd. No. M. 1856



మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | KLVA104M101 |
| పుస్తకం పేరు | భారతి |
| తారీఖు | 07 February 2025 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 99 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | CT, BCI,iv,ii |
| లేని పేజీలు | 11,12, |
| తయారు చేసినది | akshaya |
| పేజీలు విడదీసినది | navya |
| స్కాన్ చేసినది | APS |
| పరీక్ష చేసినది | HEMA |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |